# మీరా (మాతృశ్రీ) జీవితం

## MEERA (MATHRU SREE) GEEVITHAM

By

R. INDIRA DEVI

ఆర్. ఇందిరాదేవి.

SRI AUROBINDO ASHRAM

PONDICHERRY

శ్రీ అరవిందాశ్రమం

పాండిచేరి

First Edition : August 1979

Copies : 1000



Paper is supplied to this book by Central Govt. at concessional price

అనంతప్రేమమూర్తులైన మాతారవిందులకు ప్రేమతో అర్పితము.



Price : 6-50

Printed at

Paper & Paper Products
VIJAYAWADA-2

# కృతజ్ఞతాంజలి.

మహిమాన్వితమైన శ్రీమాత జీవితమును సంగ్రహముగా వ్రాయు భాగ్యము తొలుత నాకు కలిగినది. కాని, అంతటితో నాకు తృప్తికలుగలేదు. తదుపరి శ్రీమాత జీవితచరిత్రను విపులముగా వ్రాయ సంకల్పించి కొంతవరకు కృతకృత్యురాలనైతిని. ఇందులో లోపములున్నను నేను తీసుకొన్న కథా వస్తువు ఆధ్యాత్మికతతో కూడినది కావున చదువరులు దీని నా మూలాగ్రముగ చదివి ఆధ్యాత్మిక ఐహిక సుఖానందములను పెంపొందించుకొనెదరు గాక!

ఇదివరకు నేను ఆంగ్లమున శ్రీమాత జీవితము (The Glory that is the Mother అను పుస్తకమును వ్రాసి దీని ప్రచురణార్థము వలయు సహాయమును, సహృదయులు, పుణ్యపురుషులునైన శ్రీ మేడూరు మోహనరావు గారి నర్థించితిని వారు ఆంగ్ల గ్రంథము తెలుగులోనికి దెచ్చిరి తరువాత తెలుగునందు రచించిన మాతృశ్రీ జీవితము కూడా శ్రీ మోహనరావుగారి కృషివలన శ్రీమాత శతజయంతి సమితివారు కూడ ఆయనకు చేయూత నొసగిరి. ఇంకను సాహిత్యసేవ చేయుటకు వలయుశక్తి సామర్థ్యములను వారి కీర్తి సుస్థిరముగా వెలుగొందునట్లు అనుగ్రహింపవలెనని భగవంతుని ప్రార్థించు చున్నాను.

నా వ్రాత ప్రతిని, భక్తులు విజ్ఞులైన శ్రీ కమలాకర వెంకట్రావుగారు సవరించి సహకరించిరి, వారికి నా నమస్కారములు. నా పుస్తక ముద్రణకు తోడ్పడిన శ్రీమాత శతజయంతి కమిటి వారికిని, శ్రీమాత జీవిత శేషములను ఆశ్రమ వాఙ్మయము నుండి వాడుకొనుటకు కనుమతించిన శ్రీ అరవిందాశ్రమ కాపీరైటు సంస్థవారికిని నా కృతజ్ఞత లర్పించుచున్నాను.

నా గ్రంధమును సమగ్రముగా పరిశీలించి తమ యమూల్యమైన తొలిమాట వ్రాసి పంపిన సత్యగుణసంపన్నులు, న్యాయకోవిదులు, సౌజన్యశీలురైన ఆంధ్ర ప్రదెశ్ ఉన్నత న్యాయస్థాన ప్రధానన్యాయమూర్తి శ్రీ చల్లాకొండయ్యగారికి నా కృతజ్ఞతా పూర్వకవందనము లర్పించుకొనుచున్నాను.

అర్థించిన తోడనే, అమితవాత్సల్యముతోను ప్రేమాతిశయముచే నంగీక రించి తమ పవిత్రమైన పీఠికను వ్రాసి యిచ్చిన రాజనీతిజ్ఞులును, ఉదార హృదయులును, ధన్యజీవులునైన ఆంధ్రప్రదేశ ప్రభుత్వ అమాత్యులైన శ్రీ, పి. వి. చౌదరిగారికి నా వందనశతము లర్పించుచున్నాను. వీరిరువురు శ్రీమాతారవిందకృపకు పాత్రులగుదురు గాక!

అనంతపురం.<br>
26—7—70.

ఆర్. ఇందిరాదేవి.

CHALLA KONDAIAH
CHIEF JUSTICE
OF ANDHRA PRADESH

H Y D E R A B A D
Date. 23-7-79.

# ముందుమాట

శ్రీమతి R. ఇందిరాదేవి తెలుగులో రచించిన "మీరా (మాతృశ్రీ) జీవితము"నకు ముందు మాట (Fore word) వ్రాయమని శ్రీ T. కోదండ రామారావుగారు (రచయిత్రి తండ్రి) పంపిన ప్రతిని ఆసక్తితో చదివితిని. ఇటువంటి రచనలు సక్రమముగా, సఫలీకృతంగా వ్రాయడం సులభముకాదు. ఏలనన "మీరా మాతృశ్రీ" జీవితం ఒకసామాన్య జీవిత కథకాదు, మాతృశ్రీ ఒకసంస్థ. ఆమె 1878 ఫిబ్రవరి 21 సాయం సమయమున పారిస్‌నగరంలో ఒక సంపన్న గృహస్థుల ముద్దుబిడ్డగా జన్మించెను. "యమ్ ఆల్‌ఫాసా మీరా" అనుపేరుతో పెరిగి బాల్యయౌవన దశలలో గూడా అసాధారణ వ్యక్తిగా పరిగణింప బడెను. ఈమెకు సంగీత చిత్రలేఖనములలో మంచి ప్రవేశమున్నది. 1919 సం॥ ప్రాంతములో మీరా బీజగుప్తవిద్యల నభ్యసించెను. "పాల్ రిచర్డ్" అను ఫ్రాన్సుయువకుని పరిణయమాడెను. ఆమె మనస్సు బాల్యయౌవన దశలందే దైవప్రయత్నమైన శక్తి, జ్యోతియం ధ్యాసలో ఉండెడిది.

అప్పుడప్పుడు తననుతాను మరచిపోయి ఏదో జ్యోతి ఆకర్షించుచున్నట్లు భావించెడిది. "శ్రీఅరవిందయోగి"అనే జ్యోతి హిందూదేశంలోనున్న పుదుచ్చేరిలో నున్నట్లు ఆమెకు 19 0 సం॥ ప్రాంతములో తెలిసి, శ్రీఅరవిందుల వారిని చూడ వలెనని చాలా తహతహ లాడెను. 1914 సం॥ మార్చి 29 సాయం సమయమున పుదుచ్చేరిలో పతీ సమేతముగా వారి దర్శనము చేసికొనెను. మీరా మాతలోని అతీతశక్తిని శ్రీఅరవిందుల వారు గ్రహించి, వారి సాహచర్యములో పరిపూర్ణత పొందెలాగా ఆశీర్వదించి సహకరించిరి. కారణజన్మురాలైన "మాతృశ్రీ" ఫ్రాన్సులో పుట్టి, పుదుచ్చేరిలో శ్రీఅరవింద యోగుల సాన్నిధ్య సేవాధర్మములో పరిపూర్ణురాలై మానవాళికి మార్గదర్శకురాలైన దైవాంశ సంభూతురాలు. నిరుపమాన, నిర్విరామమైన కృషితో నిశ్చలభక్తితో అచంచల ఆత్మవిశ్వాసముతో చేయు మానవసేవవలన మానవుడు లేక మానవతి ఏ రీతిగా దివ్యచేతనానుభూతిని పొంది, దివ్యసత్య తేజస్సును సాధించగలరనటానికి, శ్రీజనని జీవితమే నిదర్శనము. పరిపూర్ణత్వము, జ్ఞానము, శక్త్యానందములు, శ్రీజనని అంశములు నూతన మానవజాతి —ఉద్భవము, అతీతమైన మానవత్వము, దైవత్వాన్ని సంపా

దించటమే, శ్రీఅరవిందయోగి, మాతృశ్రీ మహాలక్ష్యము. మాతృశ్రీ అసాధారణమైన ఆదర్శజీవి; ఆశావాది; నిరంతర శ్రమజీవి; నిష్కామకర్మాచరిణి; ధ్యానము, సమాధిస్థితి, విశ్రాంతిగల యోగిని; బుద్ధిశాలియేగాక ధీశాలి; అన్నింటికిమించి మహామనీషి. మానవాళిలో దివ్యపరివర్తనము, దివ్యచేతనను వ్యాపింపజేయుట కొరకు నూతనతేజస్సు భూమిపై నవతరించి, నూతన ప్రపంచము, ఉత్తేజమైన నవీనజాతి ఉద్భవము జరుగునని శ్రీమాతృ శ్రీ అరవిందుల వారి అకాంక్ష, ఆశయము, అట్టి పవిత్రాశయసిద్ధికై వారిరువురు దీక్షతో మానవాళికి నిరంతర కృషిచేసిరి.

అట్టి మాతృశ్రీ జీవితరచన చేపట్టి సఫలీకృతురాలైన శ్రీమతి ఇందిరాదేవి అభివందనీయురాలు. మాతృశ్రీ "నూతనవర్ష సందేశములు" "దివ్యానుభూతులు," మాతృశ్రీ వాక్కులు, మున్నగు అంశములు కూడ, యిందు పొందుపరచి రచయిత్రి యీ పుస్తకమున కెంతో వన్నెతెచ్చినారు. శ్రీమతి ఇందిరాదేవి భక్తిశ్రద్ధలను వారి రచనలో విశదపరచిరి. 6వ అధ్యాయమునందు రచించిన "అధిమానసావతరణము," రచయిత్రికి అందుండిన పరిచయ జ్ఞానములకు నిదర్శనము, ఈ పుస్తకము ఆ బాలగోపాలమునకు ఉపయోగించును. ఈ పుస్తకరచనలో రచయిత్రి చాలావరకు విజయము సాధించినదని చెప్పవచ్చును.

ఇది ఆమె తొలిరచనకాదు. శ్రీఅరవింద, మాతృశ్రీలపై తెలుగులో యిదివరలో కొన్నిరచనలు చేసియున్నారు. రచయిత్రి తెలుగులోనేగాక, ఆంగ్ల భాషలో "The Glory that is the Mother," అను పుస్తకమును 29-7-76న ప్రచురించిరి. శ్రీజనని ఆశీస్సులతో యీ రచయిత్రి నుండి యింకను మంచి రచనలు మున్ముందు వెలువడి మానవాళికి మిక్కిలి ఉపయోగపడునని ఆశించుచున్నాను.

చల్లాకొండయ్య.
23-7-79

P. V. CHOWDARY HYDERABAD
Minister for Muucipal Administration. 25-7-79.
And End owments.

## పీఠిక.

మీరా (మాతృశ్రీ) జీవితచరిత్ర ఆధ్యాత్మిక జిజ్ఞాసువులు అందరు చదువదగినది. అరవిందయోగీశ్వరుని ప్రభావము భారతీయులపై మాత్రమేగాక యావత్ ప్రపంచముపై ప్రసరించినది పుదుచ్చేరిలోని అరవిందయోగి ఆశ్రమము ఆధ్యాత్మిక ప్రపంచమునకు రాజధానియైనది ప్రాక్ ప్రాచీనసభ్యతా సంస్కృతులు, అచ్చట సంగమించినవి. ఆధ్యాత్మిక పథికులకు అరవిందయోగి సజీవ దీపస్తంభమై, వెలుగుబాటలు చూపిన సుహృత్ మార్గదర్శకుడైన మహానుభావుడు.

పూర్వాశ్రమములో అరవిందుడు భారతదేశ స్వాతంత్ర యోధులలో అతిరథ మహారథకోవకు చెందినవాడు భారతదేశము యోగీశ్వరులకు పుట్టినిల్లు. ఆధ్యాత్మిక తేజస్సునకు జన్మభూమి. దేశభక్తుడైన అరవిందుడు యోగీశ్వరుడుగా మారి, జగత్కళ్యాణ సాధనకై, తన తపస్సును ధారపోసినవారు. ఆగస్టు 15వ తేది ఆ మహాత్ముని జన్మదినము, ఆ మహర్షి జన్మదినమే భారతదేశ స్వాతంత్ర్యోదయ దినమైనది. ఇది హేతువాదమునకు అతీతమైన దివ్యానుభూతిగా అరవింద శిష్యులు యెలుగెత్తి చాటుచుందురు.

అరవిందుని వేదాంతముచే ఆకర్షింపబడి, పుదుచ్చేరి ఆశ్రమమును చేరిన వ్యక్తులలో ప్రాతఃస్మరణీయ, శ్రీమతి మీరా. ఆమె పరసుదేశస్తురాలు. ఆధ్యాత్మికముగా ఆమె అరవిందుల సన్నిధి చేరుటకు ముందే పరిణత హృదయురాలు. అరవింద సాన్నిధ్యములో పరిపక్వత నావిష్కరించుకొన్నది. ఆమె రచనలు సుభాషితములు, ఆమె వ్రాసిన ప్రార్థనలు, 'జ్యోతిర్మయములు, మాతృశ్రీ' యను గ్రంథమున, అరవింద యోగీంద్రులు, ఆమె ఆధ్యాత్మికౌన్నత్యమును గూర్చి, ఉగ్గడించియున్నారు. అరవిందాశ్రమమునకు, ఆమె శక్తి స్వరూపిణి. అరవింద వేదాంతులకు జగజ్జననిగా ఆమె సాక్షాత్కరించినది.

భారతదేశమునకు స్వాతంత్ర్యములేని రోజులలో, శ్వేతజాతీ యాహంకారము మిన్నుముట్టి, వికటాట్టహాస విలయతాండవము చేయుచున్న సమయములో, ఫ్రెంచిదేశములో పుట్టిన, సంపన్న యువతీమణి, భారతదేశమునకు వెలుగు వెదకి

కొనుచువచ్చి, 'అరవింద సన్నిధిలో తన జీవితమును ఆశ్రమమునకు అంకిత మొనర్చుకొనుట ఒక అద్భుత వృత్తాంతము.

మీరా (మాతృశ్రీ) జీవితకథను మాత్రమేగాక శ్రీ అరవిందయోగి వేదాంతమును, మాతృశ్రీ సుభాషితములు, దివ్యానుభూతులు, భారతీయ పాశ్చాత్య సంగీత సంప్రదాయ సమీక్ష, మున్నగు విషయములను, సులభసుందర శైలిలో రచయిత్రి శ్రీమతి ఆర్. ఇందిరాదేవిగారు వ్రాసినారు. అరవింద వాఙ్మయమును ఆంధ్రులకు అందించుటలో శ్రీమతి R. ఇందిరాదేవిగారు చేసినసేవ ప్రశంస నీయము. శ్రీ అరవింద యోగీంద్రుని జీవితచరిత్ర, ఇందిరాదేవిగారు యిదివరకే వ్రాసియున్నారు ఇప్పుడు వీరు వ్రాసిన మాతృశ్రీ 'మీరా' జీవితచరిత్ర గూడ, తెలుగువారి ఆదరాభిమానములను చూరగొనగలదని ఆశించుచున్నాను.

పి. వి. చౌదరి.

25_7_79

# INTRODUCTION

తన్నుతాను మార్చుకొనలేకపోతే ప్రపంచమును గూడ మార్చలేరు. సమస్త విద్యలకు నవనాగరికత కాలవాలమైన ప్యారిస్ నగరమునందు మీరాదేవి విద్యాభ్యాస మొనర్చినది అక్కడ సాంఘిక, ఆర్థిక, రాజకీయ సమస్యలను గూర్చి తెలుసుకొను యవకాశమామెకు లభించినది. తల్లిగారు కేవలము పుస్తక పరిజ్ఞానముతోనే తృప్తి పడలేదు. ప్రతియొక విషయమును గమనించుచు అనుభవము ద్వార యెన్నియో విషయములను తెలుసుకొనిరి ఆమె యార్జించిన తనయనుభవమును, జ్ఞానమును ముందు తమ జీవితములో ప్రవేశపెట్టి బాహ్యసత్తాలో దృఢ బునాది యేర్పఱచు కొన్న తరువాత దానిని యితరుల సమస్యా పరిష్కారార్థము, ప్రపంచ బాధా నివృత్తి కొఱకు ధారబోసిరి.

"నా యిచ్ఛ సంకల్పముతో జనులను బాధనుండి విముక్తులను గావించుటకే నేను పనిచేయుచున్నా"నని యొకపరి శ్రీజనని నుడివిరి. సర్వత్రయందు దైవేచ్ఛను పాటించుటకు మానవుడు సంసిద్ధుడై అహంకార రహితుడై సర్వమును శ్రీజననికి సమర్పణ గావించినచో యామె అనుగ్రహమువలన అంతయు సమకూరును. మనో, వాక్కాయ కర్మలతో సర్వమును దైవమునకు సమర్పణజేయు అతీత మానవుల సృష్టికొరకే శ్రీ అరవిందాశ్రమము స్థాపింపబడినది. ఒక సందేశము నందు 'నూతన ప్రపంచమునకు ఊయలవంటిదీ ఆశ్రమ'మని శ్రీజనని నుడివిరి. 'మానవ స్వభావమును మార్చుట కష్టతరము; ఐనను మేము ప్రయత్నించు చున్నాము. దాని నమలుపరచుచున్నాము. అంతయు సుగమమేయగు'నని యొకపరి శ్రీజనని నుడివిరి.

తల్లిగారి నిర్యాణాంతరమామె దివ్యశక్తి పనిచేయుచున్నది. ఆమె సజీవముగ లేకున్నను సాధకులెల్లరును ఆమె యునికిని అనుగ్రహమును పొందుచున్నారు. ఆశ్రమవాసు లచంచలమైన విశ్వాసముతో తమ తమ పనులను నిర్వర్తించు చున్నారు. తల్లిగారి అనుగ్రహముచే యెల్లరును ఆధ్యాత్మికతయందు ప్రగతినొందు చున్నారు. తల్లిగారి కృపాకటాక్ష వీక్షణముతో యోగములో పురోగమింపగోరు ఆకాంక్షా పరులెల్లరును అతీతమానవులై భాసిల్లుచు నూతన ప్రపంచ నిర్మాత లగుదురు గాక!

# 1

## దివ్యమాత

॥శ్లో॥ యాదేవీ సర్వభూతేషు మాతృరూపేణ సంస్థితా ।
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః ॥

తాత్పర్యము:- ఏ దేవి సర్వభూతముల యందును మాతృరూపముగా వెలయుచున్నదో అట్టి పరదేవతకు నేను పలుమారు వందన మాచరించుచున్నాను.

॥శ్లో॥ నమోమాత్రే జగన్మాత్రే శ్రీ మిరాయై నమోనమః ॥
మహాశక్త్యై మహావ్యక్త్యై మహామూర్త్యై నమోనమః ॥

తాత్పర్యము:_ ఓ మాతా ! మిరాంబా ! జగజ్జననీ ! మహాశక్తిసంపన్నురాలును, మహాతేజోరాశియు, మహా స్వరూపము నైన నీకు నా నమస్కృతులు.

॥శ్లో॥ మహేశ్వరీ మహాకాళీ మహాలక్ష్మీ స్త్వమేవమే ।
మహాసరస్వతీ మాత ర్భజే త్వాం భవతారిణీం ॥

తాత్పర్యము :_ నీవే మహేశ్వరివి ! మహాకాళివి ! మహాలక్ష్మివి ! నీవే భవతారిణివి ! తల్లీ, నిన్ను ధ్యానింతును, పూజింతును, భజింతును.

ప్రతివారిని గర్భమున ధరించి, కని, పెంచి, పెద్దచేసి, తల్లి తన సర్వస్వమును ధారవోసి బిడ్డల అభ్యున్నతికై యెడతెగని కష్టముల కోర్చుకొనును. స్త్రీలే సృష్టికి మూలకారకులు. స్త్రీలులేనిచో సృజనశక్తియే లేదు ఈ ప్రపంచమే లేదు. మనమెల్లరు జీవించుటకు కావలసిన లోకజ్ఞాన మామె ప్రసాదించుచున్నది. తల్లి యే యెల్లరకు ప్రథమ గురువు. కావున మన ఋషులెల్లరును ముందు మాతృదేవికి నమస్కరించుమని చెప్పిరి. 'వందే మాతరం, మాతృదేవో భవ, న మాతుః

పఃదైవతం' అను మంత్రత్రయము నెల్లరకును బోధించిరి. 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ'_ అనగా జనని, జన్మభూమి స్వర్గమున కన్న మిన్న యను నట్లు మాతృశబ్దమునకు గల స్థాన మనంతమైనది, అద్భుతమైనది. సకల చరాచర భూతసృష్టి కాదిశక్తియే మాత. దివ్యమాత సృజన శక్తివలననే, ఆ శ్రేష్ఠమైన జనని సంకల్ప మాత్రముననే సర్వప్రపంచము సృజింపబడినది. ఈ దృశ్య జగత్తంతయు దివ్యశక్తివిలాసము, వేదాది ప్రమాణగ్రంథములన్నియు మాతృ శబ్దమునకే ప్రథమస్థాన మొసగినవి. ప్రథమస్థాన మొసగుటయే కాక "మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ, అతిథి దేవో భవ" అని వాక్కుచ్చినవి. కనుక మనము స్త్రీని ప్రత్యక్షదైవముగా భావించి పూజింతుము. ఆ శక్తినే ప్రకృతిశక్తిగాను మాతృశక్తిగాను తలంచి పూజింతుము. ఆ మాతృశక్తి యెంతటి యద్భుతమైనదో, అనంతమైనదో, అగాధమైనదో శ్రీ అరవిందులు 'మాతృశ్రీ' (The Mother) అను పవిత్ర గ్రంథమున విపులముగ వివరించి యున్నారు. శ్రీవారు, మాతకు మొదటి స్థాన మొసగి దైవమును జేరుమని ప్రబోధించిరి. ప్రకృతిలేనిదే పురుషుడు లేడు. ప్రకృతిశక్తియే మాతృరూపము ధరించ వలయును. ఆమెలేనిదే ఈ ప్రపంచములేదు. కనుక, శ్రీవారు మాతృశక్తిని ఆది శక్తియనియు, ఆమెనుండియే ఇతర శక్తులన్నియు గలిగెననియు జెప్పిరి.

భగవదిచ్ఛానుసారము మాతృశక్తి నిరంతరము కర్మలయందు నిమగ్నమై యుండును. సృష్టికిని ——— భగవంతునికిని మధ్యవర్తినిగా ఆమె నిలిచి కార్యములను జరుపుచుండును. మాత తన బిడ్డల కొరకై తన సర్వస్వము నర్పించి వారి యభ్యుదయమునకే పాటుపడును. తన బిడ్డలు ఆమె నెప్పుడు శరణు వేడెదరో అప్పుడు వారిని తప్పక లాలన పాలన చేయును. ఆమె కృప కంతులేదు. "ఆమెను దలచినవారికి ఆమె యండగా నిలిచి కావలసినవన్నియు సమకూర్చును. మాత తన బిడ్డలను నిరంతర మున్నత మార్గముననే తీసికొని పోవును. వారివారి అభిరుచులను, ఆకాంక్షలను బట్టి యెవరెవరి నేకార్యమున నియమించ వలయునో ఆమె యెరుకగలదై యుండును. కార్యదక్షత, సూక్ష్మబుద్ధి గల వారిని చకచక నడపించును. విద్యావిహీనులను, మోటువారిని, సోమరులను వారివారి గుణముల ననుసరించి అభివృద్ధి పరచును. సోమరితనమును ఆమె సహించదు. అట్టివారిని గట్టిగ దండించి చక్కజేయును. తప్పులను దిద్ది సవరించుటకు ప్రయత్నించును. తన బిడ్డలెట్టివారుగాని వారిని భేదదృష్టితో చూడదు. అందరికిని

హృదయమిచ్చి ప్రేమించును. తల్లిప్రేమ వర్ణనాతీతము. కనుకనే తల్లిని మించిన దైవములేదని చెప్పుట పరిపాటి.

ఆ మాతృశక్తియే సర్వవిశ్వశక్తి, మరియు ఈశ్వర శక్తి. ఆమెయే మహేశ్వరి, మహాలక్ష్మి, మహాసరస్వతి, మహాకాళి, పరిపాలనాశక్తి, భద్రతాశక్తి, ధన ధాన్య కనకాది వస్తుసంపత్తియు, జ్ఞానము విజ్ఞానము ఇత్యాదులగు అరువైనాలుగు కళలు ఆమెశక్తియేయైయున్నవి. ఆమెయే ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి స్వరూపిణి, ప్రకృతిలో జరుగు సర్వక్రియాకలాపముల వెనుకనుండు చిచ్ఛక్తి స్వరూపము ఆమెయైయున్నది. ఆమె యేది సంకల్పించునో అది తప్పక జరిగి తీరును. ఆమె నామరూపములతోను రూపరహితముగను వెలయుచున్నది.

శాక్తేయులు విశ్వశక్తిని దివ్యమాతగా నారాధింతురు. మాతను జగజ్జననిగ దక్షిణమార్గమున నర్చించునెడ మానవున కాధ్యాత్మిక శ్రేయస్సు గలుగును. దేవిని వామమార్గమున ఉపాసించినచో ఐహిక సుఖము లీడేరునే గాని దివ్యానందము కలుగనేరదు. దివ్యమాత కుండలినీ శక్తిరూపిణిగ మనలో నిద్రించుచుండును. ఆమెను మేల్కొలిపిన దివ్యసిద్ధులను బడయవచ్చును.

'పరమేశ్వరుని' తంత్రములు 'శివుడు' అని చెప్పినవి. దానినే శ్రీఅరవిందులు 'దైవము' (The Divine) అనుచున్నారు. సూర్యుడు—అతని ప్రచండ తేజస్సు, చంద్రుడు— అతని వెన్నెల, సముద్రము—తరంగముల వోలె, పరమ శివుడు—పరాశక్తి ఒక్కరే పరమశివుని శక్తియే పరాశక్తి. ఆమె సంకల్ప మాత్రముననే సృష్టి, స్థితి, లయములు కలుగుచున్నవి. ఆమెయే ఆద్యశక్తి, పరాశక్తి, జగదంబ. అందులకే కాబోలు శ్రీకాళిదాసమహాకవి శ్రీ రఘువంశ కావ్యారంభమునందు "జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ." అని పరమశివుని పరాశక్తిని భక్తిపూర్వకముగా స్తుతించినారు.

పరమేశ్వరుని ఆజ్ఞమేరకు ఆ పరాశక్తి తన సర్వశక్తిని వినియోగము చేయుటకై మాతృరూపమును దాల్చి ఈ జగత్తునందు వెలయుచున్నది. శ్రీ అరవింద యోగి నారాధించి తరించిన పవిత్రతేజోమూర్తియైన మాతృశ్రీ మనకెల్లరకును ఆరాధ్యదేవత. 'అమెయే మాత, జగదంబయో బిరాంబ, లోకజీవనా జీవనలోకః' అని చెప్పుట సమంజసముగ నున్నది. యోగాగ్నిమయ స్వర్ణశరీరిణియైన మహా

యోగేశ్వరియైనమాతృశ్రీ ఈ పృథ్వీతలమున దైవము నవతరింపజేసి దివ్యజ్ఞానముసు మానవులకు ప్రసాదించుటకై మానవరూపమున 'మాతృశ్రీ' రూపమున వెలయుచున్నారు. శ్రీమాత భగవదవతారమూర్తి. 'అవజానంతి మాం మూఢా మానుషీం తను మాశ్రితం' అని శ్రీ భగవద్గీతయందు శ్రీకృష్ణభగవానుడు నుడివిన రీతి. మానవ దేహమును పొందిన భగవదవతారములను గుర్తించుట సులభము కానేరదు. మాతృశ్రీ యొనర్చు కార్యమాల యెల్లర కవగతము కాదు. ఎవరైతే మనోవాక్కాయ కర్మలతో ఆమెకు తమ సర్వస్వము సమర్పించి శరణుబొందెదరో వారు మాత్రమే ఆమెను పరాశక్తిగా గమనించగలరు.

''శివఃశక్త్యాయుక్తో'' యని శ్రీశంకరాచార్య విరచితమైన "సౌందర్యలహరి'' యను కావ్యములో జెప్పినరీతిగా "ఈ ప్రపంచమున భగవాను డొనర్చు కార్యములు శక్తిద్వారా చేయుచు ఆమెవెనుక నిలిచియున్నా"డని శ్రీ అరవిందులు చెప్పినారు. వాస్తవ దృష్ట్యా శ్రీఅరవిందులు మౌనాలంకృతులును, ఏకాంతవాసప్రియు లగుటకును గూడ కారణమదియే. ఆయన శ్రీ జనని ద్వారా సమస్తకార్యములను నిర్వర్తించిరి.

మాతృశ్రీ కెట్లు ఆత్మసమర్పణ చేయవలయునో శ్రీఅరవిందులు సాధకులకు వ్రాసిన లేఖల ద్వార తెలిసికొనవచ్చును. శ్రీజననికి సమర్పణ చేయుటను గూర్చి మూడు నిబంధనలను శ్రీవారిట్లు విధించిరి.

1. శ్రీ తల్లిగారి రక్షణ ప్రేమలందు సర్వదా విశ్వాసము కలిగి యుండుము. దానికి వ్యతిరేకముగా నగుపడు సర్వదృశ్యములను ఇతర ప్రేరణలను నమ్మవలదు.

2. శ్రీ జనని నిన్ను రక్షించుటకు అవరోధకములైన సర్వభావోద్రేకములను తక్షణమే త్రోసిపుచ్చుము.

3. బాహ్య చిహ్నముల ప్రాముఖ్య మంతగా పాటింపవలదు. వానిని గురించి నీ పరిశీలన నిన్ను తప్పుత్రోవలో నడిపింప వచ్చును. ఆమె కున్మీలుడవగుము. నీ హృదయముతో ఆమె నారాధింపుము. అనగా ఉపరిభాగమందు ప్రాణమయమగు కోరికలతో గాక, ఆంతరంగిక హృదయముతోనని భావము. అనన్యభక్తి తాత్పర్యములతో ఆమెను గొలిచితివేని ఆ జగజ్జననిని నీవు కనుగొన

గల్గుదువు. సర్వదా ఆమె సాన్నిధ్యమం దుండగలిగి ఆమె నీకేమి యొసగుటకు కృషి సలుపుచున్నదో దానిని నీవు పొందగలుగుదువు.

అంతియకాక, తాముచేయున వన్నియు శ్రీజనని కర్పించి అంతరంగమం దామెతో సంబంధము కలిగి యుండవలయునని శ్రీ అరవిందులు నుడివిరి. అట్టి చైతన్యముతో చేయబడ్డ సర్వకార్యములు కర్మయోగమై సాధనాంశముగాపరిగణించ వచ్చుననిరి.

విరుద్ధశక్తులైన అజ్ఞానమును, అచేతనయు ఈ ప్రపంచమును దుఃఖమయము గను, కష్టభూయిష్ఠముగను, అధర్మమయముఃగను నొనరించు చున్నవి. హింసాత్మకమైన ఈ జగత్తునందు శ్రీజననిని సేవించినచో సమస్తబాధలనుండి విముక్తి గాంచెదరు. కల్పవృక్షపు నీడ వోలె, శ్రీజనని సాన్నిధ్య మత్యంత సుఖదాయక మైనది. కనుక వికృతమైన ఆలోచనలకు, తలంపులకు చోటివ్వక శ్రీజనని రక్షణ యందే మనముండుట శ్రేయోదాయకము.

"నా చేతుల నీడలో నుండుము. అవి నిన్ను సమస్తమునుండి రక్షించును.''

"నా తోడ్పాటునకు అభిముఖుడవు గమ్ము. అది నిన్నెప్పటికిని భంగ పఱచదు.''

"నా ప్రేమాశీస్సులలో తేలియాడి నా బాహువులయం దుండుము."

"పొరపాట్లను తప్పిదములను నేను చూడను. నీ యాత్మనుండి చైత్య పురుషుని వెలికి రప్పించి నీ సర్వసత్తను అతనిచే నడిపింప జేసెదను."

అని శ్రీజనని శ్రీముఖమున చెప్పియున్నారు. కాన, 'నీవే తప్ప నితఃపరం బెఱుగ' అని ఆమెకు సర్వస్వము నర్పించుట మన విధియైయున్నది. ఆమె తన కరకమలములతో ఒక్కసారి తన బిడ్డలను స్పృశించిన జాలును అది పరసవేదివలె పనిచేయును. ఆమె పాదపద్మములే మాతృసేవాతత్పరులకు జీవన ధనము. ఆమె దర్శన, స్పర్శలే మలయమారుతము వలె సేద దీర్చునని, మాతృశ్రీని మనోవాక్కాయ కర్మలతో సేవించి తరింతుముగాక!

# 2

## జగన్మాత అంశలు

జగన్మాతలో పూర్ణత్వము, జ్ఞానము, శక్త్యానందములు అనువాని కాటపట్టయిన నాల్గు శక్తులిమిడియున్నవి. ఈనాల్గు శక్తులును ఆమె అంశలు. ఈ జగన్మాత శక్తులు నాల్గింటిలోను ఆమె దివ్యత్వము మూర్తీభవించినది. ఈ శక్తుల ద్వారా ఆమె సమస్త ప్రాణికోటిని పరిపాలించును, సృష్టిని శాసించును. జగన్మాత యేక స్వరూపిణియై వివిధరూపములలో మనకు సాక్షాత్కరించును ఆమె మూర్తులనంతములు. ఆమెయే సమస్త సృష్టిని పరిపాలించుచున్నది. ఈశ్వర చిచ్ఛక్తియే జగన్మాత.

అజ్ఞానభూయిష్ఠమగు ఈ ప్రపంచమునకు జగన్మాత మహాశక్తియై యున్నది. విశ్వనిర్వహణమునకు, జగల్లీలావ్యాపారమునకు, జగజ్జనని శక్తుల యందును, మూర్తులయందును నాల్గు ప్రధానాంశలు విశదమగుచున్నవి. ఈ నాల్గు శక్తులు మహేశ్వరి, మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతి అను దివ్యనామములతో విరాజిల్లుచున్నవి. జగన్మాతఅంశలను గూర్చి శ్రీ శంకరాచార్యులు రచించిన 'సౌందర్యలహరి' అను గ్రంథమున ఇట్లు వివరించినారు.

॥శ్లో॥ గిరా మాహుర్దేవీం ద్రుహిణ గృహిణీ మాగమవిదో ।
హరేః పత్నీం పద్మాం హర సహచరీ మద్రితనయాం ।
తురీయా కాపి త్వం దురధిగమ నిస్సీమ మహిమా ।
మహామాయా విశ్వం భ్రమయసి పరబ్రహ్మ మహిషి ।

తాత్పర్యము:- ఆదిశక్తీ ! నిన్ను వేదాంతవేత్తలు సర్వలోక పితామహుని రాణివైన వాగీశ్వరివగు మహా సరస్వతివిగా ——— మాధవ మనోహరియైన మహాలక్ష్మివిగా ——— శ్రీ శంకర పత్నియైన పార్వతిగా జెప్పుదురు. నీవు ఈ ముప్వురికంటే వేరై నాల్గవదానవై ——— అనిర్వచనీయమైన,

మహిమాన్వితమైన మహాశక్తి సంపన్నురాలవై, మూలాధారమై, ఈ జగత్తును భ్రమింప జేయుచున్నావు.

మహేశ్వరి:— త్రిపురసుందరి, శ్రీ రాజరాజేశ్వరి రూపమున యలరారెడి పరబ్రహ్మస్వరూపిణియగు శక్తియే శ్రీ అరవిందులు తమ 'జనని' యను గ్రంథమున పేర్కొనిన శ్రీమహారాజ్ఞియైన మహేశ్వరి. (Imperial Maheswari.) ఈమెను మహాతంత్రములో సర్వమంత్రేశ్వరి, సర్వయంత్రేశ్వరి సర్వతంత్రేశ్వరి, సర్వయోగేశ్వరి యని చెప్పినారు. ఆమె సాకారమూర్తిని మహాకవియైన శ్రీకాళిదాసీ విధముగా వర్ణించెను.

॥శ్లో॥ చతుర్భుజె చంద్రకళావతంసే కుచోన్నతే కుంకుమరాగశోణే ।
పుండ్రేక్షు పాశాంకుశ పుష్పబాణ హస్తే నమస్తే జగదేకమాతః ॥

శ్రీ రాజరాజేశ్వరి సాకారయు, నిరాకారయైయున్నది స్త్రీగా ఆమెను లలిత యందురు. పురుషరూపమున ఆమె శివుడు. నిష్కళ రూపమున ఆమె పరమాత్మ. మహేశ్వరి యపారమైన జ్ఞానమునకు నిధి. మహేశ్వరి నాశ్రయించినచో యజ్ఞానము దూరమగును. అందులకే కాబోలు శ్రీ శంకరాచార్యులు 'సౌందర్యలహరి' యను గ్రంథమున దీని నీవిధముగ స్తుతించినారు.

॥శ్లో॥ అవిద్యానా మంతస్తిమిర మిహిరద్వీపనగరీ ।
జడానాం చైతన్య స్తబక మకరంద స్రుతిఝరీ ।
దరిద్రాణాం చింతామణి గుణనికా జన్మజలధౌ ।
నిమగ్నానాం దంష్ట్రా మురరిపు వరాహస్య భవతి॥

తాత్పర్యము:— జననీ : నీ పాదరజ మజ్ఞానుల అంతరంగమందున్న అజ్ఞానాంధకారమును రూపుమాపుటకు సూర్యమండలమున కాలవాలమైనది. జడమతులకు చైతన్యమను పుష్పగుచ్ఛమందలి మకరందము స్రవించుటకు ప్రవాహము వంటిది. దరిద్రులకు చింతామణి వోలె నీ పాదరేణువు కామితార్థఫల మొసగుచున్నది. ఈ సంసార సాగరమునందు నిమగ్నులైనవారికి వరాహరూపమును దాల్చిన విష్ణుమూర్తియొక్క దంతమగుచున్నది.

కనుక మహేశ్వరి యపారమైన జ్ఞానమునకు నిధి, సర్వజ్ఞ, సర్వాంతర్యామిని, సర్వశక్తి సమన్విత. ఆమె మహాజ్ఞాన స్వరూపిణియే గాక మహాసాత్త్విక మూర్తి కూడ. ఆమె ప్రశాంత మద్భుతము. అపారజ్ఞానమునకు నిధి గావున ఆమెను చలింపజేయున దేదియులేదు. భూత, వర్తమాన, భవిష్యత్తు లామెకు కరతామలకములే ! ఆమె సర్వులయెడ సమాన బుద్ధిగలది. కాని ఈశ్వరాజ్ఞమేరకు ఆమె కొందరి నుద్ధరించును, మరికొందరి నథఃపతితుల గావించును. అనగా సాధు జనుల నుద్ధరించును, దుష్టుల నంధకారమున ద్రోయును. జ్ఞానుల కామె పెన్నిధి; వారలకు దేదీప్యమానమైన జ్ఞానము ననుగ్రహించును. ఎవరెవరి చిత్తవృత్తి ననుసరించి వారివారిని నడిపించును. విరోధులు తలపెట్టిన నీచకార్యముల ఫలములు విరోధు లనుభవించునట్లొనర్చును. ఆమె సర్వాతీతురాలు, ఎట్టి బంధమును లేనిది. ఐనను ఆమెకుగల జగన్మాతృహృదయ మింకెవ్వరికిని లేదు. ఆమె కారుణ్య మనంతము. ఆమె దృష్టిలో ఎల్లరును-అసురులు, పిశాచములు, సమస్త విద్రోహక శక్తులుకూడా తన బిడ్డలే. వారు కూడ పరబ్రహ్మయొక్క అంశములే—అని చెప్పినారు. ఆమె తిరస్కారములు కూడ తాత్కాలికములే గాని శాశ్వతములు గావనియు ఆమె విధించు శిక్షలు కూడ ఆమె కరుణకు సూచకములే యనియు శ్రీ అరవిందులు వక్కాణించిరి.

మహాకాళి:—మహాకాళీ మూర్తి యొక్క స్వభావము వేరుగా నుండును. మహాకాళి సర్వశక్తిసంపన్నురాలు. ఆమె ఇచ్ఛ, సంకల్పము శౌర్యవంతమై అడ్డంకులను త్రోసిపుచ్చి మానవాకాంక్షకును, కృషికిని అతీతమై ముందునకుపురోగమించును. మహాకాళి స్వభావము వేరు. ఆమెయందు కార్యసిద్ధి కలుగజేయు ప్రబలశక్తి మరియు ఉద్రేకము కలవు. ప్రచండవేగమునకు ఆమె ఆటపట్టయినది. తక్షణమే ఆమె మనోవాంఛితఫలము నొసగును. సంపూర్ణ విజయమే ఆమె సొత్తు.

'కాళీం కళామాలిని విశ్వవంద్యామ్ కపాల ఖట్వాంగ ధరాం నృముండ మాలావిభూషామ్, మృగచర్మశోభాం, సుశుష్కమాంసాం చ శవాసనస్థాం విభీషణీం భీషయతీం సురారిం రక్తప్రియాం మాంసమదావ ఘూర్ణం?

అన్నటుల ఆమె స్వరూప మతి భయంకరమైనది. ఆమె స్వరూపమును గాంచినచో అసురులు భీతిల్లెదరు. ఈశ్వరద్వేషుల నామె ఎంతమాత్రము సహింప

నొల్లదు ఆమె సర్వశక్తిమంతురాలు, వీరమాత. కనుకనే రణరంగమునుండి యీషణ్మాత్రమును వెనుదీయదు. మానవు డవిధేయత కనబరచినచో కాళీమాత కఠినముగ శిక్షించును. అజ్ఞానులపట్ల ఆమె మహోగ్రయగును. భగవత్కార్యము లను నిర్లక్ష్యపెట్టినచో ఆమె యెంతమాత్రము సహింపదు. అవశ్యకమైనచో నిర్లక్ష్యపరునకు,కాలయాపకునకు తగిన శిక్షనొసగి మేల్కొలుపును. ఆమె కావేశము కలిగినచో అయ్యది రౌద్రాత్మకము. ఆమె గంభీర వదన: ఆమె దివ్య లేక సిద్ధ హస్తములు శిక్షణ రక్షణలకు నిలయములు: ఆమె ఆగ్రహ మెంత తీవ్రమో అను గ్రహము కూడ నంత తీవ్రమే: ఆమె కారుణ్య కటాక్షములు వర్ణనాతీతములు: ఉపాసకుడు లేక ఆరాధకుడు విరుద్ధశక్తులకు లోనైనచో, అతనిపై దాడిచేయు నా విరుద్ధశక్తులను ప్రతిఘటించును. వైరులపై ఆమె ఆగ్రహము వహించెనేని దాని నాప నెవ్వరికిని సాధ్యము కానేరదు. ఇట్లు వైరులపట్ల ఆమె ఆగ్రహ మధికమై నప్పటికిని, పూజ్యులు ఉన్నతు లామెను పూజింతురు, భజింతురు, ధ్యానింతురు. ఆమె పరివర్తనము కలిగించుననియు, నపవిత్రతను లోపములను పోగొట్టుననియు మహాకాళి నారాధింతురు.

మహాలక్ష్మి :—

"రత్నగర్భస్థితే లక్ష్మి పరిపూర్ణ హిరణ్మయి" అన్నటుల మహాలక్ష్మి సృష్టిలో సౌందర్య మాధుర్యమున కాటపట్టయినది. జీవితమున మరుగుపడిన బ్రహ్మానందమును స్పష్టపరచి దివ్యానందమున కాధారమును కల్పించునది మహాలక్ష్మి స్వరూపశక్తి.

లోక స్వభావమున అల్పత్వముండుటచే మహేశ్వరి సాన్నిధ్యము సాధ్యము కానేరదు. మహేశ్వరి శాంతకల్యాణ గుణశాలిని, ఆమె అతిదూరముగా నగుపించును.

మహాకాళి మహాభయంకరముగ, రౌద్రముగా అగుపించును లోక స్వభావ దౌర్బల్యమునకు ఆమె సాక్షాత్కార మతి దుర్లభము.

అయితే శ్రీ మహాలక్ష్మి కారుణ్యనిధి, కరుణారసమయి, మహావిష్ణు వక్షఃస్థల నివాసిని, మనోమ్మణి, మంగళవర ప్రదాయిని.

అనంత సౌభాగ్య సుఖప్రదాయిని, సౌందర్యరాశి గనుక శ్రీ మహాలక్ష్మికి

ఎల్లర మానసములను అయస్కాంతమువలె ఆకర్షించుశక్తి గలదు. దారిద్ర్య దుఃఖములను బాపును గనుక ఆమె సాన్నిధ్యమే పరమ సుఖదాయకమైన బ్రహ్మానందమును సంప్రాప్తింపజేయును. శుభకరుడైన దినకరుని నుండి కిరణ రశ్మి ప్రసరించు చందంబున శ్రీ మహాలక్ష్మి నుండి మంజుళ, మనోహరత్వము, లావణ్యము ప్రవహించును. ఆమె కటాక్షవీక్షణముల కెవ్వరు పాత్రులగుదురో, ఆమె మందహాస మెచ్చోట సౌందర్యమును వెదజల్లునో ఆ జీవులు పరమానందమును బొందుదురనుటలో సందియము లేదు. ఆమె దివ్యహస్తస్పర్శ సుఖకరము; మరియు అయస్కాంత సన్నిభము. ఆమె సిద్ధ, మృదు, హస్త ప్రభావము వలన దేహేంద్రియములు, మనస్సు నిర్మలమగును. ఆమె పాద పద్మములు పరమానంద సంభరితములు

అయితే శ్రీ మహాలక్ష్మి విధించు నియమములను పాటించుట యించుక కష్టతరమే! ఆమె సుప్రసన్నతను సుస్థిరముగా నిలుపుకొనుట గూడ కష్టతరమే! మనస్సునకును అంతరాత్మకును, తలంపులకును భావములకును, సకల బాహ్య ప్రవృత్తి విశేషములకును, పరస్పర సామరస్య సౌందర్యములే శ్రీ మహాలక్ష్మి వాంఛించు నియమములు.

'స్థిరా భవ మహాలక్ష్మి నిశ్చలా భవ నిర్మలే' అన్నటుల నిర్మలమైన మనస్సుతో, ఆకాంక్షతో ఎవరామె నావాహన చేయుదురో వారికామె ప్రసన్నురాలగును క్షుద్ర మలిన, కుటిల స్వభావములు మహాలక్ష్మి సాక్షాత్కారమున కాటంకములు. ఎచ్చట ప్రేమ, సౌందర్యము లుండవో అచ్చటి కామె రానొల్లదు. కల్మషభూయిష్ఠమైన ప్రదేశములనుండి ఆమె తరలిపోవును. ద్వేషము, స్వార్థము, మాత్సర్యము, ద్రోహము ఇత్యాది దుర్గుణము లుండినట్లు తోచినను అట్టి హృదయములలో శ్రీమహాలక్ష్మి క్షణమైనను నిలువదు. ప్రేమ, సౌందర్యముల ద్వార ఆమె మానవాళిలో దైవమును ప్రతిష్ఠించును. సర్వజ్ఞానాతీతమైన నిగూఢ రహస్యములను ప్రకటించును, భక్తిభావములను పెంపొందించును.

మహా సరస్వతి :-

జగన్మాతయంశమైన మహా సరస్వతిని గూర్చి శ్రీ అరవిందు లిట్లు వక్కాణించిరి: శ్రీ మహా సరస్వతి అపరిమితమైన శక్తిగలిగి లోపరహితమైన కార్య

మొనర్చుటకు సమర్థురాలు నిర్మాణము, అమలు జరుపుట,కల్పించుట యందామె నిమగ్నమై యుండును. మహాసరస్వతి సర్వమును సంపూర్ణముగా సుసంపన్నము గావించుటకు త్వరపడును. మహాసరస్వతి జగన్మాత క్రియాశక్తి; నలువురి లోను ఈమె కడు చిన్నది. అయితే కార్య నిర్వాహణమున నేర్పరి. మిగత మువ్వురి కన్న ఈమె భౌతిక ప్రకృతి సమీపమున నుండునది. మహేశ్వరి విశ్వ శక్తులకు విశాల మార్గములను నిర్మించును. మహాకాళి వానిని బలముతో నతివేగ ముగ నడపించును. మహాసరస్వతి వానిని పొందికతో గూర్చి కార్యనిర్వహణకు నాయకత్వము వహించును.

మహా సరస్వతి జ్ఞానప్రదాయిని. "జ్ఞానాత్మా చ తే విద్యాత్మా చ తే సర్వాత్మా చ తే త్వయ్యైవ చిత్తం వినివేశ్యతాం" అన్నటుల మహా సరస్వతి విద్యా,జ్ఞాన, సంప దలను ప్రసాదించును, సూక్ష్మబుద్ధి, క్షమాగుణము, సహజ జ్ఞానము— ఇత్యాదులను మహాసరస్వతి తన ప్రీతి పాత్రులకు ప్రసాదించును. మన యిచ్ఛ దృఢమైనచో, సద్భావ సంపత్తి యున్నచో ఈమె ప్రసన్నురాలగును. చంచలత్వము నీమె సహింపదు. తల్లివలె కోరికలను దీర్చును. ఆప్తులవలె మన కష్టముల నుండి విముక్తిగావించును. అహర్నిశము. మనకు ఉపదేశ మొనర్చుచుండును.

కనుక దివ్యమాతలో పూర్ణత్వము, జ్ఞానము, శక్త్యానందముల కాటపట్టయిన నాల్గుశక్తు లిమిడియున్నవి. ఆ మహనీయ మధురమూర్తి యైన మాత లోకముల కతీతమై పరమశ్రేష్ఠుడైన జీవునకును — సృష్టికిని సంబంధమును గూర్చుచున్నది. అంతయు జగన్మాత విలాసమే! ఆమె దర్శన భాగ్యమే జీవిత లక్ష్యము ! ఆమె నడకయే యెల్లరకును మార్గ దర్శకము ! మృత్యు పీడితమై యజ్ఞానాంధకార బంధురమగు నీ ప్రపంచములోని మానవాళికి సత్య, జ్ఞానములను ప్రసాదించుటకై మనయందలి యపారమైన ప్రేమవలన ఈ పృథ్వీతలమున అవతరించినది శ్రీమాత. ఆమెయే మిరాంబ ! ఆమెయే జగన్మాత, ఆమెయే పరాశక్తి ! అతి మానస శక్తి ! ఆమె మహత్తర శక్తులతో విరాజిల్లు చున్నది.

"శ్రీమాత యేకైక దివ్యశక్తి. ఇంతవరకు ఈ జడప్రపంచమునం దభి వ్యక్తము కానిదేదో దాని నవతరింప జేయుటకు సశరీరిణియై అమె పనిచేయు చున్నది. ఆమెతనపూర్ణ చేతనయందు దైవము యొక్క యితర అంశముల నన్నింటిని వహించియున్నది. 'శ్రీమాత' యొక్క రూపము ఒక్కటి మాత్రమే గాక వివిధ

సమయములం దనేక రూపములను గలిగియుండును. ఆమె యొక్క భౌతికశరీరము నకు వెనుక, అనేక రూపములు, శక్తులు, వ్యక్తిత్వములు ఆమెకు గలవు." అని శ్రీ అరవిందులు శ్రీమాతను గురించి సాధకులడిగిన ప్రశ్నలకు సమాధానముల నొసగిరి జగన్మాత అంశలలో మూర్తీభవించిన దివ్యమాత జీవిత విశేషములలో కొన్నింటిని తెలిసికొనుటకు ప్రయత్నించెదము గాక !

# 3

## శ్రీమాత నూతనశక్తి మూర్తిత్వములు

మహేశ్వరి, మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతి — ఇత్యాది మూర్తిత్వములే గాక దివ్యమాత యింకను ఘనతరమైన మూర్తిత్వములను గలిగియున్నదనియు, వానినీ పృథ్వీవాతావరణమున అవతరింపజేయుట కష్టతరమనియు శ్రీ అరవిందులు నుడివిరి. ఈ సాక్షాత్కారములలో, అతీతమానసోపలబ్ధికి ఆవశ్యకమైన ఆ సచ్చిదానంద మూర్తిత్వము మాత్రమే అత్యున్నత శ్రేణులయొక్క అతీత మానస సత్తాకును—అగాధజడపు లోతులకును నొక ప్రవాహము చేకూర్చునని శ్రీఅరవిందులు వాక్రుచ్చిరి. ఈ యభివ్యక్తము కాని ఆశ్చర్యకరమైన మూర్తిత్వమును గూర్చి శ్రీజనని యిట్లు చెప్పిరి.

"ఇంతవరకు పృథ్వీ వాతావరణమున కపరిచితమైన శక్తి ప్రేమలతోను, తీవ్రమైన బ్రహ్మానందముతోను ఆ దివ్యశక్తి యవతరించినది. ఆ జగజ్జనని రాకతో యీ భువియంతయు సంపూర్ణముగా మారి, నూతనమైన అద్భుతమైన అవకాశముల కాలవాలమైనది. ఆ మహాశక్తి స్వరూపిణి యిచ్చటనుండి తన కార్యముల నమలులో పెట్టవలయునన్న, కనీసము నిశ్చితమైన గ్రహణశక్తి గలవారితో సన్నిహిత సంబంధము నపేక్షించును. భౌతికమున, ప్రాణికమున ఆమెకు వలయు యోగ్యతలు గలిగి, స్వయముగా పూర్ణ నిర్మలత్వమును పొందిన బలముతో, దృఢ చిత్తముతో, సమబుద్ధి గలిగి ఆమె గొనివచ్చెడు బ్రహ్మానందము ననుభవించు

నొక్క మానవునైనను ఆమె కోరును. కాని యింతవరకావశ్యకమైన దాని నామె పొందలేదు. మానవులు సాధారణ మానవులవలె మూర్ఖముగనే యున్నారు. అతీత మానవులు గావలయుననెడి ఆకాంక్ష వారికి లేకుండుటయేగాక, దానికి వలయు యోగ్యతలు కూడ వారికి లేకున్నవి. తమ పరిణామములకు దగినట్లు వారు మానవ ప్రేమను వ్యక్తపరుప గలరు; పొందగలరు; కాని, పరమాద్భుతమైన దివ్యానందము వారి గ్రహణశక్తికి దూరము. ఈ జగత్తు ఆమె గొనివచ్చు శక్త్యానందములను స్వీకరించుటకు సిద్ధముగ లేనందున అప్పుడామె తన మూర్తిత్వము నుపసంహరించుకొన దలచును. అట్లు జరిగినచో, అది ఒక క్షోభకరమైన దుఃఖమే యగును. ఆమె యభివ్యక్తము కానున్న శుభసమయ మాసన్నము కాలేదు. కనుక క్షణమాత్రమామె సాక్షాత్కారము క్రియాత్మకము గాక నామమాత్రమే యగుననన్నమాట అక్షరాల నిజమే! ఐనను, కార్యనిర్వహణమున కామె శక్తిమంతమైన సహాయకారి! జనని మూర్తిత్వములలో భౌతిక పరిణామమునకు వలయు అమోఘశక్తి యీమెకు గలదు. దివ్యానందపు స్పర్శకు స్పందితమై బ్రహ్మానందమును చవిగొని, ఆ ఉత్తమ స్థితి నట్లేయుంచుకొన్న అణువులే యుత్తమ స్థితిని బొంది అమరత్వపు మార్గములో నున్న దేహాణువులు. ఒకే ప్రాణిక, భౌతిక సృష్టియందు బ్రహ్మానందముచే గలిగెడి పరమ సుఖము—మానవాత్మకమైన సుఖము రెండును ఒకచో నుండబోవు. బ్రహ్మానంద స్థితిని పొందగోరు వారు మానవ సంబంధమైన ఆనందాన్వేషణను సంపూర్ణముగ వదలివేయ వలయును. కఠినమైన సన్న్యాసతత్వమున మునుగక, కర్మయోగమున నుండి ఆనందమును పరిత్యాగము చేయువారెందరు గలరు? కర్మల మధ్యనే పరిణామము నొందవలయునని యెఱింగియు, కొందరు సుఖసంతోషములే జీవిత పరమావధిగా భావించి, సన్మార్గమును వీడి స్వయంతృప్తినే క్రమముగా అన్వేషించుచు స్వకీయ పరిణామమున కొకదుర్ఘటమైన అడ్డంకిని సృష్టించుకొందురు."

ఆ దివ్యశక్తి అవతరణమును గూర్చి శ్రీజనని యిట్లు నుడివిరి:—

"పరిస్థితులు కొంత మెరుగైనవనియు, అవకాశము లున్నవనియు దలచి ఆమె అవతరించినది. అవతరణము సాధ్యమనియు, విజయము కలుగుననియు దలచియే యామె అవతరించినది... ఆమె రాకతో రెండు లేక మూడువారములలోనే యీ ఆశ్రయవాతావరణమే గాక, యీ జగత్తంతయు ఆమె శక్తి ప్రభావముచే నిండి నిబిడీకృతమైనది. దివ్యానంద మద్భుతమైన శక్తిని సృష్టించుటవలన, కష్టతరమైన కార్యములు కూడ క్షణములో సిద్ధింప దొడగినవి.

దాని ప్రతిఫలములీ జగత్తంతయు వ్యాపించినవి. కాని ఈ శక్తి ప్రభావమును మీలో ఒక్కరు కూడ పొందలేదని నేననుకొందును. అయితే, శ్రీఅరవిందులు తమ నిర్యాణమునకు పూర్వమే ఈ శక్తి అవతరణను గూర్చి తెలిసికొన్నవారై నిశ్చితనముతో భయంకరమైన పోరాట మధ్యమున ఆమె సాక్షాత్కారమును గుర్తింప గలిగిరి. దీనిని స్వీకరించుటకీ భువి యనుకొన్నంత ప్రోద్బల మొసగక పోవుటకు కారణము నిశ్చితనము. అందువలన నేను నిశ్చితనములో యుద్ధము జేయుటకు పూనుకొంటిని. ఫలితము లేమాత్రము లేవని చెప్పుట లేదు. అయితే, ఆశించిన ఫలమునకు—పొందిన ఫలమునకు ఎంతో వ్యత్యాసము గలదు. మీరెల్లరు దివ్యావతరణకు సామీప్యమున నుంటిరి. ఆ వాతావరణములో మునిగి తట్టుకొన గల శక్తి, అవకాశము మీకుండినను దానిని వినియోగించుకొనక మీక్షుద్ర జీవితమునే మీరు కొనసాగించుచుంటిరి.''

ప్రస్తుతము దివ్యప్రేమను గూర్చి శ్రీజనని తెలియజెప్పిరి. ఈ ఇహలోక వాతావరణమున దివ్యజనని సాక్షాత్కరించినదని యిదివరకు తెలిసికొంటిమి. ఆ దేవత ఈ స్థూల జడప్రపంచమున విహరించుచున్నది గాన, ఆకాంక్ష, అభిరుచి గలవారికి జీవిత మానం దప్రదమే! ఆ దేవత సాక్షాత్కార మతీత మానసోపలబ్ధిని సార్థకము చేయుచున్నది. అతీత మానసశక్తియే దేవతయైన ఆనందమయి నవతరింప జేసినది. ఆమె స్పర్శచే ఈభువి పవిత్రమగుటకు, ఫలవంతమగుటకు సిద్ధపడినది. ఈ అవకాశమును విడువక జ్ఞాన పిపాసువు లెల్లరును ఈ దివ్యామృతమును గ్రోలి శ్రీమాతారవిందుల కృపకు పాత్రులైనచో ఈ భువి స్వర్గతుల్యమై మానవులై భాసిల్లెదరు!

# 4

## యుగ సంధి

త్రేతాయుగమున సత్త్వగుణ మధికముగానుండి రజోగుణము కొంత యుండినది. జనులు కర్మలయం దాసక్తి గలిగినవారై సర్వవిధములైన సుఖశాంతులతో జీవించెడివారు. ఇక ద్వాపరయుగమున రజోగుణ మధికముగ నుండెడిది.

సత్త్వగుణ మే కొంతయో యుండినది. తమోగుణ మతి స్వల్పముగ నుండెడిది. సంతోషముతోపాటు భయమునకు తావుండెడిది. ఇక కలియుగమున, తమోగుణ మధికముగ నున్నది. రజోగుణము స్వల్పమై యెచ్చట చూచినను వైరభావములు పెంపొందుచున్నవి. ఇతరులకు దారుణమైన దుఃఖమును గల్పించు దుండగులు కలి యుగమున కొల్లలు. ఇట్లు కాలానుగుణ్యముగ ఇటువంటివి సంభవించుట వలన దీనిని యుగధర్మ మందురు.

ఈ కలియుగములో మానవుని యందు పశుత్వము తాండవించు చున్నది. ఈ పశుత్వమును, మృగత్వమును కప్పిపుచ్చుకొనుటకు వేషధారులగుచున్నారు, నీతులు చెప్పుచున్నారు. మానవులు నైతిక మార్గమును వీడి రాక్షసత్వమును పెం పొందించుకొనుచు దాని కనుగుణముగా పనులు చేయుచు గ్రంథముల ననేకములను రచించుచున్నారు. అధికారముతో ఆస్తి పాస్తులను, అష్టైశ్వర్యములను పెంచుకొన డమే తమ జీవిత ధ్యేయముగా భావించుచు, ఈ రాక్షసత్వమును పెంపొందించు కొని రావణ కుంభకర్ణులవలె రాక్షసత్వముతో జీవించుచున్నారు. సుఖేచ్ఛ పోరుపడ లేక పంచ మహాపాతకములు చేయుటకు సంసిద్ధుడగుచున్నాడు. మానవుడు. అంతులేని ఆశతో, స్వసుఖము కోసము ఇతరుల జీవితములను రక్తపంకిలము చేయుచున్నారు దుర్మార్గులు. వేదాంతమును, యోగమును, సద్గ్రంథాలను, సద్గురువు లను ''చిమ్మచీకటి చిన్నగదిలో లేని నల్ల పిల్లి కూనను వెదకడము'' అని హాస్యము చేయుచున్నారు. భాగ్యవంతులకు, అధికార గర్వితులకు 'నిన్ను నీవు తెలిసి కొను' మంటే నవ్వువచ్చుచున్నది! వారి దృష్టిలో ఇది యధిక ప్రసంగము. చేతకానివారికే వేదాంతమని వలువుర భావన. కాని, అవివేకుల అంచనా ప్రకారము యోగులు, ఆత్మద్రష్టలు చేతకానివారా ? ముమ్మాటికిని కాదు. కొందరు అమృత త్వము నందుకొనుటయే గాక తోడి సోదరులకు 'శృణ్వంతు విశ్వే అమృతస్య పుత్రాః' అని తమ అమర సందేశమును వినిపించిరి. జీవితమును పరస్పర ప్రేమతో, శాంతి సౌందర్యములతో నింపిరి. బాహ్యాకర్షణ తగ్గిన కొలది అంతర్ని రీక్షణ అధికాధికమైనది. ఆధ్యాత్మిక వికాసముతో జీవితమును సర్వతోముఖముగా దిద్ది తీర్చడానికి పెద్దలు పూనుకొన్నారు.

ఇంతలో పరిస్థితులు తారుమారైనవి. భరతఖండముయొక్క భోగభాగ్యముల వైభవము ఖండాంతరములకు ప్రాకినది. భోగభాగ్య లాలసతో పాశ్చాత్యులు భారత

ఖండముపై దండయాత్రలు సాగించిరి. ఈ దండయాత్రల దాడితో మహర్షుల జీవిత ప్రణాళికలు ఛిన్నా భిన్నములైనవి. ప్రజలలో మరల భోగాభిలాష చిగురించినది. మనలో మన కైకమత్యము, సద్భావము లేకపోవుటచే దేశమును బలవంతులాక్రమించి దోచుకొనుటకు మంచి అవకాశము లభించినది. ఈ భరతఖండ మాంగ్లేయుల నిరంకుశ ప్రభుత్వముక్రింద నలిగిపోయినది. ఆంగ్లేయుల ప్రభుత్వాధికార బంధనమును తొలగించుకొనుటకు భారతీయులు తిరుగుబాటు చేసిరి. కాని ఆ తుది సాయుధతిరుగుబాటు నణచి ఆంగ్లేయులు తమ ఆంగ్ల సామ్రాజ్యమున భారతదేశమును కలుపుకొనిరి. భౌతికపదార్థశాస్త్ర పరిశీలనా పటిమ వలనను,పరిశోధనల వలనను ఆంగ్లేయు లపార విజ్ఞానవంతులై బాహ్యజీవన వికాసము నింతింత యౌననరాని యౌన్నత్యమునకు గొనిపోయి భారతీయులను దిగ్భ్రమ నొందించిరి. భారతీయులు పరధర్మాసక్తులైరి. అట్టి ఈ తరుణమున మానవజాతి యొక్క నిజధర్మము మఱుగుపడి స్పష్టముగా తెలియకపోవుటచే అధర్మము వృద్ధి నొందినది.

అప్పుడు, ఉత్కృష్టాధ్యాత్మిక మహాపురుషుడగు శ్రీరామకృష్ణ పరమహంస, శ్రీవివేకానందుడు, తదితర మహానుభావులు జ్ఞానజ్యోతిని వెలిగించుటకై ఈ కలియుగమున జన్మించిరి. శ్రీవివేకానందు డాధ్యాత్మిక ప్రవాహమును తీవ్రపిపాసువులగు పాశ్చాత్యులపై ప్రవహింప జేసి వారిని గూడ పునీతులను గావించెను.

॥శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం ।
ధర్మసంస్థాపనార్థాయ సమ్భవామి యుగేయుగే॥

అని భగవద్గీతలో జెప్పిన రీతి, ధర్మ సంస్థాపనార్థము, ఐహికజీవనమును దివ్యముగా పరిణమింప జేయుటకై శ్రీఅరవిందులు 1872 వ సంవత్సరమున జన్మించిరి. వారి ఆశయములను, అనగా సత్యమునకు సేవచేయుట, మానవకోటిని ప్రకాశవంతమొనర్చుట, పృథ్విపై దివ్యప్రేమ సామ్రాజ్యమును శీఘ్రముగా స్థిరపరచుట —ఇత్యాది కార్యములను సఫలీకృత మొనర్చుటకే మాతృశ్రీ 1878వ సంవత్సరమున జన్మించిరి. ఈ అమృతమృత్యు ప్రపంచములోనికి సత్య, తేజో, దివ్యజీవితామరానందములను తేగలుగునది మాతృశక్తి మాత్రమే!

బానిసత్వములో నున్న భారతదేశమునకు స్వాతంత్ర్యము సంపాదించుటకై గాంధీమహాత్ముడు, శ్రీఅరవిందులు, తిలకు,తదితర మహనీయులు ఆత్మతేజస్సుతో

స్వాతంత్ర్య విజ్ఞానముతో ప్రేరితులై స్వాతంత్ర్య సమరానికి పూనుకొనిరి. తను, మన, ధనములను ధారపోసి స్వాతంత్ర్యమును సంపాదింప సమకట్టిరి ఆ బాలగోపాలముగా బయలుదేరిన యుద్రేకానికి భయపడి, యుద్ధము లేకయే ఆంగ్లేయులు దేశాన్ని విడచిపోయిరి 1947 వ సంవత్సరము, ఆగస్టు 15 వ తేదీన, శ్రీఅరవిందుల జన్మదినమున, మనకు స్వాతంత్ర్యము లభించినది. సత్యాగ్రహ పద్ధతికి నాయకుడైన శ్రీగాంధీమహాత్ముడు స్వాతంత్ర్య సముపార్జన వరకే పని వచ్చినాడు. దేశము స్వతంత్రమైన తరువాత తత్ఫలితముగా వేసికొన్న ప్రణాళిక లన్నిటిని ఊహించిన రీతి ప్రభుత్వము నిర్మించినది. మానవుని జీవితమునకు కొరతలేకుండ జేయుటకై సాంఘిక, ఆర్థిక పరిస్థితులను దేశనాయకులు కొంతవరకు బాగుచేసిరి. దేశీయతను, జాతీయతను సమర్థముగా పెంపొందించుటకు కంకణము కట్టుకొనిరి. మన దేశనాయకులు విద్యాభి వృద్ధికై యెన్నియో విశ్వవిద్యాలయములను స్థాపించిరి. హృదయమునకు కావలసిన లలిత కళలు, భోగములకు కావలసిన ఫలితకళలు వృద్ధినొందినవి. కాని, ఆంగ్లేయుల నిష్క్రమణము తరువాత కూడ, వ్యక్తియందును, కుటుంబమునందును, ఆర్థిక రాజకీయ పద్ధతులందును స్వతంత్రభారతదేశమునకు వారే మార్గదర్శకులైరి. దీనివలన ప్రజలకు ధన కాంక్ష, కామపిపాస అధికమైనది. ఎక్కడ చూచినను రాగద్వేషాలు ప్రబలమైనవి. కలవారి హృదయము లోకరీతిగను, లేనివారి హృదయము లోకరీతిగను కుమిలి పోవుచున్నవి. మానవాభ్యుదయ మనిన కేవలము భోగ భాగ్యములు, సుఖములు, వసతులు, ఆర్థిక ప్రగతి ఇత్యాదులే యని పలువుర భావన. కాని, యివన్నియు చేకూరినను మానవునకు శాశ్వతశాంతి ఆనందము కలుగనేరవు. శ్రీకృష్ణపరమాత్మనితో సన్నిహితముగా నున్న అర్జుననకే కురుక్షేత్రసంగ్రామమున అజ్ఞాన మావరించెను గదా! ఇక సామాన్యులేపాటి! ఇట్టి అసుర ప్రవృత్తిని పరాకాష్ఠకు తీసికొని పోవుచున్న ఈ యుగములో జ్ఞానభిక్ష పెట్టువారెవరు? ఆత్మానుభూతిని, శాంతిని, ఆనందమును, దివ్యపరిశుద్ధతను, పూర్ణత్వమును అనుక్షణమున ప్రసాదించు వారెవరు! ఆమెయే జగన్మాత! ఆమెను గురించి శ్రీఅరవిందులు 'సావిత్రి' అను గ్రంథరాజమున ఈ విధముగ రచించిరి.

ఆమె పాదారవిందములచే, బాధాసంకుల జీవితమునకు
స్వస్థత చేకూర్చుటకును,

మానవుని అప్రకాశాత్మ నంటియున్న ముద్రలను
విచ్ఛిన్నము చేయుటకును,

ఆమె తేజమును ముకుళిత వస్తు
హృదయమందు భాసింప జేయుటకును,

ఆమె చేంతకు మాత్రమే యావత్ ప్రకృతియు
మౌనముగ చనుచున్నది;

ఆమె మాధుర్యపు స్వస్థానముగ నిట
సర్వము ఒకానొక దినమున నగు

ఆమె సామరస్యమందు వ్యతిరిక్తతలన్నిటి
రూపొంద జేయు;

ఆమెకొఱకే మన జ్ఞానారోహణము, మన
భక్తిపరామర్శయు నగు

ఆమె అద్భుత పరమానందమునందే
మనము వసించుదము,

ఆమె పరిగ్రహణమే మనబాధలను
పరమానందముగ మార్చు.

# 5

## శ్రీ జనని బాల్యయౌవన దశలు

మానవు డాంతరంగికముగను, బాహ్యముగను దివ్య చేతనలో నివసించుచు కార్యకలాపములు జరుపుచు వ్యవహరించుటయే ఆధ్యాత్మిక జీవన మనబడును. మానవునియందు భౌతికశక్తులు, దేహప్రాణశక్తులన్నియు వికసించుచున్నవే గాని ఆధ్యా

త్మిక మనశ్శక్తి మాత్ర మటులే మొగ్గవలె ముడుచుకొని యున్నది కాని. అది అట్లుండుటకు వీలులేదు. ఏనాడో ఒకనాడా మొగ్గ వికసించి తీరవలయును కదా! ఆ యాధ్యాత్మిక వికాసమునకు, అతీత మానసావిష్కరణ ద్వారా నూతన ప్రపంచా రంభమునకు, నిర్మాణమునకు దోహదకారులైనవారు మహాయోగీశ్వరులైన శ్రీఅర విందులు, మరియు శ్రీమాత. శ్రీ అరవింద చరణారవిందములను సేవించుచు తరిం చిన మాతృశ్రీ ఈ ప్రపంచ ఆధ్యాత్మికచరిత్రలో ఒక విశిష్టస్థానము నాక్రమించు కొన్నది. జగత్తును పరిపాలించు ఒక ముఖ్యదేవతయే ఈ భూలోకమున నవతరించి నది. ఈవిషయమునే శ్రీ అరవిందులు స్పష్టముగా 'సావిత్రి' అను గ్రంథరాజమున వివరించిరి. అందు తపోనిష్ఠుడైన అశ్వపతి దేవతను ప్రార్థించిన విధానమును గూర్చి యిట్లు రచించిరి:

ఓ విజ్ఞాన తేజః స్వరూపమా! విశ్వమాతా!
ఓ సృష్టికర్త్రి! నిత్యకళావధూ!
నీలో ఇమిడియున్న సజీవాకృతి నించుక
యీ పృథ్వీతలమున అవతరింప జేయుమా!
నీ యనంతత్వ మొక తనువునందే జీవించునట్లొనర్చుమా!

మర్త్యచరణములతో ఈ భూమండలమున
నడక సాగించు అమృతమయీ!

ఉచ్ఛ్రేయముల విహరించుచు ఒక ఘనమైన
పలుకు పలుక నిమ్ము

ఒక ఘనకార్యము చేత విధికవాటములను
తెరువ నిమ్ము

ఈ భువికిని—ఈ భూలోక మానవులకును
నీ మధురత్వమును ప్రసాదింపుమా!

ఈ ప్రార్థనా ప్రవాహ మిట్లుండ, ఇందులకు ప్రత్యుత్తర పూర్వకముగా ఆకాశవాణి యిట్లు పలికెను—

ఉగ్రతపస్వీ! ఓ అశ్వపతీ! అమిత
బలాన్విత మార్గదర్శకా!

నీ యార్తనాదము నాలకించితి
ప్రకృతి నుద్ధరించు ప్రచండ యోగశక్తి,
పరమాద్భుత దివ్యశక్తి
దివ్యమయ మొనర్చుటకు పృథ్వినవతరించు.

మరల తపోనిష్ఠలో నున్న అశ్వపతికి జగన్మాత, ఒక సుమధుర శాంత, గంభీర హృదయ దివ్యసంకల్పముతో భువి కరుదెంచునని నుడివెను. సర్వశక్తులాదేవీ మూర్తియం దేవిధముగ మూర్తీభవించు ననెను—

సౌందర్యము మూర్తీభవించి, ఈ పృథ్వి దివ్యమయమై చరించు
ఆమె నీల మేఘ కేశజాలమందు సుఖానందము ప్రవహించు,
వృక్ష సదృశ దేహమందమృత ప్రణయ
విహంగ మతి మహిమాన్వితమై ఆత్మరెక్కలల్లార్చు..........
శుద్ధ దివ్యవీణానాదము ఆమె దివ్యవాణియందు లయించు,
దివ్యఝరీ మంద్ర స్వరములు ఆమె దరహాసమున ధ్వనించు
... ... ... ...
వీర ఖడ్గ సదృశశక్తి ఆమె నావరించు
పరమ సత్యానంద జ్యోతి ఆమె నయనముల ప్రకాశించు.

అశ్వపతి తపఃఫలము సావిత్రి. తన తల్లి దండ్రుల నోముల పంటగా మాతృశ్రీ యవతరించినది. శ్రీ జనని అంతర్ముఖియై బాహ్య విషయముల కంత ప్రాధాన్య మొసగనందున ఆమె జీవిత విశేషములను గూర్చి విపులముగా ఎవ్వరికిని తెలియదు. ఐనను ఆమె తాత్కాలిక ప్రసంగములను బట్టి కొన్ని విషయములు మాత్ర మవగతమైనవి.

శ్రీ జనని 1878 వ సంవత్సరమున ఫిబ్రవరి మాసమున 21 వ తేదీన నవ నాగరికత కాలవాలమైన ప్యారీసు నగరమునం దొక శుభముహూర్తమున జన్మించిరి. వీరిది సంపన్నమైన, గౌరవనీయమైన కుటుంబము. ఈమెకు తల్లిదండ్రు లొసగిన నామధేయము యం. అల్ఫాస్సా మిరా. మానవచైతన్యమున కతీతమైన దగుటచే ఐదేండ్ల చిరుప్రాయమునందే తానీ లోకమునకు చెందినది కాదని ఆమెకు బాగుగా విదితము

పరమభక్తాగ్రేసరులైన ప్రహ్లాదునకు, ధ్రువునకు బాల్యము నుండియే భక్తి, జ్ఞాన, వైరాగ్యము లలవడినట్లు మాతృశ్రీకి చిరుప్రాయమునందే ఆధ్యాత్మిక

ప్రవేశము కలిగినది. శ్రీజనని దినదిన ప్రవర్ధమానమై యెన్నియో గ్రంథములను ప్రెంచి భాషయందు రచించెను. బహుముఖ ప్రజ్ఞావిశేషములను చూరగొనెను. కావుననే కేవలము గ్రంథరచన యందేగాక, సంగీతము, చిత్రలేఖనము ఇత్యాది లలితకళలయందును సాటిలేని ప్రతిభను గడించెను. శ్రీజనని రచించిన 'ప్రార్థనలు_ ధ్యానములు' అను గ్రంథము నుండి ఆమెను గురించిన విషయములు కొన్ని మాత్రము తెలియనగును.

మిరా (శ్రీజనని) జననీ జనకులు భాగ్యవంతులు. జనకుడు కోశాధికారి. ఆతని దొక లోకము. తన కార్యనిర్వహణమునందే నిమగ్నుడై యితర విషయములలో జోక్యము కలుగజేసికొనకుండెను. ఆతడు సత్యసంధుడు మరియు ఉదారుడు. ఇక ఆమె తల్లి ఐహిక జీవిత కాంక్ష పరురాలు. తన సంతానముగూడ ఐహిక వాంఛల ననుసరించి ఆదర్శప్రాయులు గావలయునని ఆమె నిరంతర మాశించు చుండెడిది. పువ్వు పుట్టగనే పరిమళము వెదజల్లు రీతి, చిన్నారి పాపయైన మిరా దివ్యానంద పరిపూర్ణయై ధ్యాననిష్ఠలో నుండెడిది.

ఈ చిన్నారిపాప కొద్దిగా అనుకొనుట కుపకరించు కుర్చీయందాసీనయై ఘంటల తరబడి ధ్యానము చేయుచు, దివ్యానంద పరిపూర్ణయై వెలుగొందు చుండెడిది. విజ్ఞానమయియైన, మహాధ్యానాధిష్ఠాతృ దేవతయైన ఆ పసిపాప తన శిరస్సుపై జ్ఞానజ్యోతిని గాంచెడిది. ఐదేండ్ల చిరుప్రాయము గనుక ఆ జ్యోతి యేమిటో ఆ పాపకు దెలియకుండినది. అత్యంత దేదీప్యమానమైన ఆ యోగాగ్ని యా బాలిక శిరముపై దాండవించుచు మస్తిష్కమును సంక్షోభ పెట్టెడిది. అర్థము చేసికొనగల వయస్సు కాదది; ఐనను ఒక మహత్తరమైన ఘనకార్యమును చేయ వలయుననియు, మానవులలో దివ్యచైతన్యము నుద్భవింప జేసి, యొక దివ్యమానవ నవ్యజీవనలోకమును సృష్టించు కర్తవ్యము తన కెంతేనియు గలదనియు ఆ బాలిక యూహించినది. కాని, ఆకుకూరలు, కాయగూరలమ్మువారికి రత్న, మాణి క్యముల విలువ తెలియని చందంబున, ఆమె వజ్రసంకల్పములగూర్చి గాని, ఆ బాలిక యోగపరిణామమునుగూర్చి గాని ఆమె జననీ జనకుల కెంతమాత్రము బోధపడ దాయె. కాని, వీనిని గురించి ఆ బాలిక కూడ చెప్ప నిరసించినది, యేదో విధముగ కొంత తెలియజేసినను వారెరుంగరైరి.

చిన్నారి పాపయైన మిరాకు ఏడు సంవత్సరముల వయస్సు వచ్చెను; ఏడు

సంవత్సరముల వయస్సు వచ్చినను చదువను వ్రాయను తెలియదు. అట్లని, ఆ బాలికకు కుశాగ్రబుద్ధి లేదని కాదు. ఏలనో, ఆ చిన్నారిపాపకు విద్యయం దప్పటి వరకు ఆసక్తి కలుగలేదు. పట్టుపట్టినచో కారణజన్ముల కసాధ్యమైన దేదియులేదు కదా! ఒకనాడీ చిన్నారి బాలిక తన సహోదరునితో బనారునకు వెళ్ళెను. అచట నొక పలకపై లిఖించిన అక్షరములను జూచి 'దానిపై యేమి వ్రాయబడి యున్న' దని మిరా యాతని నడిగెను అత డాశ్చర్యచకితుడై 'ఇంతమాత్రము చదువుట నీ కింకా తెలియదా' అనెను. మిరా, తనకు చదువుట వ్రాయుట తెలియదనియు తానింకను నేర్చుకొనలేదనియు ముక్తసరిగా ప్రత్యుత్తర మొసగినది. అందుల కామె సహోదరుడు పరిహసించెను. ఆ పరిహాసమా చిన్ని హృదయమును గాయపరచినది. ఐనను అది యామెపట్ల ఒక వరమాయెను. అప్పటినుండియు ఆ బాలికకు విద్య నభ్యసింపవలయునన్న తృష్ణ మెండాయెను. సహోదర సమేతయై, విద్యాభ్యాస దృఢ సంకల్పచిత్తయై గృహోన్ముఖియైనది తీవ్రాకాంక్షతో, పట్టుదలతో విద్యాభ్యాసమొనర్చినది. పిమ్మట మిరా ఒక పాఠశాలయందు ప్రవేశించినది. ఆమెకు బాల్యావస్థయందు నిరంతరము ఆధ్యాత్మికానుభూతులు కలుగుచునే యుండినవి. తనలో మానవశక్తి కతీతమైన దివ్యతేజ మొకటి పనిచేయుచుండుట ఆమెకు విదితమే! ఇది తనలోని అంతర్యామియని ఆమె గమనించినది. ఆ దైవశక్తియొక్క సంఘటన లనేకములు గలవు. అందులో కొన్నింటిని గురించి మాత్రము తెలిసికొనుట కవకాశము లభించినది.

మిరాకు చిరుప్రాయమున, అనగా ఏడు సంవత్సరముల వయస్సునందు, పదమూడేండ్ల ప్రాయముగల యొక బాలునితో పరిచయము కలిగినది. ఆ బాలకుడే ఈ బాలికతో పరిచయము కలుగజేసికొనెను. ఆ బాలుడు మిగుల అహంకారి. మీదుమిక్కిలి, బాలికలను హేళన చేయుటయందు కడు నేర్పరి స్వాభావికముగా గర్విష్ఠుడైన ఆ బాలు డొకనాడు, బాలికలను హేళన చేయుచు, వారెందులకును పనికి రానివారని చెప్పుచు వారిని తృణప్రాయముగ జూచుచుండెను. ఆ బాలకుని ప్రవర్తన మిరా కెంతమాత్రము సరిపడలేదు. తప్పుచేసినవారు దండనార్హులే కదా! ఎటులైనను ఆ బాలకునికి నచ్చజెప్పి వాని ప్రవర్తనను మార్చదలచినది మిరా. 'ఇకమీదనైనను ఈ హేళన చేయుటను మానెదవా లేదా' యని గట్టిగా మందలించినది. కాని, ఆ బాలకుడు తన స్వభావమును విడనాడడాయెను. ఇక భరింపజాలక మిరా, వాని కన్నను తాను వయస్సున చిన్నదైనను, కోపావేశముతో వానిని

క్రిందకు బడవైచెను. అట్టితఱి, ఆ బాలికలో మహాశక్తి యొకటి ప్రవేశించి మిక్కిలి బలము చేకూర్చెను అది దైవశక్తియేగాని అన్యథాగాదు. అదియే మహాకాళీ స్వరూప శక్తియని మిరా తన భావిజీవితమున గ్రహించ గలిగినది.

మిరా సామాన్యముగా ఆటపాటలతో ఆనందముగ కాలము గడిపెడిది. ఒకనాడీ బాలిక 'ఫోన్‌టన్ బ్లూ' సమీపమున నున్న అరణ్యప్రాంతముల కాటలాడుట కేగెను. స్నేహితురాండ్రు గూడ ఆమెను వెంబడించిరి. ఎల్లరును ఇంచుక సేపు అతిసంభ్రమముతో ఆటలాడిరి. ఆటలాడిన తరువాత ఈ బాలిక ఒక యెత్తైన పర్వతము నారోహింప మొదలిడెను. ఆ పర్వతపు పరిసర ప్రాంతములెల్ల నల్లని రాళ్ళచే గప్పబడి యుండెను. పర్వతారోహణమున కాలుజారి క్రింద పడబోవుతఱి, తన నెవరో యెత్తుకొని క్రిందకు దీసికొని వచ్చిరి. పర్వతము నుండి పడద్రోసినప్పుడు ప్రహ్లాదుని విష్ణువు రక్షించిన చందంబున, వాస్తవముగ దైవమే యా బాలికను సంరక్షించెననుటలో సందియములేదు. దైవరక్షణచే ఆ బాలిక యెప్పటి వలెనే తన కాళ్ళపై తాను నిలబడగలిగెను. ఈ యద్భుతమును గన్న యామె స్నేహితురాండ్రెల్లరు అచ్చెరు వొందిరి.

మహాత్ము లహర్నిశము, ఏకాంతమునే వాంఛింతురు; ఏకాగ్రత కలుగజేసికొనుటకు, ధ్యానవికాసము నొందుటకు తద్ద్వారా భగవత్సాక్షాత్కారమును కలుగజేసికొనుటకు మహానుభావులెల్లరును ఏకాంతవాస ప్రియులగుదురు. అటులనే చిరుప్రాయముననే మిరా యేకాంతవాసప్రియ యైనది. పండ్రెండు సంవత్సరముల వయస్సునందు ప్యారిస్ నగరమునకు సమీపమున నున్న ప్రఖ్యాతిగాంచిన 'ఫోన్‌టెన్ బ్లూ' పరిసర ప్రదేశమునకు ఏకాంతముగా వెళ్ళుచుండెడిది.

అదొక దట్టమైన అడవి; కడు పురాతనమైనది. అచ్చట దాదాపు రెండువేల సంవత్సరముల నాటి వృక్షములు కూడ నుండినవి. ఈ బాలికయైన మిరా ఒంటరిగా ఆ ప్రాంతముల కేగి ఒక వృక్షపు శీతలచ్ఛాయలో సుదీర్ఘమైన ధ్యానమందు లీనమై యుండెడిది. అట్టితఱి, ఆమెకు ప్రకృతి సౌందర్యముతో తన కెంతో సన్నిహిత సంబంధ మున్నటుల తోచెడిది. ఈ యరణ్యమున నుండెడి వృక్షలతాదులను, పశుపక్ష్యాదులను కన్నులపండువుగ తిలకించుచు, పరమసుఖకరమైన బ్రహ్మానందమున నోలలాడెడిది. ఆ మూగ జంతుజాలము లతి సన్నిహితమై ఆమెపై నాడుకొనుచుండెడివి ప్రయత్నించినచో అటువంటి యనుభవ మెల్లరును పొంద

వచ్చునని శ్రీజనని వాక్రుచ్చిరి. వృక్షపు శీతల చ్ఛాయలో ఆసీనులగు టలవరచు కొన్నచో ఆ వృక్షము యొక్క ప్రాణికప్రకంపనములను, చేతనను తెలిసికొనగలుగుదుమనియు, ఆ పశుపక్ష్యాదులు మానవులతో స్నేహానుబంధములకై అభిలషించు చున్నవని మనము గ్రహింతుమనియు, తల్లిగారు చెప్పిరి. వానికి కూడ అనురాగము, దయ ఇత్యాది సుగుణములు గలవనియు, వృక్షములు మనకు నీడ నిచ్చుననియు, జంతువులు మనకు రక్షణ యొసగుననియు అనుభవ పూర్వకముగ జెప్పిరి.

బాలికయైన మిరా తరచు అరణ్యప్రాంతముల కేగి యేకాంత వాసియై గడుపు చుండుటనుగూర్చి మనము తెలిసికొంటిమి. ఒకనాడామె అరణ్యప్రాంతమునం దేకాంతముగ నున్నతఱి, యేండ్ల తరబడి పెరిగి పెద్దదైన ఒక మాహావృక్షమును గొడ్డలితో కొట్టుటకు కొందరువ్యక్తులై ఆ విషయమును గూర్చి తమకు తామే సంభాషించుకొన దొడంగిరి. తనకు రానున్న యాపదను గ్రహించి తనను సమీపించిన మిరాతో ఆ మహావృక్షము ఆ యాపదనుండి తనను రక్షించవలసినదిగ ప్రాధేయపడినది. అంతట ఆమె ఆ యాపదనుండి దానిని రక్షించినది. ఈ సంఘటన వలన మాతృశ్రీకి సర్వప్రాణకోటియం దెంతటి దయా దాక్షిణ్యములు గలవో వ్యక్తమగుచున్నది.

పదమూడవయేట శ్రీజనని రాత్రులయందు ఒక సంవత్సరము పాటు స్వప్న వీధులలో విహరించెడిది. ఆ స్వప్నవృత్తాంతము లన్నియు ఆమె తమ దినచర్య పుస్తకమునం దీవిధముగ రచించెను.

"నా పదమూడేండ్ల ప్రాయమున, ఒక సంవత్సరము వఱకు ప్రతిరాత్రియు పవ్వళించగనే నేను నా శరీరమునుండి వెలుపలికి వచ్చి, మొదట గృహముపైకి, తదుపరి నగరముపైకి చాల యెత్తుగా లేచినట్లు నాకు గోచరించుచుండెడిది. నేను దేదీప్యమానమై వెలుగొందు నిడుపగు చొక్కా ధరించినట్లును; నేను పైకి పోగా నా స్వర్ణమయమగు అంగీ పొడుగై వలయాకృతిగ నా చుట్టు విస్తరించి, నగర మంతటికి గొప్పకప్పు వోలె నగుపించు చుండెడిది. అట్టితఱి, అన్నిదిశలనుండియు స్త్రీ పురుషులు, బాల బాలికలు, వృద్ధులు, రోగులు సుఖశాంతులులేనివారు నా సహాయము కోరుచు తమ కష్టములను, దుఃఖములను గూర్చి చెప్పికొనుచు వలయాకృతిగా సర్వత్ర వ్యాపించియున్న నా యంగీక్రిందకు జేరుచుండిరి. వారు నా

సహాయము కోరుచు నన్ను ప్రార్థించెడివారు. వారికి ప్రత్యుత్తర పూర్వకముగా నా అంగీ మృదువై సజీవమై ప్రతియొక్కరికి విస్తరించుచుండెను. వారు ఆ అంగీని స్పృశించినంతనే ఓదార్చబడి, సుఖవంతులును, బలవంతులు గనై వారి వారి శరీరములందు పునః ప్రవేశించిరి. ఇది నా కెంతో సుఖము నిచ్చెడిది.

పగలుచేయు పనులన్నియు, ఈ నా నిజజీవితమైన రాత్రియందలి ఉత్సాహ కార్యక్రమముతో సరిపోల్చిచూడ నిస్సారమగును జీవకళారహితముగ నుండెడిది. పలుమారు నేనట్లు పైకెగయగా నా వామ పార్శ్వమున నొక వృద్ధుడు మౌనాలంకృతుడై, నిశ్చలుడై, నావంక కరుణార్ద్రదృష్టిని సారించుచు, అమిత వాత్సల్యముతో, తన పవిత్ర సాన్నిధ్యముతో నన్నుత్సాహపరచుచుండెను. ఈ వృద్ధుడు మకమకలాడెడు ఊదారంగుగల నిడుపు టంగీని ధరించి—నాకు తరువాత తెలిసినట్లు–దుఃఖమానవుని—యొక్క స్వరూపముగ నుండెను."

పరికించి చూడ, ఈ సంఘటన శ్రీకృష్ణుడు గోవర్ధనగిరి నెత్తి గోపబాలురను కాపాడిన విధమును స్ఫురింప జేయుచున్నది. పై యనుభవమును గూర్చి శ్రీజనని యిట్లు విశదీకరించెను:

"ఈ గంభీరమైన, అనుభవైక వేద్యమైన, వాచామగోచర సత్యమును నా (శ్రీజనని) బుద్ధ్యనుసారము ఇట్లు నిర్వచించుచున్నాను.

అనేక పర్యాయములు—పగలు, రాత్రి—నేను, అనగా నా చేతన, సంపూర్ణముగా నా హృదయమునందు ఏకాగ్రత చెందియుండెను. అప్పుడు నా హృదయము అవయవముకాక, భావము కూడ కాక, స్వార్థములేని నిత్యమైన దైవప్రేమయై, నేను విశ్వవ్యాపినై, నా అనంతమైన బాహువులను విప్పి, అంతులేని దయతో దీనులను దుఃఖితుల ననుగ్రహించి, విశ్వమున కన్న విస్తారమగు నా యెదమీద చేర్చుకొని నట్లనుభవమును పొందితిని ... ... ... ... ...

ఓ దివ్యప్రభూ! మాటలు చాల నిస్సారములు, మానసిక భావములు సదా బాలచేష్టలగుచున్నవి ... ... ... తమకొరకు నా ఆకాంక్ష నిరంతరమైనది ... ... ... తమ తేజో వికాస శాంతిలో సర్వులు సుఖముగా నుందురుగాక"

మిరాంబ (శ్రీజనని) పదునారేండ్ల ప్రాయములో మానస సరోవరము నందలి రాజహంసి వోలె, కోమలాంగియై సర్వశక్తి సంపన్నురాలై భాసిల్లెను. ఆమె సుందర సులలితాంగము లానంద పారవశ్యమున దోగు యౌవన మందు, మిరాంబకు చిత్రకళయందు సాటిలేని ప్రజ్ఞ గడించవలయునన్న యభిలాష గలిగెను. అందు నిమిత్తమై యామె చిత్రకళాశాలలో విద్యార్థినిగా జేరెను. ఆ చిత్రకళాశాల యందు చిత్రలేఖన మభ్యసించు విద్యార్థిను లెల్లరి కంటె ఈమెయే చిన్నది. వయస్సున చిన్నదియైనను తోడి విద్యార్థినుల కన్న మిన్నయై లలితకళయైన చిత్రలేఖనము నతి శ్రద్ధతో నభ్యసింప దొడంగెను. తోడి విద్యార్థిను లెల్లరు చిత్రలేఖనము నందు శ్రద్ధ చూపకపోవుటయేగాక అంతకుమించి కలహకారిణులైరి. వారు పరస్పరము కలహించుకొన్నను, ఈమె మాత్రము వారి కలహములలో జోక్యము కలుగజేసికొనక తన కర్తవ్యమును సకాలమునకు నిర్వర్తించుచు ధ్యాననిష్ఠలో నుండెడిది.

మిరాంబ ప్రవర్తన ఆదర్శవంతమై, యనుసరణీయమైనను, తోడి విద్యార్థిను లెల్లరును ఆమెనొక వింతమనిషిగా నెంచసాగిరి. అంతటితో తృప్తినొందక సమయము దొరకినప్పుడెల్ల ఆమె వింతమనిషియని వాకొనుచు హేళన చేయసాగిరి. ఇతరులపై దోషము లారోపించుట మానవుల నైజగుణమై యున్నదికదా! కాని, వారి కాపద సంభవించినపుడో, లేక జగడ పరిష్కారమునకో మిరాంబ సహాయ మర్థించుచుండిరి. ఎల్లర మనోభావములను క్షుణ్ణముగ నెఱింగిన యామె వారి భావముల నతి ధైర్యముతో వెల్లడి చేసెడిది. గుప్తమైన వారి భావముల వెల్లడి యామెసేయునని విద్యార్థినులెల్లరును కుండెడివారు.

ఒకనాడు చిత్రకళాశాలకు బోధకురాలుగా నియమింపబడిన యొక బాలిక దురదృష్టవశమున చిత్రకళాశాలాధికారిణి యనుగ్రహమునకు దూరమాయెను. ఆ యధికారిణి ఆ బాలిక నెవ్విధముగనైన వెడలగొట్ట దలచెను. ఆ నిస్సహాయ స్థితిలో ఆ బాలిక అశ్రుపూరిత వదనయై మిరాంబ సహాయ మర్థించెను. అంతులేని దయతో ఎల్లర ననుగ్రహించుటకై శ్రీ జనని అవతరించెను కదా! ఆ బాలిక పేదరాలనియు వెడలగొట్టబడినచో కళాజీవితమునకే భంగము వాటిల్లుననియు దలంచి కరుణార్ద్రహృదయయైన మిరాంబ ఆబాలిక నెటులైనను కాపాడ సంకల్పించెను. ఆ చిత్రకళాశాలాధికారిణితో ఆ బాలికకు న్యాయము చేకూర్చుటకై ఈ వీరవనిత

పోరాడ సాగెను. తొలుత మిరాంబ ఆ యధికారిణితో వివేకయుక్తముగ సవ్యముగ వాదించెను. కాని, అధికార గర్వముచే ఆ చిత్ర కళాశాలాధికారిణి విజ్ఞప్తిగుసు దానిని పెడచెవిని పెట్టుటచే మిరాంబ అాగ్రహపూరితయై ఆ యధికారిణి యెముకలు పిండి అగునేమో యన్నంత బలముతో అణచివేసెను. ఈ చర్య అధికారిణిలో కొంత మార్పు కలుగజేసెను. తక్షణమే బోధకురాలాబాలిక ననుగ్రహించెను. ఇక్కడ కూడ మహాకాళి స్వరూపశక్తియే మిరాంబ నావహించెననుటలో సందియములేదు.

పాశ్చాత్య వాతావరణమున పెరుగుచున్న మిరాంబకు పదునెనిమిదవ ఏట ఎవ్వరి సహాయము లేకయే ఆధ్యాత్మిక వికాసము కలుగ జొచ్చెను. ఈ విషయమును గూర్చి ఆమె తమ శ్రీముఖము నుండి ఇట్లు చెప్పిరి:

"పదునెనిమిది—ఇరువది సంవత్సరముల మధ్యకాలమున నేను దైవసాన్నిధ్యైక్యానుభూతిని నిరంతర మనుభవించే చైతన్యస్థితిని పొందితిని. నాకు సహాయము చేయువారెవ్వరను ధ్యాసలేక, యేపుస్తక పరిజ్ఞానము లేక నా యంతట నేనే స్వశక్తితో పురోగమించితిని. కొంతకాలమైన తరువాత శ్రీవివేకానందుడు రచించిన 'రాజయోగ' మొక యద్భుత గ్రంథముగా నా కగుపించినది. గ్రంథరూపమున నాకు కొంత తెలియజేయువారు లేకపో పోలేదను భావన స్ఫురించినది. ఏండ్ల తరబడి చదివినను అవగాహన గాని దంతయు కొద్దిమా ములలోనే అర్థము చేసికొంటిని. నేనొక భారతీయుని దర్శించితిని. అతడు భగవద్గీతనుగురించి నాకు తెలియజేసెను. 'భగవద్గీత' ఫ్రెంచి భాషయందు రచింపబడిన ప్రతి యున్నది గాని అది యంత బాగుగా లేదు. ఆంగ్లమున కూడ బాగుగా రచింపబడలేదు. అట్టి తరి, శ్రీ అరవిందు లింకను భగవద్గీత నాంగ్లమునకు తర్జుమా చేసియుండలేదు. ఆ భారతీయుడు భగవద్గీతను చదువుమని నాకు చెప్పుచు 'భగవద్గీతను పఠించుచు శ్రీకృష్ణు నాంతరంగిక దైవముగాను, నీలోని పరమాత్మగాను దలచి ఆరాధించు' మనెను ఇటు లేదో ఒక పుస్తకమో, ఒక వ్యక్తియో నాకగుపించి 'నీ వీవిధమున నుండినచో దైవమార్గానురక్తవు కాగల' వని నాకు ప్రబోధమును కలిగించుచుండెను."

అంతరంగికముగా మిరాంబ కాధ్యాత్మిక వికాసము నిరంతరము కలుగుచునే యుండినది. చిత్రకళాశాలలో వింతమనిషిగా పరిగణింపబడు మిరాదేవి (శ్రీమాని) ఖంటియందు కూడ మౌనముగా నుండెడిది. ఆమె స్వభావ మితరుల యూహ

కందరానిది. ఆమె యరుదుగా నవ్వుచుండెడిది. ఆమె ప్రవర్తన కొంత విపరీత మగుటచే ఇరువది సంవత్సరముల ప్రాయమున కూడ తల్లితో చివాట్లు తినవలసి వచ్చెను. ఒకరోజున ఆమెతల్లి 'ఈ ప్రపంచ భారమంతయు నీ భుజములపై బడినట్లెల్లప్పుడంత భయంకరముగ నిశ్శబ్దముగ కూర్చుండుటెందులకు?' అని యించుక పరుషముగ మందలించెను. అందుల కామె 'అవును నిశ్చయమే! ఈ ప్రపంచ భారమంతయు నేనే మోయవలసియున్నది. అందులకే అంత భయంకర ముగ నున్నా' నని గంభీరముగ ప్రత్యుత్తర మొసగెను. ఇందలి అంతరార్థము తల్లి గ్రహింపజాలదాయె; తన బిడ్డ వెఱ్ఱియని భావించెను. ఒకసారి తన పుత్రిక తాను చేయుమని చెప్పిన పనిని సకాలమునకు నెరవేర్చలేదని చీవాట్లు పెట్టెను. అంత మిరాదేవి గంభీర వదనయై పార్థివ శక్తులేవి కూడ తనను శాసించనేరవని నుడివెను.

ఈ శతాబ్దారంభమున మిరాదేవి ఇరువది రెండు సంవత్సరముల ప్రాయమందు అల్జీరియాలో పోలెండు దేశీయుడైన గుప్తవిద్యావేత్తయైన థియోన్ వద్దను, ఫ్రెంచిదేశపు యువతియైన అతని భార్య వద్దను దివ్యగుప్త విద్యలను (Higher occultism) నేర్వ బయలుదేరెను. వేసవికాలమున ప్రతిదినము మధ్యాహ్న సమయములందు సమీపమున నున్న ఓలివ్ వృక్షపు నీడలో ధ్యానమందు నిమగ్న మయ్యెడిది. ఆ వేడిమిని ఆమె భరింపగలుగుచుండెను. ఒక నా డేకాగ్రత కలిగి తదేక ధ్యాన నిమగ్నయై యున్నతరి ఆకస్మికముగ ఒక విచిత్రమైన సంక్షోభ మామెలో కలిగి నయనములు విప్పార దిలకింపగా నొక పెద్ద సర్ప మామె కభిముఖమై యుండినది. అది పడగ విప్పి ఆడుటకు మొదలిడినది. ఆ విషసర్పము తనపై ఎందుల కంతటి ఆగ్రహము వహించెనో ప్రప్రథమమున ఆమెకు బోధ పడలేదు ఇంచుక సేపాలోచించి, దాని కన్నమునకో లేదా అది పోవు మార్గమునకో తానాటంకముగా నున్నదేమో నని ఆమె యూహించినది. ఆమె యూహ వాస్తవ మాయెను. ఆమె యూహించిన ప్రకార మావృక్షమున కొక తొఱ్ఱయున్నది. ఆ సమయమున ఏ మాత్రము కదిలినను సర్పము బుసలు కొట్టుచు కాటువేయునని ఆమె భావించినది. అందువలన ఆమె కదలక భయము జెందక ప్రశాంత చిత్తయై నది. అంత ధైర్యముతో ఆ సర్పపు నయనముల లోనికి తదేకదృష్టితో పరికించుచు తన సంకల్పశక్తిని సంపూర్ణముగ ప్రయోగించినది. కొంతసేపటి కది బుసలు కొట్టుట మాని యించుక శాంతించినది. ఇంకను తన సంకల్పశక్తిని ప్రయో

గించుచు దానినే గాంచుచు ఆమె తన పాదముల నొకదాని పిమ్మట ఒకటి కదలించినది. చివరకా విషసర్పము వెనుదిరిగి పోయి సమీపమున నున్న నీటికాలనులోనికి దూకినది. తదుపరి ఈ సంఘటనను గూర్చి మీరాంబ గుప్తవిద్యావేత్తయైన థియోన్ గారికి నివేదించెను. అతడిట్లు ప్రత్యుత్తర మొసగెను: "ఆ చెట్టు తొఱ్ఱలో సర్పము నివసించుట మాకెల్లరకు తెలియును. నీవు దాని మార్గమున కాటంకముగ నుండుటచే అది నీపై ఆగ్రహమూనినది. దానికి కొంచెము క్షీరము నొసగినచో మచ్చిక కాగలదు." అప్పటినుండి ఆమెకు సర్పములవలన భయము తొలగిపోయినది.

మీరాదేవి చిత్రలేఖనమునందేగాక సంగీతమునందు కూడ అనన్యమైన ప్రతిభను గడించెను. క్లెంసెల్ లో థియోన్‌గారి గృహమున పయానా వాద్యముండెడిది. పయానా వాద్యము వారి యింట నుండుట తెలిసియే మీరాంబ వారి గృహమున కేగునపుడు తన వెంట సంగీత పాఠ పుస్తకములను తీసికొనిపోవుచుండెను. ఆమె వారి గృహమున తరచు పయానావాద్యమును వాయించుచుండెడిది. ఒకనాడు శ్రావ్యమైన గీతమును శ్రవణానందకరముగ వాయించుకొని నిలిపిన పిమ్మట 'క్వాక్' 'క్వాక్' అను శబ్దమా పరిసరములందు వినవచ్చినది. ఆ శబ్ద మెచ్చటినుంచి వచ్చినదా యని చుట్టుప్రక్కల దృష్టి సారింపగా ఒక విచిత్రమైన అతిథి——ఒక పెద్దమండూక మామెకు గోచరించినది. అది పైకుటికిన కళ్ళతో ఆమె వైపు చూచుటకు మొదలిడెను. ఆమె మరల దానివైపు చూడగా అది మరల 'క్వాక్' అనెను. అప్పుడది అట్లనుటలో మరల పాడుమనెడి దాని భావమును గ్రహించి మరల యించుకసేపు పయానావాద్యమును మీరాదేవి మిక్కిలి శ్రావ్యముగ వాయించెను. ఆ వాద్యధ్వని వినవచ్చునంతవఱకు ఆనందపారవశ్యముతో అది బహుశ్రద్ధగా నాలకించెను. అది మొదలు ఆమె పయానా వాద్యమును వాయించునపు డెల్ల ఆ మండూక ముబికిన కళ్ళతో ఏకాగ్రతతో ఆనందముగ నాలకించుట గమనించెను. వాద్యమును వాయించుట నిలిపివేసినంతనే అది 'క్వాక్' అని అరచుచుండెడిది.

క్లెంసెత్ నుండి రెండవ పర్యాయము తిరిగి వచ్చునపుడు థియోన్‌గారు పాశ్చాత్యదేశములలో సంచరించుటకై మీరాదేవితో బయలుదేరిరి. అకస్మాత్తుగా ఒక పెద్ద తుఫాను రేగినది సముద్రము క్షుభితమాయెను. తరంగములు భయోత్పాత మొనర్చుచు పైకెగసి మిన్ను ముట్టుచుండెను. ఓడలో పయనించువా రెల్లరును భయముచే కంపించిరి. కొందరు దుఃఖింప దొడగిరి. నావికప్రధాని సహితము

భయకంపితుడై ప్రయాణీకులతో "మనము చాల అపాయస్థితిలో నున్నా" మనెను. అట్టితఱి, గుప్త విద్యావేత్తయైన థియోన్ మీరాంబ వైపు చూచి 'వెంటనే తుఫా నాపు" మనెను. నావిక ప్రధాని కది అర్థముగాక విస్మయ మొందెను.

అంత మీరాదేవి ఓడలోని తనగది కేగి తన భౌతిక దేహమును వదలి సూక్ష్మదేహముతో వాస్తవిక విషయమేమో గాంచుటకు సముద్రము పైకి వెళ్ళెను. అచ్చట అసంఖ్యాకములైన చిన్న ప్రాణులు జలముపైన,ఆకాశములో వెఱ్ఱినృత్యము చేయుచు ధ్వంసమొనరించుచుండుట గాంచెను. వారిని సమీపించి 'అమాయికులైన ప్రజలను హింసించుటవలన మీకు కలిగెడి లాభమేమి? దయచేసి ఈ హింసాత్మక చర్యల నిక నాపండి' అని వానికి నచ్చజెప్పి, సకల ప్రాణికోటికి హాని దల పెట్టుచున్న వానిని, ఆ హింసాత్మక చర్యలను విరమించునట్లొనర్చెను. కొంతసేప టిలోనే సముద్రము నిశ్చలమైనది. అప్పుడు తిరిగి ఆమె తనగది కేగి తన భౌతిక శరీరములో ప్రవేశించిన ది. పిమ్మట వెలుపలికి వచ్చి ఓడ పై భాగమునకు వెళ్ళి చూడాగా ఎల్ల రానంద సంభ్రమమున నోలలాడుచుండిరి.

భూమి కత్యంత సమీపముగ అణోరణీయాంశ జీవులు గల వనియు అవి భౌతిక నేత్రమున కదృశ్యమై ప్రత్యేకలోకమున జీవించుచు ప్రపంచ విషయములో జోక్యము కలిగించుకొనుచుండు ననియు తల్లిగారు చెప్పిరి. కాని, అవి భిన్న రూపాకృతి గలిగి తృప్తి జెందని కామములు, రాగ ద్వేషాదులతో కూడి ప్రపంచ మున నుండు సజీవులపై బడుచుండుననియు, అ దుస్సంకల్ప జీవులే సూక్ష్మక్రిము లనబడుననియు, వానిని గురించి తల్లిగారిట్లు చెప్పుచున్నారు: 'సూక్ష్మక్రిములు (microbes) సూక్ష్మ - భౌతిక ప్రపంచము నుండి వచ్చు ఈ ప్రాణమయ సత్యముల దుస్సంకల్పము యొక్క యంతిమ భౌతికపరిణామములే'. సూక్ష్మ క్రిములు సర్వత్ర నున్నవనియు, సత్తలో ఏదో ప్రవేశ ద్వారము కలిగింప బడినప్పుడే అవి హాని కలుగజేయగలవనియు మాతృశ్రీ నుడివిరి. సూక్ష్మజీవులు మానవాళి కేవిధముగ అపాయము కలుగజేయ సమకట్టునదియు, శ్రీజనని వానితో పోరాడి మానవులను సంరక్షించిన సంఘటన పైన వివరింప బడినది.

మిరాంబ ఆల్జీరియాలో థియోన్ గారి వద్దను ఆతని భార్యవద్దను దివ్యగుప్త విద్యలను నేర్చుకొనిరి. స్థూల శరీరమును వదలి, సమాధి స్థితిలో సూక్ష్మశరీరము

నకు ఇంకను ఊర్ధ్వముగా మహాకారణశరీరములోనికి ప్రవేశించి శరీరమును వదలు విద్యలన్నిటిని ఆమె యా దంపతుల వద్ద నభ్యసించిరి. పెక్కుమారు లామె ఊర్ధ్వ భూమికలకు పోయినపుడు మృత్యు వావరించినటుల శరీరము ప్రాణ రహిత ముగ నుండెడిది. అటువంటి స్థితిలో అనేకులు శరీరమును విసర్జించి పర మాత్మలో లీనమైపోయిరి. కాని ఆమెకు లయయోగ సిద్ధి కలిగినను ప్రపంచ దుస్థితిని గాంచి, జాలిపడి, దానిని దైవసామ్రాజ్యముగ నొనర్చుటకై ఆమె మరల శరీరప్రవేశ మొనర్చిరి

పదునొకండు — పండ్రెండేండ్ల మధ్యకాలమున మిరాంబ కెన్నియో ఆధ్యాత్మికానుభవములు కలిగెను. ఆ యనుభవములు పృథ్వీతలమునందు దైవ యథార్థతను స్పష్టపరచుటయే గాక మానవుడు మనో వాక్కాయ కర్మలతో దివ్య జీవనము చేయుచు ఉపలబ్ధి పొందినచో దైవమునం దైక్యమొందునని స్పష్టపరచి నవి. ఆమెకు నిద్రావస్థయందు పలువు రధ్యాపకు లగుపడి గుప్త దివ్యశక్తుల విధులను గూర్చి తెలియజేసిరి. తదుపరి వారిని భౌతికముగా గాంచుట తటస్థించినది.

మిరాంబకు భారతీయ సంప్రదాయములను గూర్చి అంత తెలియకున్నను భారతదేశమును తమ మాతృ దేశముగా భావించి సర్వదా ప్రేమించుచుండిరి. ఆమెకు బాహ్యముగను, ఆంతరంగికముగను ఆధ్యాత్మిక వికాసము కలుగుచునే యుండినది. గీతా విజ్ఞాన బోధకుడగు శ్రీకృష్ణ పరమాత్ముని గాంచు విశ్వాస మామె కెంతేనియు గలదు. ప్రఖ్యాత చిత్రకారిణి యగుటచే ఆ చిత్ర పటమును చిత్రించి ఆమూర్తిని ప్రత్యక్షముగ దర్శించు తరుణమునకై వేచి యుండిరి. 1910 వ సంవత్సరమున యోగీశ్వరుడైన శ్రీ అరవిందులు పుదు చ్చేరి యందు నివాసము చేయుచున్నారని ఆమెకు తెలియవచ్చెను. అంత భారతదేశమునకు రావలయునన్న కోరిక ఆమె యందు ప్రబలమైనది. భర్త యైన పాలురిచ్చర్డ్‌తో సహా భారతదేశమునకు రావలయునని సంకల్పించిరి. కాని, ఆమె కోరిక 1914 వ సంవత్సరమున సఫలీకృతమైనది.

# 6

## శ్రీజనని భారతదేశాగమనము

1914 వ సంవత్సరమున భర్తయైన పాల్ రిచ్చర్డ్‌తో గూడి మిరాంబ భారతదేశమునకు పయనమైరి. శ్రీ అరవిందుల దర్శనభాగ్యము తమకు కలుగుననియామెగారెంతయో సంబరపడిరి. ఓడ పుదుచ్చేరి సమీపించు కొలదియు నామె యానందమింతంతయని చెప్ప నలవి గాకుండెను. ఆ పట్టణపు మధ్య ఆమెకు దేదీప్యమానమైన వెలుగు గోచరించెను. పుణ్యభూమియైన భారతదేశముననున్న పుదుచ్చేరి పట్టణమే తమ యాధ్యాత్మిక జీవితమునకు సంపోషణని యామె నిర్ధారణ చేసికొనెను. 1914వ సంవత్సరమున మార్చి 29వ తేదీన పాల్ రిచ్చర్డ్ సమేతముగా అతిథిగృహమందు (Guest house) శ్రీ అరవిందులను ఆమెగారు దర్శించిరి.

శ్రీమతి మీరాంబ శ్రీ అరవిందులను సందర్శించిన దినమే యాధ్యాత్మిక ప్రాధాన్యము వహించిన శుభదినము. అదియే యాధ్యాత్మిక సంస్కృతి చరిత్రలో నొక నూతన ఘట్టమును సూచించునది. అంతియేకాదు అది యాధ్యాత్మిక చరిత్రలో ఒక నూతనయుగారంభము. అది చరిత్రకును, మానవకోటికిని తెలియనటువంటి ఒక నూతన పంథా. ఇది మానసికమునుండి అతీతమానసమునకు పోవు బాటను నిర్మించుటలో రెండు మహాశక్తులు కలసి స్థాపించిన యనంతప్రకాశ మార్గముగా నెన్నుకొనవచ్చును శ్రీ మిరాదేవి — శ్రీ అరవిందులను దర్శించుట — పూర్వకాలమునుండి ప్రపంచము నావరించియున్న సన్న్యాసమార్గములకు స్వస్తిచెప్పి పూర్ణయోగ విధానమునకు, అతీతమానస సామ్రాజ్య స్థాపనకును నవయుగ ప్రారంభ దశకును దోహదమిచ్చినది. దివ్యాభివ్యక్తికి జీవితము నొక క్షేత్రముగ స్థిరపఱచుటకు శ్రీ అరవిందు లవతరించిరి. దుఃఖము, మృత్యువు, అంధకారము — వీనితో దులతూగు పార్థివ జీవనము నమృతమయ మొనర్చుట కతీతమానస తేజశ్శక్తులు ముఖ్యావసరములై, మానవకోటి కల్యాణమున కీ దివ్యశక్తుల యవతరణను సాధ్యపరచుటకు మాతారవిందు లిప్పటి నుండి కృషిచేయ మొదలిడిరి. స్వర్గావతరణకు ధరణీతలము సిద్ధమాయెను. జడమును కౌగిలించుటకు పరమాత్మ ఊర్ధ్వమునుండి అవరోహించెను. ఈ గొప్ప ప్రయత్నమును సఫలీకృత మొనర్చుటకు శ్రీమాతారవిందులు మార్గదర్శకులైరి.

మాతృశ్రీ మిరాంబ దివ్యసాక్షాత్కారమును 1912 వ సంవత్సరమునసే పొందియుండిరి. ఆ విషయమును గూర్చి 1912 వ సంవత్సరమున నవంబరు మాసమున 19 వ తేదీన రచించిరి. తరువాత 28-3_1914 తేదీన (అది శ్రీ అరవిందుల ప్రథమ సందర్శనమునకు ముందు దినము), దిన చర్య పుస్తకము నం దీవిధముగ రచించిరి.

"ఓ ప్రభూ ! ప్యారిస్ నగరము నుండి పయనము చేసినప్పటినుండియు నెల్లెడలను తమయునికి విదితమగుచు తమవిధానమే యెల్లెడల నభివ్యక్త మగుట గాంచుచున్నాను. ఓ ప్రభూ ! మీకు వెలుపల యేక్షణములో గూడ నేను నివసించుట లేదు. ది జ్మండలములు మిగుల విశాలముగను, వీని లోతులు తేజోవంతముగను, అగాధముగను ఇంతకుముందెన్నడు నగుపించ లేదు. ఓ దివ్య సద్గురూ ! మిమ్ముల నింకను నధికాధికముగా తెలిసికొనుటకు, మేము ధరణీతలమున మాకార్యవర్గమును సఫలీకృతము చేయుటకును, మాహృద యాంతరాళములలో, మాతలంపులలోను, మాభావములలోను, మాకర్మలయందును తమ సాన్నిధ్య మెల్లప్పుడు నుండు నట్లనుగ్రహింపుడు."

ఈ ప్రథమ సందర్శన మగునంత వఱకు శ్రీ అరవిందుల యాదర్శ ములను గూర్చి శ్రీజనని కేమియు తెలియక పోయినను ఈ ప్రార్థనను బట్టి చూడగా వీరిరువురకుగల ఐక్యభావములు స్పష్టమగుచున్నవి.

1914 వ సంవత్సరమున మార్చిలో 29 వ తేదీన శ్రీ అరవిందులను దర్శించి, తల్లి గారీవిధముగ ప్రార్థించిరి. ఇదియే రాధికా ప్రార్థన.

## రాధికా ప్రార్థన

ఓ ప్రభూ: నా ప్రథమ సందర్శనమునందే నిన్ను నా హృదయేశ్వరునిగా నా యాత్మప్రభునిగా గుర్తించితిని. నా యర్పణమును స్వీకరింపుము.

నా సకల సంకల్పములును, నా సకలోద్రేకములును, నా హృదయమందలి రసానుభవములును, సకలేంద్రియ జ్ఞానమును, నా జీవనము నందలి సకల ప్రవృత్తు

ణువు, నా దేహమందలి ప్రత్యణువును, నా హృదయ శోణితమందలి ప్రతికణమును, సర్వస్వమును నీవే! నేనిక కేవలము నీదాననే! నిశ్శేషముగ, సంపూర్ణముగ నీదాననే, నాయెడ నీ యిచ్ఛయెటులనో నే నటులనే యుండెదను. నా కొఱకై జీవనమునో, మరణమునో, సంతోషమునో, దుఃఖమునో, భోగానుభవమునో, బాధనో నీవెద్దానిని నిర్ణయించినను నీనుండి నాకు సంప్రాప్తించు సమస్తమునకును నా సుస్వాగతము. నీవు ప్రసాదించు ప్రతివరము కూడ అహర్నిశముల నాకొక దివ్యవరమై దీప్తినొందుచు, అద్దానితో గూడ దివ్యానందమును నాకు దెచ్చియే యిచ్చును.

శ్రీ అరవిందుల దర్శన మాత్రమున ఆమె ప్రశాంతచిత్తయై, 1914వ సంవత్సరమున మార్చి నెల 30వ తేదీన (శ్రీఅరవిందులను దర్శించిన మరునాటిదినము) మీరాదేవి యీ దివ్యానుభవమును గూర్చి దినచర్య పుస్తకమునం దీవిధముగ వ్రాసికొనిరి

"ఓ ప్రభూ! సమగ్రముగా మిమ్ములను సాక్షాత్కరింప జేసికొని మీ సాన్నిధ్యమును పరిశుద్ధ చైతన్యముతో పొందినవారియెదుట నే నుపలబ్ధి పొందవలసిన దింకను చాల దూరముగ నున్నదని తెలిసికొంటిని. ఔన్నత్యము, ఘనతరము, నిర్మలత్వమును కొనిన దింకను నేను తెలిసికొనవలసిన దానితో సరిపోల్చి చూడగా అజ్ఞానాంధకార మయముగ నున్నటులనే తెలియుచున్నది. ఈ పరిజ్ఞానము నన్ను క్రుంగదీయుటకు బదులు, నా యీ కాంక్ష నుత్తేజపరచి బలపఱచుచున్నది. తమ నియమాను సారము తమ కార్యమును నిర్వహించుటకు అడ్డంకులను విజయవంతముగా తొలగించి తమతో ఐక్యమగుటకు ఇచ్ఛను బలపరచుచున్నది. కొంత కొంత దిఙ్మండలము ఖచ్చితమై మార్గము సుగమమై ఇంకను అధికముగా పురోగమించుటకు వీలగుచున్నది. వందల కొలది జీవులు తమోమయ కూపమున తల్లడిల్లినను తల్లడిల్లనిమ్ము.

నిన్నటి దినము మేము గాంచిన పురుషుడు పృథ్వియందున్నాడు. చీకటి వెలుగుగా మార్చబడు దినమాసన్న మగుననియు దైవ సామ్రాజ్యము భూమిపై స్థాపింపబడుననియు రుజువు చేయుట కాయన సాన్నిధ్యమే చాలును.

ప్రథమ సందర్శనము తోడనే మీరాంబకు జ్ఞానోదయమైనది. మీరాంబను గాంచినతోడనే శ్రీఅరవిందులకు గూడ ఆమెలో, యోగాభ్యుదయమును

పెంపొందింపజేయునొక నూతనాధ్యాయ ప్రారంభకమైన మహత్తర శక్తి ద్యోతకమైనది.

1914వ సంవత్సరము మార్చి నెల 29వ తేదీన శ్రీ అరవింద ప్రథమ సందర్శనమును పురస్కరించుకొని శ్రీజనని 'ఆయన లేనిచో నేను లేను, నేను లేనిదే ఆయన అభివ్యక్తుడు కా'డని నుడివిరి.

పుదుచ్చేరికి వచ్చిన ఆరవదినము నందు మిరాంబ తమ దినచర్య పుస్తకము నందీవిధముగ వ్రాసికొనిరి.

"నే నొక నూతన జివతమునందు ప్రవేశించినటుల భావించుచున్నాను. నా గతజీవితపు అలవాటు లిక ప్రయోజనకరములు కావు. ఒకప్పుడు దేనిని సిద్ధియని భావించితినో అది ఇప్పుడు సన్నాహ మాత్రమే యని తెలియుచున్నది. ఇంత వరకు నేనాధ్యాత్మిక జీవితమును గడపినటుల లేదు. నా నిజమైన యాధ్యాత్మిక జీవిత మిప్పుడే ప్రారంభించినట్లున్నాను.

ఓ ప్రభూ ! నన్ను సంపూర్ణముగా మనో, వాక్కాయ, కర్మలతో తమకు సమర్పించుకొని శ్వేత పత్రమువలె స్వచ్ఛముగా నుండవలయునన్న ఒక నిశ్చయమునకు వచ్చితిని. ఆ శ్వేతపత్రముపై (తెల్లని కాగితము) నెట్టి యొకుదుడుకులు లేకుండ సురక్షితముగ ఆధ్యాత్మిక చింతనను, మీ సంకల్పమును స్వేచ్ఛగా లిఖింప గలుగుదును. నా హృదయములో కృతజ్ఞత యుద్భవించుచున్నది. నే నన్వేషించుచున్న సోపానమును ఇప్పుడే చేరగలిగితిని."

దినచర్య పుస్తకమునందు 1914వ సంవత్సరమున మార్చి 7వ తేదీన ఒక ప్రార్థన నీవిధముగ రచించిరి.

"ఈ ప్రాతఃకాలమున నా ప్రార్థన అదే ఆకాంక్షతో మీవైపున కుద్గమించుచున్నది మనతో సన్నిహిత సంబంధముచే సర్వజనులు ప్రకాశవంతులై నూతన జీవితమున కుద్యుక్తులై, ధైర్య ప్రాకార మధ్యమున నుండునట్లానర్చుటకు వలయు బలమును క్రియాశక్తిని గలిగి, మీ ప్రేమను వ్యాపింపజేయుటకు, మీ ప్రేమలో నిరంతరము జీవితమును గడుపు చుండుట కొఱకై నేను ప్రార్థించు చున్నాను. జీవిత క్షతములను మాన్పుటకు వలయు శక్తి కొఱకై బాధలను, దుఃఖముల

నుపశమింప జేసి, ఆ స్థానమున వాస్తవికానందమును నింపుటకును, నీలో స్థాపితమై శుష్కించపబోని యథార్థ సుఖమును నింపుటకును నేను ప్రార్థించుచున్నాను.

ఓ ప్రభూ ! నా యద్భుతశక్తి కవిత మిత్రమా ! ఓ సర్వశక్తి వంతుడా ! మీరు మా యునికి యందంతటను ప్రకాశ మొనర్పుడు. మీరు మాత్రమే మా యందు వసించునట్లు, మా సత్తాను పవిత్రముగ రూపాంతర మొనర్పుడు."

1914వ సంవత్సరమున మార్చిలో 12వ తేదీన ఒక ప్రార్థన నిట్లు రచించిరి.

"ఓ ప్రభూ ! అనుదినము మిమ్ము గురించి బాగుగా తెలిసికొని మీకు సేవలొనర్చుటయే నా యేకైక యుత్కాంక్ష. బాహ్యపరిస్థితు లెట్లుండిన నేమి? అవి నాకు వ్యర్థముగా భ్రమ గొల్పునవిగా అనుదిన మగుపించుచున్నవి. బాహ్య సంఘట నలను గూర్చి స్వల్పముగా శ్రద్ధ తీసికొన్నకొలదియు నాకు ప్రాధాన్యముగా గోచ రించిన యేకైక సత్యమునందలి అధికాధికముగా శ్రద్ధ వహించు చున్నాను. ఇదే దనగా మిమ్ములను గురించి బాగుగా తెలిసికొని మీకు శ్రద్ధా భక్తులతో సేవ లొనర్చుట మే. ఈ తుదికొలకు మాత్రమే పరిస్థితులన్నియు ఉమ్మడిగా పనిచేయ వలసియున్నది. ఏ యభిప్రాయముతో మనము వాని నెదుర్కొందుమో అంతయు దానిమీదనే యాధారపడును. ఎల్లెడల మీకొఱకై నిరంతరాన్వేషణ, ప్రతి పరిస్థితి యందును మీ సాక్షాత్కారము కొరకై యిచ్ఛగించుట, ఈ వైఖరికోనే ప్రధానమైన శాంతి; సంపూర్ణమైన ప్రశాంతి, వాస్తవికతృప్తి లభించునది. అప్పుడే గంభీరతరమైన తరంగములతో తుఫాను రేగకుండ జీవనము వికాసమై, విశాలమై తేజోవంతమై ప్రసరించును.

ఓ ప్రభూ ! మీరే మా సంరక్షకులు !
మా కేవలానందము ! మీరే మా దివ్య ప్రకాశము !
మీరే మా పవిత్రప్రేమ ! మీ యాశాలత !
మా బలము ! మీరే మా జీవిత సర్వస్వము !
మా యునికి యొక్క యథార్థ సత్తా మీరే !
గౌరవ భావముతో, ఆనందార్చనతో, భక్తితో మీకు నేను నమస్కరించు చున్నాను.''

శ్రీజనని, 1914వ సంవత్సరమున జూన్ 26వ తేదీ నా డొక ప్రార్థన నిట్లు రచించిరి.

"ప్రభూ! జగత్తులో అభివ్యక్తమైన సామాన్య రూపముల కతీతముగ నుండు నట్లొనరింపుము. అట్లు నీవనుగ్రహించినచో నూతనాభివ్యక్తికి వలయు సాధనములు తమకు సమకూరగలవు."

ప్రతిదినము ఉషఃకాలమున 5 ఘంటల సమయమున తల్లిగారు కాశ్మీరు శాలువను కప్పుకొని తమగదిలో కిటికీవద్ద ఆసీనురాలై ధ్యానములో నిమగ్న మగుచుండిరి. ధ్యానాంతర మామె తమ యనుభవములను గూర్చి వ్రాయుచుండిరి. ఇటులామె తమ యనుభవములను ప్రార్థనా రూపకముగ రచించుటచె దినచర్య పుస్తకమంతయు 'ప్రార్థనలు—ధ్యానము' లతో నిండి పోయెను. ఆ దినచర్య పుస్తకములోని ప్రార్థనలు తమకుగాను వ్రాసికొన్నందువలన ఎవరికి చూపించక దాచియుంచిరి.

1914వ సంవత్సరమున రిచ్చర్డ్ దంపతులు శ్రీ అరవిందయోగి నెన్నియో మారులు దర్శించిరి. యోగీశ్వరియైన మిరాంబ శ్రీఅరవిందులతో యోగాభ్యాస మును గూర్చి సంభాషించిరి. శ్రీ అరవిందులు 1914వ సంవత్సరమున ఆగష్టు మాసమునందు 'ఆర్య' యను పత్రికను ప్రారంభింప నుద్యుక్తులైరి. ఆ ప్రచుర ణకు వలయు ధనము తామొసగెదమని రిచ్చర్డ్ దంపతులు చెప్పగా వారి సహ కారముతో ఆ పత్రిక ప్రచురింపబడి పేరు ప్రఖ్యాతులు గాంచెను.

మిరాంబ ప్రతిదినము కొబ్బరతో తయారు చేసిన తీపి పదార్థములను తీసి కొనిపోయి శ్రీ అరవిందులకు సమర్పించెడిది. అక్కడ కోకోపానీయమును కూడ తయారు చేయుచుండిరి. ఆ పానీయమును శ్రీఅరవిందులు, పాల్ రిచ్చర్డ్ సేవిం చెడివారు. ప్రతి ఆదివారము శ్రీవారు వారితో కలసి భోజనము జేయుచుండిరి.

# 7

## స్వదేశమునకు తిరుగు ప్రయాణము

## తదుపరి

## జపానులో నివాసము

శ్రీ అరవిందగురు చరణ సాన్నిధ్యమున మిరాంబ ఆధ్యాత్మికముగా పురోగమించుచుండిరి. శ్రీ అరవిందులు 'ఆర్య' పత్రికలో రచించిన వ్యాసములను ఫ్రెంచిభాషయందు ప్రకటించుచుండిరి. ఇంతలో ప్రథమ ప్రపంచ మహాభీకర సంగ్రామ మారంభమాయెను 1915వ సంవత్సరమున, ఫిబ్రవరి మాసమున పాల్ రిచ్చర్డ్‌గారికి ఫ్రెంచి ప్రభుత్వమునుండి దేశరక్షణార్థమై పిలుపువచ్చెను. ఫిబ్రవరి మాసమున 22వ తేదీనాడు మిరాదేవి పాలురిచ్చర్డ్‌తో సహా ఫ్రాన్స్ దేశమున కేగిరి. అట్టితటి, యామె దినచర్య పుస్తకమునం దీవిధముగ రచించిరి.

"ఆహా! యేకాంతము! అత్యంత తీవ్రమైనది ఏకాంతము! తమోమయ అంధకారమున తలక్రిందులుగ బడద్రోయునట్లు హర్నిశముల తోపజేసెడు బలవత్తరమైన యేకాంతము! నా జీవితమందెన్నడును ఏ పరిస్థితులయందు గాని నా జీవితసారమునకు విరుద్ధమైన పరిసరములందు వసించుచుండినట్లు నేనెన్నడును ఊహించని యేకాంతముగ నున్నదే........."

అని దుర్భరమైన తమ మానసికస్థితిని గూర్చి తెలిపిరి. భయానకమైన అజ్ఞానాంధకారమున బడద్రోయ బడినటులామె భావించిరి. కాని మరుక్షణముననే ఆమె యాకాంక్ష తీవ్రమై

"ఓ ప్రభూ! నేనెట్టి దౌర్భల్యమునకు లోనుగాకుండునట్లను గ్రహింపుము. నీ కార్యమెట్టిదైనను గానిమ్ము. విధేయమైన నిర్మల దృష్టిగల యొక సాధనముగ నుండునట్లు సమ్మతింపు" మని జెప్పుచు సమాధాన పడిరి.

ఆమె ప్యారిస్ నగరమునకు వెళ్ళి కష్టదినముల నత్యంత సహనముతో గడుపసాగిరి. ఆమె కాధ్యాత్మిక స్థితులు, సిద్ధులు కలుగుచునే యుండినవి. 1915—

1916 మధ్యకాలమున శ్రీజనని-శ్రీఅరవిందులు యోగానుభవములను గూర్చి ఉత్తర ప్రత్యుత్తరములను జరిపిరి. 26-6-1915 వ తేదీనాడు శ్రీజనని తమకు గలిగిన ఆధ్యాత్మికానుభవములను, సిద్ధులను గురించి యొక యమూల్యమైన లేఖ నిట్లు రచించి శ్రీఅరవిందులకు పంపిరి.

## శ్రీజనని శ్రీఅరవిందులకు రచించిన లేఖలోని అమూల్యమైన విషయములు

సంపూర్ణచేతన దైవ ధ్యానములో మునిగి నా సత్తా అంతయు సర్వోత్కృష్టమైన ఆనందాబ్ధినోలలాడెను.

తదుపరి ప్రథమముగా భౌతికశరీరము దాని అధో భాగములలో బలవంతముగా ఆక్రమింపబడి, మరల అంతటికి ని వ్యక్తిగతమైన హద్దులు పడిపోవునంతగా జడమైన ఇంద్రియ జ్ఞానములో కొంతకొంతగా పవిత్రమైన కంపాయమానముతో ఆక్రమించెను. ప్రతి ఒక అడ్డంకి యనెడు అభేద్యమైన కోటను పగులకొట్టుచు, ప్రతియొక యాటంకమును ధ్వంసము చేయుచు అత్యంత తీవ్రముగను, ఎడతెగకుండ అతిశయమగునటువంటి శక్తి, బలము అభివ్యక్తము చేయునట్లుగా, సత్త క్రమపద్ధతిలో ఘనతరముగను, అభివృద్ధికరముగను అతిశయించినది. భూమాతతో సంపూర్ణముగ ఐక్యమగునట్లుగ, అణువులు విస్తరించునట్లుగా దివ్యచేతనాత్మకమైన దివ్యశరీర మంబరమున సామరస్యముతో అతి సూక్ష్మముగా కదలిపోవు ఇహలోక సంబంధమైన భూగోళముగా నుండెను గోళాకారమైన తన దేహము విశ్వాత్మకమైన మూర్తిమత్వములోనే లాలింపబడునటుల చేతనకు తెలిసి బ్రహ్మానందమనెడి పారవశ్యములోనే దానిని విడచిపెట్టెను. అంతలో నది, తన దేహము విశ్వగోళముతో ఆకర్షింపబడి యొకటయినటుల భావించి విశ్వచేతనయై, సమస్త మచలమై, యాంతరంగిక యనేకత్వములో ననంతముగా కదలునట్లు భావించినది. విశ్వచేతన మనఃపూర్వకమైన అకాంక్షతో సంపూర్ణమైన సమర్పణతో దైవము కొఱకు గంతు వేసినది. పరిశుద్ధమైన, ప్రకాశవంతమైన యా కాంతి పుంజములో పెక్కు శిరస్సులు కలిగిన సర్ప మీ జగత్తునకు చుట్టుకొని యుండుట, దానిపై దేదీప్యమానమైన తేజస్సుతో ప్రకాశించెడి ఒక వ్యక్తి నిలుచుకొని యుండుట దర్శించినది. శాశ్వతసంజ్ఞయను జయోత్సాహముతో వ్యక్తి ఒకేసారి సర్పమును, జగత్తును సృష్టించి వశము చేసికొనెను. ఆ వ్యక్తి తన విజయవంతమైన బలముతో ఆ సర్పముపై భయపడక

నిల్చుకొని దానిని వశపఱచుకొనెను. ఆతని చూడ్కులే సర్పము నణగ ద్రొక్కి విశ్వమంతటిని ఆక్రమించుకొని దానికి శాశ్వతజన్మ నొసగెను. అంత చేతన యీ సత్తయై దాని ఆకృతి మరల మార్పునొందుచున్నదని గ్రహించి యాకృతి లేకయున్నను, ఆకృతులను కలిగియున్నదైన కొంతలోనికి దీసికొనబడి మార్పునొందని కొంత నయనమును సాక్షిని వీక్షించెను. అంత ఆకృతి యొక్క అంత్యడుగు గాఢ మాయమై చేతన తనకుతానే అనిర్వచనీయమైన, వాచామగోచరమైన దానిలో లీనమాయెను. మరల ఈ యిహలోకచేతన (భౌతిక చేతన) కున్మీలమగుట మెల్ల మెల్లగా, నిరంతరముగా మరియు స్థిరమైన వెలుగుతో, శాక్త్యానందార్చనలతో, అయితే నేరుగా జగత్సంబంధమైన ఆకృతులతో జొరబడక జరిగెను. సర్వశ్రేష్ఠనకును—శాశ్వత సాక్షికిని మధ్యవర్తిత్వము లేక ఒక నమ్రత గలిగిన సశరీరము గల ఆకృతి నేరుగా సన్నిహితముగా వస్త్రాలంకృతయై వచ్చెనేమో యన్నటులుండెను.

26-6-1915

నూతనతేజము నీ భువికి దెచ్చుటలో మాతారవిందులు చేసిన కృషి, వారు పొందిన కష్టపరంపరల నీలేఖలు తెలుపుచున్నవి. సాధకులు చేయు యోగసాధనకివి యుపయోగకరములుగాన కొన్నిమాత్రమిందు పొందు పరచుచున్నాను.

శ్రీజనని వ్రాసిన లేఖకు ప్రత్యుత్తర పూర్వకముగా క్రింది లేఖలను శ్రీ అరవిందులు రచించిరి. ఈ లేఖలను చదివినచో యోగమునందు శ్రీ జనని యెంతటి యున్నత స్థితికి వచ్చెనో తెలియనగును.

## శ్రీ అరవిందులు తల్లిగారికి రచించిన అమూల్యమైన లేఖలు

## 1

నీవు వివరించిన అనుభవమును యోగమని చెప్పబడు నవీన యోగశాస్త్రములు గుర్తింపక పోయినను, వాస్తవిక దృష్ట్యా అది యొక యపూర్వమైన వేద సంబంధమైనది, మరియు నది వేదపురాణములలో చెప్పబడు నొక దివ్య

తత్త్వ — పృథ్వీతత్త్వసమ్మేళనానుభవము. మనసు పైన ఉన్నట్లు చెప్పబడు పృథ్వి అనగా భౌతిక సత్తా మరియు చైతన్యము యొక్క మూర్తులే యీ శరీరము, ఈ ప్రపంచము. దైవము తోడి స్థూల సంయోగ సంభావ్యతను నవీనయోగము లంతగా అంగీకరింప జాలవు.

31-12-19 5

## 2

ఆధ్యాత్మిక పురోగమనమునందు కలిగెడు కష్టపరంపరలు మనకెల్లరకును సామాన్యమైనవే : ఈ యోగములో అభివృద్ధి చెందునపుడు సామాన్యమనోభవము లకు పూర్వస్థితికి గొనివచ్చెడి ప్రమేయము లెల్లప్పుడుండును. సత్తా అంతయు పూర్ణముగా పునర్నిర్మాణము చేయబడు వఱకీ పరిస్థితులుండును. మన స్వభావములో మోన్నిమ్నుఖతలకు దిగజారి బాధారహితమైన స్థితి యేర్పడువఱకును, లేదా బాహ్యవిరుద్ధ ప్రపంచము నుండి వచ్చు స్పర్శలకు లోబడనంతవరకు, లేదా మన చుట్టు సన్నిహితముగా నుండువారి మనఃస్థితికి లొంగనంతవరకు ఇటువంటి అడ్డం కులు కలుగుచునే యుండును.

సామాన్యయోగము సర్వసాధారణముగా యేకైక లక్ష్యముపై ఆధారపడి యుండును గాన అందు వెనుకకు మరలు ప్రమేయ మే కొంతనో కలిగియుండును; కాని మనము చేసెడి యోగము మిశ్రితమైనది. మరియు బహుముఖమైనది. ఇది గొప్పలక్ష్యము ఆశయముగా గలది కావున, ఉన్నత లక్ష్యములను లోన కలిగి యుండునది గాన ముఖ్యముగా ఆధ్యాత్మిక ప్రపంచమున నిరంతరము విరుద్ధశక్తులు మనలను వెన్నంటి అభివృద్ధిని భంగపఱచును గాన మనలో ఏ యొక్కరికి అఖండ విజయము చేకూరినను విరుద్ధశక్తులది వారెల్లరకు క్షీణదశ సంప్రాప్తమైనటుల భావించెదరు గాన, మన ప్రయత్నమా సంపూర్ణమునకు చేరుకొనువరకును, సుగమ ప్రగతిని మనము పొందలేము. సహాయము లేని స్వప్రయత్నముతో మనము విజయమొంద లేము. ఉన్నతము సమస్తైక్యతతో అధికాధికముగా పరస్పర సంబంధ

ముతో మాత్రమే యే పూర్ణతతోనైన మనము గెలువ గలిగినది. సంపూర్ణ సిద్ధిని పొంది కూడ మరల వెనుకకు మరలు పరిస్థితి నాకు (శ్రీఅరవిందులు) కూడ కలిగినది. ఈ యోగములో సంపూర్ణసిద్ధి కలిగినదని నొక్కి వక్కాణించుటకు నేను కూడ వెనుదీయుచున్నాను. ఈ తిరుగుబాట్లనుండి నేను సంబాళించుకొని మరల పురోగమించినపుడు, నూతనాధ్యాత్మిక వికాస లాభముతో నేను పురోగమించినట్లు తెలిసికొంటిని. పాక్షికతృప్తితోనే యే యొదుదుడుకులు లేకుండ నేను పురోగమించి యుండినచో నాకు లాభకరమైన పూర్ణసిద్ధి కలిగి యుండెడిది కాదు. నా పురోగమనమును గూర్చిన యోగపటమును నేను చిత్రీకరించి యుంచుకొన్నాను. గాన నా యభివృద్ధి నడుగడుగునా కొలుచుకొనుచు పురోగమించుచున్నాను. చేతనాభివృద్ధిచే సమష్టి పురోగమనము పొందుటవలన ప్రత్యేక నష్టములు పరిహరింపబడినవి. తుది గమ్యస్థానము దూరముగ నున్నది. కాని, అంతటి నిరంతర బలిష్ఠవిరుద్ధశక్తులు సన్నాహపరిచినను నేను వీనిని యెదుర్కొని పురోగమించుట వలన గమ్యస్థానము చేరుట తథ్యమని, నేను సఫలత నొందుదునని భావించుచున్నాను. అయితే, కాలము మన వశమున గాక ఇతర హస్తగతముగ నున్నది కాన, నేను వేసరికలను, అసంతృప్తిని దూరీకృత మొనర్చితిని.

యోగశక్తి పనిచేయుటకు మనసత్తాలోని అన్నిభాగముల యందును, మనోహృదయము లందు కేవల సమత్వము, నిర్మల పరిశుద్ధత, శాంతియుత బలము — ఇవి ముఖ్యావసరములు. ఈ దివ్యశక్తి అపరిమితమైన సహనముతో అతిక్రమించ కుందునటువంటి నిరంతరత్వముతో నాలో పనిచేయుచు ఇతర దుష్టశక్తుల ప్రయత్నములను త్రోసిపుచ్చి పురోగమింప జేయుచున్నది. పనివాడు తన పని నోపికతో చెక్కి సవరించుకొను చందంబున ఆ దివ్యశక్తినాలో పని చేయుచు నా బలహీనతలను సరిదిద్దుచున్నది. ఇతరము లన్నిటికి ఇదియే పరిస్థితి పునాదులుగ నున్నది. ఈ స్థితి పరివక్వమగుకొలది, ఆ యొక్క దివ్య సత్తాయే యందరి యందును, అన్ని పరిస్థితులయందును, అన్ని యంశములందును సర్వత్ర, సర్వదా పనిచేయుచు అన్నిటను సంసిద్ధ పరచుచున్నటుల నేను తెలిసికొనుచున్నాను. అదియే ఐక్యతను స్థిరపరచి ఆ యేకత్వము యొక్క ఆనందమును కలిగించుచున్నది. మన స్వభావ మీరెంటికిని వ్యతిరేకముగా నున్నది. మన స్వభావము భేద ద్వంద్వములకు కట్టువడి, వీని ఫలితముగ

దుఃఖమును ఫలరహిత కష్టమును ననుభవించును. మన సాధారణ, ప్రాణిక, భౌతిక స్వభావములు — దివ్యవిశాలత, ఆనందము, సమత్వమునకు విరుద్ధముగా నున్నవి. మనస్సు దివ్యమును కనుగొని ఆ యానందము ననుభవించినను, దాని నపరిశుద్ధ ప్రాణిక భౌతికములు క్రిందకు లాగి, మనస్సును కల్లోలపరచి దుఃఖమయ మొనర్చును. అందువల్లనే కాబోలు పూర్వతత్త్వములు వీనిని జయించుటకు బదులీ ప్రాణిక, భౌతిక కల్మషములపై విరక్తి జెంది సన్న్యాసమునకు మార్గమేర్పరచుకొని ప్రపంచమును విడనాడ జూచినవి: విజయము పొందవలయును, విరుద్ధ రిపుశక్తులను జయించి పరివర్తన మొనరింపవలయును గాని, వానిని త్రోసిపుచ్చగూడదు, రెచ్చగొట్టగూడదు.

ఏకత్వ ముపలబ్ధి నొందినపుడు స్థితిరూపకమైన సగము పని ముగియును కాని, గతిరూపకమైన మిగత సగముపని మిగిలి యుండును. ఇచ్చటనే ఈ ప్రకృతిలో భగవానుని శక్తిని మనము చూడవలసియున్నది — ఆ భగవానుని శక్తియే హిందూమత సంప్రదాయము ప్రకారము కృష్ణుడు — కాళి అని చెప్పబడుచున్నది. ఈ కాళీశక్తియే నాలోను జగత్తులోను నెల్లెడల పనిచేయుచున్నది. ఆ ప్రభువే తన శక్తి ద్వార నన్నును నా శక్తుల నుపయోగించుచు నన్న నుభవించుచున్నాడు. నాలో 'నేను' అనునది ఇంకేమియు లేదు. సర్వము, నాలో ఉన్నదంతయు కృష్ణ—కాళి లీల: తిరుగుబాట్లు, అపజయము లున్నప్పటికి ఈ స్థితి ఉపలబ్ధి పొందినది. ఐనను, ఈ స్థితి పరిపక్వమైనప్పుడు దివ్యజ్ఞానము, దివ్యశక్తి స్థిరపరుపబడి, దివ్యలీల ప్రారంభమగును. తరువాత ఈ జగల్లీలావ్యాపారములో కూడ దివ్యవికాసమునకు ఉన్మీలమగు కొలది దివ్యలీల ప్రారంభమగును. ఇది త్వరితముగ ఉపలబ్ధి నొందుటకు నేను నా చిన్నతనమున అమాయకత్వములో ఆత్రపడితిని కాని, ఈ యుపలబ్ధికి కావలసినంత కృషి కావలసియుండినది. ఇది ముందు సఫలము కాగలదని నేనాశించుచున్నాను.

అతీత మానసశక్తిని, జ్యోతిని సుస్థిరముగ కలిగి యుండుటకు ప్రస్తుతము నేను పురోగమించుచున్నాను. ఈ శక్తి నన్నందులకుగాను నడపించుచున్నది. కాని పాత అలవాట్లు. పాత మానసిక తలంపులు ముందుకు పురోగమింపజేయక ఆటంక పరచుచున్నవి. అందువలన పురోగమన మించుక కుంటు

పడుచున్నది. పూర్ణాభివృద్ధి జరుగుటలేదు. అయితే, ఈ కల్మషములు నాలో లేనప్పటికిని అవి పరిసరముల నుండి నన్నావరించి బాధింప యత్నించు చున్నవి. మనస్సతీత మానసమున కభిముఖమైనప్పటికిని, ఈ అథశ్శక్తులు మనస్సును కల్లోల పరచి, వాని అపరిశుద్ధ సూచనలతో మనస్సును ముట్టడించి స్వాధీన పఱచుకొన యత్నించుచున్నవి. అందువలన ఊర్ధ్వము నుండి వచ్చు జ్ఞాన మపార్థము చేయబడి మనస్సును కలవరపరచుచున్నది. అయితే, కాలమే దీనినంతటిని సవరించి ఈ రిపుశక్తుల ముట్టడిని నాశనము గావించి నన్ను విజయవంత మొనర్ప జేయును.

23_6_1916

శ్రీజనని 1915 వ సంవత్సరము, మార్చిలో 3 వ తేదీన ప్యారిస్ నగరమునకు ఓడపై బయలుదేరిరి. కాని వారచ్చట శాంతియుతముగ నున్నటులగుపించ లేదు. నాలుగు మాసముల పర్యంత మామె ప్రార్థనలను కాని ఇంకే విషయములను గూర్చి కాని వ్రాసినట్లగుపించదు.

1916 వ సంవత్సరమున జూన్ నెలలో 7 వ తేదీనాడు టోకియో నగరము నుండి ఒక ప్రార్థన నిట్లు రచించిరి.

"చాల మాసములు గడచినను చెప్పుకొనవలసిన దేమియు జరుగలేదు. అది యొక మార్గములో అచల సదృశ పరిమాణము నుండి ఇంకొక విశాల సంపూర్ణమునకు బోవు నొక మార్పుదల నొందునటువంటి సమయము. బాహ్య పరిస్థితులు నానావిధములై, నవీనములై పెక్కు గ్రహణశక్తుల పరిశీలనములను ప్రోగుచేసి దాని యనుభవమునకు విశాలమైన, మిశ్రితమైన పునాది నొసగుట సత్తాకావశ్యకమై యుండెను. దీనిలోనే నిమగ్నమై దీనినుండి వెలుపలికి వచ్చిన దీనికి ముందన్ని దృక్పథములనుండి చూచు విధానము, పరిస్థితి యేర్పడలేదు. ఇట్టి స్థితిలో హఠాత్తుగా జూన్ 5 వ తేదీన తెరతొలగిపోయి చేతనలో నొక వెలుగుద్భవించినది. అఖండమైన నీరూపసన్నిధానమున, నేను ధ్యానించి భౌతిక శరీర సామ్రాజ్యము నాక్రమించుకొనుమని ప్రార్థింపగా స్థితిరూపముగ నుండిన ప్రాణశక్తిని నాలో ఉద్భూతపరచి కార్యకలాపమునకు నియోగించితివి.

ఇందుకు ఫలితముగ దివ్యప్రాణశక్తి ప్రాతపద్ధతులకును అలవాట్లకును విచ్ఛిన్నముగ దివ్యప్రేరణతో కార్యమొనర్చుటకు పూనుకొన్నది. క్రొత్తకార్య విధానము, నీ దివ్యశాసనమున కనుగుణముగా సమర్పణ మొనర్చబడి, సత్తా కే యాటంకములు కలుగకుండ నమలు జరిపినది.

ఈ ప్రాణిక సత్తా స్థితిరూపక సమర్పణలో సామంజస్యతను కనుగొన్నట్లు, అది తీవ్రకర్మాచరణలో కూడ సామంజస్యతను కొంత కొంత పొందుటకు నభ్యా సము చేసికొన్నది. ఒకసారి యీ సామంజస్యత వలయునంతగా విస్తరించిన తోడనే వెలుగు సత్తాలోని యన్నిభాగములయం దుద్భవించినది.

ఇప్పుడు కర్మల మధ్య ప్రాణిక సత్తా, యనంతత్వమును శాశ్వతత్వగ్రహణ శక్తిని కనుగొన్నది. ఇంద్రియాను భవములకు — ఆకృతుల కతీతమై అది నీ యత్కృష్ట సౌందర్యములను చవిజూచి దానిని తీక్ష్ణముగ నెఱిగినది. ఈ స్థితిలో ద్వంద్వభావములు, విరుద్ధేంద్రియ చలన తాకుడులకు కదిలింప ఒక దివ్యశాంతిలో దివ్యకర్మల నొనర్చుటకు సమర్థత బొందినది.

నాలోని సర్వమిది యొక మెట్టని తెలిసికొని నిన్నర్చించుచు నీకు వందనము జేయుచు యిట్లు ప్రార్థించెను: 'ప్రభూ! మీ యుపకరణమును మీ కరకమలముతో మరల స్వీకరించితిరి. ఆ యుపకరణమునకు దాని లోపమును, కల్మషమును గూర్చి విదితమే! నీ కరుణకై యిది ప్రార్థించుచున్నది. దానిని నీవు పరిపూర్ణత నొందించి పరిశుద్ధము చేయవలసియున్నది దినదినమునకు లోటుపాట్లను, హద్దులను సమృద్ధిగ మటుమాయము చేసి, ఈ యుపకరణమునకు పూర్ణదివ్యోపలబ్ధిని కలుగజేయవలయు నని ప్రార్థించుచున్నాను."

1916 వ సంవత్సరము డిశంబరు నెలలో 5 వ తేదీన తల్లిగారు జపాను వీధులందు సంచరింపబోగా, అవి విద్యుద్దీపాలంకరణతో చిత్రవిచిత్రమైన రంగు లతో, సుందరాతి సుందరముగ నొప్పారుచు నుండినవి. అట్టితఱి శ్రీజనని 'సర్వం బ్రహ్మమయం' అన్న సూక్తి నుపలబ్ధి పొందిరి. ఆ దివ్యానుభవమును గూర్చి క్రింద వివరింపబడినది:—

"ఇటు వీక్షింపుము ... ... ... ఇది జపాను

నగరపు వీధి. ఈ వీధి చిత్రవిచిత్రమైన యలంకరణతో, విద్యుద్దీపములతో, దేదీప్యమానముగ ప్రకాశించుచు సుందరాతిసుందరముగ నున్నది. ఏది చైతన్యవంతమో యదంతయు నా వీధిలో ముందుకు సాగిపోవుచున్నది. భగవాను డెల్లెడల స్పష్టముగా ప్రత్యక్షమగుచున్నాడు పెద్దసైన ఆ చిన్నిగృహములలో ఒకానొక గృహము నా దృష్టికి గోచరించినది.

అందొక యువతీలలామ సువర్ణకాంతితో ధగ ధగ మెరయు జరీదారముల తోను, వివిధరకములైన రంగుదారములతోను తయారు చేయబడిన విలువైన యూదా రంగు కిమోనో (జపాను దేశపు స్త్రీలు ధరించు దుస్తు) ధరించి తాతామిపై (జపాను దేశీయు లుపయోగించెడు చాప)నాసీనయై యున్నది. ఈ వనిత సౌందర్యవతి. ఈమెకు దాదాపు ముప్పది యైదో లేక నలువది సంవత్సరముల వయస్సుండవచ్చును. ఆమె సువర్ణవర్ణముగల సమిసెన్ ను (మూడు తంత్రులతో కూడిన సితారా వాద్యము) వాయించుచున్నది. ఆమె పాదయుగళము వద్ద ఒక చిన్నారిపాప యున్నది. ఆమెయందు దైవమే గోచరించుచున్నాడు."

స్వర్ణకాంతితో దేదీప్యమానముగ ప్రకాశించెడి యాసనముపై నాసీనయై తంత్రీ వాద్యమును మేళవించుచు ఆనంద పారవశ్యమున నోలలాడెడి యా యువతీ మణియందు తల్లిగారికి దైవమే ప్రత్యక్షమాయెను.

"సౌందర్యమే సత్యము, సత్యమే సౌందర్యము
జగత్తులో గ్రహింప దగిన దిదియే'

యని కీట్సు మహాశయుడు నుడివిన రీతి, 'సత్యం, శివం, సుందరం' అన్నటు లా సౌందర్యములో ఆమెకు సత్యస్వరూపుడైన భగవానుడు ప్రత్యక్షమాయెను. 'ఇందుగల డందు లేడని సందేహము వలదు చక్రి సర్వోపగతుం డెందెందు వెదకి చూచిన అందందే గల'డని ప్రహ్లాదు డంతర్యామియైన భగవానుని యథార్థతను తండ్రికి చెప్పిన రీతి, శ్రీజననికి సర్వము బ్రహ్మమయముగ నగుపించెను. ఆ తన్మయత్వములో ఆమె బాహ్యప్రజ్ఞను గోల్పోయి అంతస్థముగ నున్న తఱి, యీ దివ్యానుభవ మామెకు కలిగినది. 1916 వ సంవత్సరమున డిశంబరు నెలలో 25 వ తేదిన శ్రీజనని కొక యంతర్వాణి వినవచ్చెను. అదేదనగా:

"నీవు సర్వము త్యజించుట వలననే యిట్టి మహత్తర కార్యమునకు సంసిద్ధ వైతివి. నీ వొక పొంగారు జలాశయము. ఈ దివ్యజలమును జగత్తున కందుబాటులో నుంచుచు, దానిని నీవేమియు ననుభవింపక విస్తరింప జేయునట్టి ప్రేమకార్యమే వెలలేని ముత్యము."

## తల్లిగారి తాదాత్మ్య జ్ఞానము

'సావిత్రి' యను గ్రంథరాజమున శ్రీఅరవిందులు తాదాత్మ్య జ్ఞానములను గూర్చి యీ విధముగ రచించిరి:—

"దర్శించినదానితో సంయమముచే బొందిన తాదాత్మ్యజ్ఞానము
విభిన్నేంద్రియ హృదయ జ్ఞానము నాక్రమించి
ప్రకృతి నంతటిని తన కౌగిటిలోనికి లాగుకొనెను."

ఈ యనుభవమునే తల్లిగారు జపానుదేశమున నున్నతఱి పొందిరి. తాము పుష్పమునం దేవిధముగ నైక్యమైరో ఆ యనుభవమును గూర్చి 1917వ సంవత్సరమున యేప్రిల్ లో 7వ తేదీన మృదుమధురముగ శ్రవణానంద కరముగ నిట్లు వివరించిరి:

"ఒక నిగూఢచేతన నన్నాకట్టుకొనినది. మునుపు నేను చెఱ్ఱీ వికాసముతో (Cherry-Blossom) నైక్యత నొందుచున్నానని గ్రహింప గలిగితిని. ఒక నీలి ప్రకాశ ప్రవాహము ననుసరించుచు నేను చేతన యొక్క గంభీరపు లోతులలోనికి దిగి, అంబరము నంటునేమో యన్నంతగా దాని నసంఖ్యాకములైన విశాలపు కొమ్మ లావరించి సమర్పణా భంతమైన సుమములచే భారమైన చెఱ్ఱీవృక్షమై పోయితిని. దాని ద్వారా సర్వచెఱ్ఱీ వృక్షములతో నైక్యమైతిని."

అట్టితఱి, నే నొక వాక్కును స్పష్టముగా వినగలిగితిని:—

'నీవు చెఱ్ఱీవృక్షపు అంతరాత్మతో నైక్యమైతివి. ఆ భగవానుడే దివ్యమునకు కుసుమాంజలిని సమర్పించుచున్నాడని తెలిసికొనుము.'

నేనీ యనుభవమును వ్రాయగా అంతయు తుడిచివేయ బడినది. ప్రస్తుతమా చెఱివృక్షము యొక్క రక్తము నా రక్తనాళములలో ప్రవహించుచున్నది. దానితో

అసమానమైన శాంతిశక్తులు నాలో ప్రవహించినవి. భౌతిక శరీరమునకు— — వృక్ష శరీరమునకు భేదమేమి గలదు ? వాస్తవముగ నేమియు లేదు; వానికి ప్రాణ మిచ్చు చేతన మొక్కటే :

అంత చెఱీ ఫలవృక్షము (The cherry tree) నా చెవియందు రహస్య ముగ నిట్లనెను: —

'వసంత కాలమునకు సంబంధించిన యస్వస్థతలకు ఔషధము చెఱ్ఱీ వికాసమే:'

ఈ దివ్యానుభవము నందలి అర్థము నేనిట్లు వివరించుచున్నాను.: —

శ్రీజననికి కలిగిన దివ్యానుభవము వాచామగోచరమైనది. 'నే నొక పుష్ప వికాసముతో నైక్యత నొందుచున్నానని గ్రహింప గలిగితిని.' ఆమె సూక్ష్మ దృష్టితో, ప్రకృతి సౌందర్య ద్యుతులలో ఒక వలయాన్ని నిర్మించుకొని అందు రహస్యానందాలను విపులీకరించిరి.

తరువాత ప్రకృతిమాత తన సువాసనాభరితమైన పుష్ప వికాసముచే ఆకాంక్ష కుపయుక్తమైన పొడుగాటి వృక్షసముదాయములచే భగవానుని గూర్చి ప్రార్థించుట — ఆరాధించుటను గూర్చి మనము తెలిసికొనుచున్నాము.

తదుపరి భగవానుడే దివ్యమునకు పుష్పాంజలిని సమర్పించు చున్నాడని మనము దెలిసికొనుచున్నాము ——దైవమే వాస్తవముగా పథికుడు, గమ్యస్థానమై యున్నాడు.

'ఇప్పుడు నా రక్తనాళములలో చెఱ్ఱీవృక్షపు రక్తము ప్రవహించుచున్నది.'

అని శ్రీజనని చెప్పిన వాక్కులు మహోన్నతమైనవి. అంతమున సుమ మొక రహస్యమును శ్రీజనని చెవియందు రహస్యముగ చెప్పినపుడు శ్రీ తల్లి గారి తాదాత్మ్యజ్ఞానమును గూర్చి తెలిసికొను చున్నాము,

ఈ యపూర్వానుభవమును పరికించినచో నిశ్శబ్దము లావరించిన ప్రకృతి రమణీయతలో నేకాంతమై నిలిచిన యొక ఆనందపూర్ణ మహద్దర్శనమా! యని భావింపక తప్పదు.

——

పేదరికము సంప్రాప్తమైన తఱి, తల్లిగారు "ఓ ప్రభూ! ఈ పేదరికము నాకు సంప్రాప్తింప జేసి యెండిపోయిన యెడారియం దుంచితివి. ఐనను నీ వద్ద నుండి వచ్చెడి ప్రతిది యెంత మధురముగనుండునో యిదియును అంత మధురముగ నున్న"దని తలంచిరి. కొంతకాలమునకు పరిస్థితులు కొంత మెరుగై సంపద లభింపగ "ప్రభూ! ధనరాసులను నాకు దానము చేసితివి. ఇంక నేను నిన్నేమియు కోరను. నాకు గావలసిన యమూల్యమైన సంపదను (ఆధ్యాత్మికతను) బొందియున్నాను... ......................పేదఱికము నా కెంత సహజముగ నున్నదో యీ సంపద కలిగినప్పుడు కూడ నా స్థితి అంతే. ఆధ్యాత్మిక జీవనమే నాకు చైతన్య వంతమైనది. నీ వనుగ్రహించినచో ఈ సంపదతో గూడ నన్నును నీకే యర్పించు కొనవలయునని నిశ్చయించు కొంటి" నని 4-7-1917వ తేదీన తమ పరిస్థితులను గూర్చి దినచర్య పుస్తకమునందు రచించిరి. 'సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ..................' అని శ్రీకృష్ణుడు గీతలో జెప్పిన రీతి శ్రీజనని పేదరికమునందు—ఐశ్వర్యమునందును, సుఖమున కుప్పొంగక, దుఃఖమునకు క్రుంగక సమభావమును కలిగియుండిరి.

1919వ సంవత్సరము నందు. జపానుదేశములో నివసించు తఱి, శ్రీజననికి కొన్ని యపూర్వానుభవములు కలిగినవి. దుర్మార్గులు, దుష్టులు మానవులకు సంభవించు కష్టములను జూచి యానందింమరని శ్రీజనని యనుభవ పూర్వకముగ వివరించిరి. ఈ యనుభవములు క్రింద వివరింపబడినవి. వ్యాధు లెందుకు కలుగునో దానికి కారణములేవో కూడ శ్రీజననిట్లు నిర్వచించిరి:

"వ్యాధి యనగా సమత కోల్పోవుటయే! ప్రతివ్యాధియు, ప్రమాదము కూడ సమత కోల్పోవుటవలననే సంభవించుచున్నది. గణిత శాస్త్రమునో ఎట్లు లెక్కలేనన్ని సాధ్యమైన అంకెల యొక్క కూడికలున్నవో అట్లే వ్యాధుల యొక్కయు ప్రమాదముల యొక్కయు కారణములు కూడ లెక్కలేనన్ని యున్నవి. శరీరావయవములలో నే మాత్రము సమత చెడినను వ్యాధియో లేక ప్రమాదమో కలుగుటకు వీలున్నది. మానసిక సమత తప్పిపోయి నిరాశ, నిస్పృహ, మనోవికారము ప్రాణసత్తయం దావరించినచో వ్యాధి ప్రబలి ప్రమాద కరమగును. వ్యాధులెన్నియో యాసాధారణ గుణములవలన గ—

7)

వ్యాధులు సూక్ష్మజీవులు 'మైక్రోబులు' సోకుటవలన కలుగుచున్నవి. సూక్ష్మజీవులను జంపుటచే వ్యాధి నివారణ యగునని వైద్యశాస్త్రము చెప్పుచున్నది. వ్యాధికి మరియొక కారణము దుష్టశక్తుల ప్రమేయమే : ప్రపంచములో దుర్మార్గము ప్రబలియున్నది. దుష్టశక్తులతో పోరాడవలసి వచ్చినప్పుడు మన మధైర్యము నొందకూడదు.

"అది 1919వ సంవత్సరము. జనవరి మాసపు ప్రారంభపు దినములలో నేను జపానునందే యుంటిని. ఈ సమయమున 'ఫ్లూ' వ్యాధి (విషజ్వరము) ప్రబలమై వేలాది జనులా వ్యాధికి గురియై మరణించిరి. ఈ 'ఫ్లూ' వ్యాధి అరుదుగ వచ్చుచుండెడిది. టోకియోనగరమున, దాని పరిసరప్రాంతపు గ్రామములలో అనుదినము వందల కొలది ప్రజలు వ్యాధిగ్రస్తులై మృత్యువు వాత బడుచుండిరి. ఈ వ్యాధి మూడుదినముల పర్యంత ముండెడిది. మూడవ దినమున రోగి మరణించెడివాడు. వ్యాధి స్వరూపమున వేలకొలది ప్రజలు మరణించుట వలన దహనక్రియలు కూడ సక్రమముగ జరిగెడివి కావు. అదృష్టవశాత్తు రోగి మూడవ దినమున మరణింప కుండినచో నొక వారమురోజులలో వానికి స్వస్థత చేకూరినట్లే!

"అంటువ్యాధులు జపానులో నరుదుగాన యీ 'ఫ్లూ' వ్యాధి ప్రబలినందువలన ప్రజలు భయముతో దిగులుతో క్రుంగి కృశించిరి. జపాను దేశస్థులు పరిశుభ్రముగ నుండెడివారు గాన వ్యాధులు వారి కరుదుగ వచ్చుచుండెడివి. వారి పాలిటికి విషజ్వరమొక యుపద్రవమైనది. వ్యాధికి సంబంధించిన సూక్ష్మజీవుల నరికట్టుటకై, పరిశుభ్రమైన గాలి పీల్చుటకై జనులు ముక్కులకు గుడ్డలను కట్టుకొని వీధులలో తిరుగాడ జొచ్చిరి. నాతో పాటుగా నున్న యొక వ్యక్తి 'ఈ వ్యాధి వాస్తవిక స్థితి యేమి? వ్యాధి వెనుక పనిచేయుచున్న శక్తి యేది?' అన్న ప్రశ్నలతో నిరంతరము నన్ను కలవరపెట్టసాగెను. నేను నా శక్తిచే నన్ను రక్షించుకొనుచు, దానినిగురించి తలంచక నా కార్యములో నేను నిమగ్నుడైతిని. క్రమేణ దానిని గురించి యాలోచించుట నిలిపివేసితిని. ఏమియు జరుగలేదు. అయితే ఆ వ్యక్తి మాత్రము 'ఈ వ్యాధి స్వరూపమేమి? ఈ వ్యాధి వెనుక పనిచేయు శక్తులేమి? ఈ వ్యాధి యెందులకు సంభవించినదో నాకు తెలుపవా? ............' యిత్యాది ప్రశ్నలతో నిరంతరము నన్ను కలవరపెట్టుచునే యుండెను.

"ఒకనాడు నాకు పరిచయమున్న యొకానొక యువతి నాకు కొన్ని వస్తువులను చూపించి, తన స్నేహితురాండ్రకు పరిచయముచేయు నిమిత్తమై సన్నాహ్వా

నించెను. ఇనుపకమ్మెలు వేసిన బండి దారిలో పట్టణపు వీధులన్నియు దాటి, ఆమె గృహమున కేగవలసి వచ్చెను. నేను దారిలో నుండగా జనులందరు ముక్కులకు గుడ్డలను గట్టుకొనియుండుటను గమనించితిని. ఆ వాతావరణమంతయు భయముతో నిండి నిబిడీకృతమై యుండెను. అంతలో నాలో నే నిట్లు వితర్కించుకొంటిని: 'వాస్తవముగ ఈ వ్యాధి స్వరూపమేమి? ఈ వ్యాధి వెనుక, లోపల పనిజేయుచున్న శక్తులేవి?' అని తలంచుచు గమ్యస్థానము జేరుకొంటిని. అక్కడొక గంటసేపు గడపి వెనుదిరిగి వచ్చితిని. అయితే భయంకర విషజ్వరము నన్నావరింప గృహమునకు విచ్చేసితిని. వ్యాధులు సూక్ష్మక్రిముల వలన సంభవించును గదా! శరీర, ప్రాణమయ, మనోమయ శక్తుల విరుద్ధత వలన మానవునంతరంగ మొక రణక్షేత్రమగును. ఆ రణరంగమున నీవు విజయము నొందవచ్చును, లేక యపజయము గూడ బొందవచ్చును. నీ వట్టితఱి యోటమిని బొందినచో వ్యాధికి గురియగుట నిజము.

"సాయంకాలమైనంతనే విషజ్వరము నన్నావరించినది. వైద్యునికి నేను కబురంపలేదు. ఎవరి పిలుపుననో వైద్యుడేతెంచెను. వైద్యుడు 'ఈ యౌషధము నీకిత్తును ఈ యౌషధము విషజ్వరములను మాన్పుటకు సంజీవిని వంటిది. ఎల్లరు విరివిగా ఈ యౌషధమును వాడుటచే కొలదిగా నా దగ్గరనున్నది. దీనిని సేవింపుము. నీకు స్వస్థత చేకూర గల' 'దనియె. వైద్యునితో నేను' ఈ యౌషధము నాకు వలదు. ఇట్లు నేను జెప్పుచున్నందులకు దయచేసి నన్ను క్షమింపుడు. ఔషధమునందలి నమ్మకము గలవారి కది యొసగి రక్షింపుడు. ఇది మీకడనే యుంచుకొను' డని చెప్పగా అతడు విసుగుతో 'ఇచ్చటికి నా రాక వృథాయైన' దనెను. అది నిజమే నని నేనంటిని. వైద్యుడు వెడలిపోయెను. భయంకరమైన విషజ్వరముతో నేను పాన్పుపై పవ్వళించి యుంటిని. స్వగతమున నేనీ వ్యాధిని గురించియే తలపోయుచుంటిని. రెండవ దినము నే నొంటరిగ పరుండియున్న సమయమున యుద్ధములో తలనరకబడిన యోధుడు హఠాత్తుగ నాపై బడి నా శక్తిని తీసికొన ప్రయత్నించెను. నా ప్రాణముల నపహరింప జూచుచుండెను. నేను గాఢనిద్రలో మైమరచి కదలలేక పాన్పునందున్న తఱి, ఆ యోధుడు నన్ను బలవంతముగ లాగజొచ్చెను. అంత గుప్తవిద్యా ప్రభావముచే వానితో యుద్ధము చేసి వానిని తరిమి వైచితిని. వాడు నిష్క్రమించినంతనే లేవగలిగితిని. వ్యాధు లకస్మాత్తుగా దుర్మరణము నొందినవారినుండి కలుగునని తెలుసికొంటిని.

మొదటి ప్రపంచయుద్ధమున ఆరోగ్యవంతులైన ప్రజలు ఫిరంగులచే కాల్చబడి మరణించుచుండిరి. ఆశా పాశములతో కూడుకొన్న ప్రజలు పిశాచములై మాన వాళిని బాధింప దొడగిరి. యుద్ధములో మరణించిన యోధుడొకడు నాపైబడి నా ప్రాణము లపహరింప సమకట్టెనని, వ్యాధులకు కారణము పిశాచముల విజృంభణ యన్న నిశ్చయమునకు వచ్చితిని. ఇటువంటి దుష్టశక్తు లమితముగ కలవని నా యభిప్రాయము.

"ఒకరు నన్ను చూచుటకు రాగా, నన్నొంటరిగానే యుండునట్లొనరింపు మంటిని. నేను పాన్పుపై శాంతిగ రెండుమూడు దినముల పర్యంతము నా చేతనలో నిమగ్నమై పవ్వళించితిని. ఇతలో జపాను దేశస్థుడైన మిత్రుడొకడు నన్ను సమీపించి 'మీకు కూడ ఈ వ్యాధి సోకియుండెనా? నేననుకొన్నది వాస్తవమైనది. .........రెండుమూడు దినములనుండియు ఈ వ్యాధి కెవ్వరును గురియౌట లేదు. వ్యాధిగ్రస్థులైన ప్రజానీకమునకు స్వస్థత చేకూరినది. ఎట్లయిననేమి యీ వ్యాధి యరికట్టబడిన' దనెను. వ్యాధి నిర్మూలమైన దన్న శుభవార్త విని నేను సంతోషించి, నాకు కలిగిన యనుభవమును వివరించితిని. ఆతడీ విషయమును పలువురకు నివేదించెను. ఈ యాశ్చర్యకరమైన విషయమును గురించిన వ్యాసములు జపాను పత్రికలందు ప్రచురింపబడెను. ఔషధముల కన్న నిర్మల చైతన్యము కలిగియుండుట ఫలవంతమన్న సూక్తి ననుభవపూర్వకముగ తెలిసి కొంటిని."

వందల కొలది మృత్యుదేవత లున్నవని శ్రీజనని వాక్రుచ్చిరి. అందులో రెంటిని ఫ్రాన్సులోను, జపాను దేశములోను గాంచినట్లు తెలిపిరి. ఒకసారి అగ్ని దేవతను కూడ సందర్శించినట్లు శ్రీమాత నుడివిరి. జపానులో ఒకసారి అగ్ని ప్రమాదము సంభవించెను. శ్రీజనని నివాసగృహమునకే ఆ అగ్నిజ్వాలలు సమీ పించెను. అట్లగ్నిజ్వాలలు సమీపించుచుండగా అది యొక చైతన్యసత్త్వగ ఆ యగ్నిని దర్శించి 'ఎందులకిట్లు నన్ను సమీపించుచున్నా'వని జనని ప్రశ్నింపగా ఆ యగ్నిదేవత 'ఈ గృహమును దహించుటకు నా కెంతేనియు హక్కుగల' దనెను. అంతలో తల్లిగారు 'దీనిని దహించెడు హక్కు నీ కెంతమాత్రము లేదు. ఆ వలకు తొలగిపొమ్ము' అని యాజ్ఞాపింపగా అగ్ని వెడలిపోయి రెండు మూడు గృహముల కావల నున్న మరియొక గృహమును దహించి వైచెను.

1919 వ సంవత్సరమున సెప్టెంబరు 3 వ తేదీన శ్రీజనని 'గైవాక' అను నావమీద ప్రయాణము చేయుచు నొకప్రార్థన నిట్లు రచించిరి:

'నే నెంతో ప్రేమతో తయారు చేసిన ఆహారమును మానవులు త్రోసివేసినారు! ఓ ప్రభూ! ప్రేమతో సమర్పించు నా సమర్పణను మీరు దయతో స్వీకరింపుడని వేడుకొనుచున్నాను. నా యందు గతభావము లేమాత్రము లేవు. బలవత్తరమైన ప్రేమ యొక్కటే మిగిలియున్నది.'

1920 వ సంవత్సరమున యేప్రిల్ 24 వ తేదీన తల్లిగారు మరల పుదుచ్చేరికి పయనమైరి. ఈ పర్యాయము భారతదేశమున స్థిర నివాస మేర్పఱచుకొను సంకల్పముతో విచ్చేసిరి.

# 8

## మాతృశ్రీ స్థిరనివాస సంకల్పము

1920 వ సంవత్సరమున శ్రీజనని పుదుచ్చేరియందు స్థిరనివాస మేర్పఱచుకొను సంకల్పముతో వచ్చిరి. శ్రీజనని శ్రీఅరవిందుల కార్యనిర్వహణకు సహాయకారిణిగా చనుదెంచుట రెండు మహా సముద్రముల కలయిక వోలె ప్రపంచములో నది కల్యాణప్రదమైనది. పుదుచ్చేరి యందు మిరాదేవి భర్తయైన పాలురిచ్చర్డ్‌తో సహా సముద్రతీరమున నున్న యొక ప్రత్యేక గృహమున నివాసము చేయుచుండిరి. ఫ్రాంకస్ మార్టిన్ (41, Rue Francois Martin) అను వీధిలో 41 వ నంబరుగల గృహమునందు శ్రీఅరవిందులు నివసించుచుండిరి. రిచ్చర్డ్ దంపతులు నివసించు గృహము శ్రీవారి గృహమున కతి సామీప్యమున నుండెడిది. శ్రీజనని సాయంకాల మారు ఘంటల సమయమున ధ్యానము చేయుటకై శ్రీఅరవిందుల గృహమునకేగుచుండిరి. శ్రీవారు 4 లేక 4-30 గంటల సమయమున శిష్యులకును తదితరులకును దర్శన మొసగెడివారు. ఆ సమయమున పెక్కు విషయములను గూర్చి శ్రీఅరవిందులు వారితో చర్చించుచుండిరి. తదుపరి 4_30 లేక 5 గంటల సమయమున గురుసాన్నిధ్యమున ఎల్లరు ధ్యానము చేయుచుండిరి. ధ్యాన కార్యక్రమము ముగిసిన వెంటనే కొందరు ఆటల మైదానమునకో, మరి కొందరు సముద్రతీరమున వ్యాహ్యాళికో బయలుదేరుచుండిరి. తల్లిగారు మాత్రము 6 ఘంటల సమయము నుండి ధ్యానమును ప్రారంభించి ఘంటల తరబడి సమాధి స్థితిలో నుండెడివారు.

ఇట్లు కొన్నిమాసములు గడచిన తరువాత, ఒకనాడు హఠాత్తుగా తుఫాను రేగినది. తల్లిగారు వాసము చేయుచున్న గృహ మధిక వర్షపాతము వలన కారుటచే శ్రీవారు నివసించుచున్న గృహమునకు బసమార్చుకొనవలసినదిగ ఆమెకు శ్రీవారు సలహానొసగిరి. శ్రీవారు నివసించుచున్న గృహమున ప్రత్యేక గదులలో కొందరు శిష్యులు వాసము చేయుచుండిరి. శ్రీజనని మేడమీద నొక ప్రత్యేక గదియందుండ నిశ్చయించుకొనిరి. పాల్ రిచ్చర్డ్ గారు పుదుచ్చేరినుండి చెన్నపట్టణమును దర్శించి, తదుపరి శాంతి కేతన్‌కు వెళ్ళి యటుతరువాత ప్యారిస్‌నగరమునకు వెడలిపోయిరి. అటు తరువాత వారు మరల పుదుచ్చేరికి రాలేదు. తల్లిగారి కుమారి హాడ్‌సన్‌తో కలసి శ్రీఅరవిందుల గృహమున వాసము చేయుచుండిరి కొంతకాలమైన తరువాత హాడ్‌సన్ 'దత్తా' యని పిలువబడుచుండెను. శ్రీవారి యింటిని చక్కదిద్దుచు దత్తా యెల్లప్పుడు కార్యనిర్వహణయందు నిమగ్నమై యుండెడిది. తేనీటి పానీయమును తయారుచేసి సాయంకాలము ధ్యానకార్యక్రమము ముగిసిన పిమ్మట శ్రీఅరవిందులకును, వారి శిష్య బృందమునకు నొసంగుచుండిరి.

1921 వ సంవత్సరమున డిశంబరు మాసమున క్షుద్ర విద్యలను సమగ్రముగా నెఱింగిన విఠల్ అను వంటవాడు క్షుద్రవిద్యల నితరులపై ప్రయోగించెను. గుప్తవిద్యలయందారితేరిన తల్లిగారు క్షుద్రవిద్యలవలన కలిగిన చెడు ఫలితముల నెప్పటి కప్పుడే కనిపెట్టి వాని నంతమొందించిరి. 1922 వ సంవత్సరమున శ్రీమాతారవిందులు ఫ్రాన్క్సిస్ మార్టిన్ వీధిలో నున్న 41 వ నంబరుగల గృహమును వదలి డీల మెరయన్ (Deia Marine) అను వీధియందున్న గృహమునకు బసమార్చుకొనిరి. దత్తా, బరీంద్రుడు (శ్రీఅరవిందుల సహోదరుడు), నళినీ కాంతగుప్త, అమృత, విజయ, కుమారనాగ్, మణి, సత్యేన్—ఇత్యాది సాధకులెల్లరు శ్రీఅరవిందులతో పాటు డీల మెరయన్ వీధిలో నున్న గృహమునకే తమ బసను మార్చుకొనిరి. సాధకులైన కోదండ రామరావు, తదితరులు అతిథి గృహమునకు వెనుకనున్న గదులలో వాసము చేయుచుండిరి. కొత్త ఇంటిలో యథావిధిగా ధ్యాన కార్యక్రమములు కొనసాగుచుండెను. తల్లిగారు గంటల తరబడి ధ్యానములోనే నిమగ్నమై యుండెడివారు. 1923 వ సంవత్సరమున జనవరి మాసమునందు, పురాణి, చంపకలాలు, పూజాలాలు, పున్నమచంద్ తదితర సాధకులు గుజరాత్ దేశము నుండి వచ్చి అతిథి గృహమున నివసింప దొడగిరి. వంగదేశము నుండి కన్నయ్‌లాలు గంగూలీ పుదుచ్చేరికి వచ్చెను ఏప్రిల్ నెలలో

పియర్‌సన్ అను పాశ్చాత్యుడు శాంతినికేతన్‌నుండి వచ్చి తల్లిగారిని సందర్శించెను. జూన్ మాసమున 5వ తేదీన దేశబంధు శ్రీయుత చిత్తరంజనదాసు శ్రీవారిని దర్శించి వారితో సంభాషించెను. ప్రముఖనాయకులైన లాలాలజపతిరాయ్, పురుషోత్తమ టాండన్ లదితరులు శ్రీవారిని దర్శించిరి. కజిన్స్, దేవదాసు గాంధీ (గాంధీ మహాత్ముని కుమారుడు) పుదుచ్చేరికి వచ్చి శ్రీఅరవిందులను దర్శించిరి. 1920—1926 మధ్యకాలమున స్వాతంత్రోద్యమము తీవ్రరూపము దాల్చియుండెను. శ్రీవారి సలహాలను గైకొనుటకై ప్రముఖ రాజకీయవేత్తలు, నాయకులు పుదుచ్చేరికి వచ్చుచుండిరి. ఇట్టితఱి. హిందూదేశపు భవితవ్యమును గూర్చి శ్రీఅరవిందులు శ్రీజననితో ఆలోచించెడివారు.

శ్రీ అరవిందగురు సాన్నిధ్యమున యోగీశ్వరియైన సర్వశక్తిమంతురాలైన శ్రీమాత నిరంతర మాధ్యాత్మిక సాధనలను జేయుచుండిరి. ఇట్టితఱి, ఆమెలో అసామాన్యమైన మహేశ్వరి, మహాకాళి, మహాలక్ష్మి, మహా సరస్వతి శక్తులావిర్భవించినవి ఈ శక్తులను గురించి యెవ్వరికి తెలియలేదు. సాధకుడైన శ్రీ కోదండరామారావు సతీమణి మాత్రము శ్రీ అరవిందగురు సాన్నిధ్యమున ధ్యానము చేయుతఱి, ఈ శక్తులు తల్లిగారిలో ఆవిర్భవించినట్లు దర్శించెను. ఈ దర్శనములను గూర్చి సాధకులకు కోదండరామారావు తెలియజేసినను వారు నమ్మరైరి. కొంతకాలమైన తరువాత శ్రీమాతయొక్క రూపము మారుచుండుట ఆశ్రమవాసులు గమనించిరి. ఒక్కొక్క సమయమున కొందరికామె యత్యంత మనోహరముగ మహేశ్వరివలె నగుపించిరి. మరియొక సమయమున గంభీరముగ శక్తిస్వరూపిణియైన మహాకాళివలె ప్రత్యక్షమైరి. ఇంకొకవేళ హిరణ్మయ మహాలక్ష్మివలె ప్రత్యక్షమైరి. వేరొకసమయమున వాగ్దేవియైన సరస్వతివలె దర్శనమొసగిరి. 'శ్రీమాత తన భౌతిక రూపము వెనుక అనేక శక్తులను అనంత రూపములను కలిగి యున్నా' రని శ్రీ అరవిందులు చెప్పుట సమంజసముగ నున్నది. దైవప్రేమ శ్రీమాతయందు మూర్తీభవించినది. ఆమె సర్వులను ప్రేమింప గలుగుచు, సర్వులు చేసిన అపరాధముల నెల్ల క్షమింపగలుగుచుండెను.

—o—

# శ్రీజననిని గూర్చిన శ్రీనళినీకాంత గుప్తగారి స్మృతులు

ప్రస్తుత ఆశ్రమవాసియగు శ్రీ నళినీకాంత గుప్తగారు మాతృశ్రీని గూర్చిన యమూల్యమైన విషయములను రచించిరి. అందులోని కొన్ని ముఖ్య విషయములను మాత్రము నే నిందు వివరించుచున్నాను. శ్రీ నళినీకాంత గుప్తగారు మాతను గురించి యిట్లు నిర్వచించిరి.—

"నే నిచ్చటకు వచ్చిన తరువాత ప్రప్రథమముగా తల్లిగారిని గూర్చి వింటిని. యోగాభ్యాసమునందు పురోగమించిన ఒక ఫ్రెంచి యువతీమణి తమతో పరిచయమును వాంఛింప గోరుచున్నదని శ్రీఅరవిందులు మాకు తెలిపిరి. ఆ ఫ్రెంచి యువతీమణి నిరంతర మన్వేషించుచున్న మహాపురుషుడాతడా కాదా యనునది ఆమె పంపు చిహ్నము ద్వార దాని ప్రాధాన్యతను నిర్ణయింప వచ్చుననిరి. ఆ చిహ్నమును పరికించి చూడ అది సాలమన్ ముద్రిక యను పేరనున్న శ్రీఅరవింద సాంకేతికమే! ఆ ఫ్రెంచి విదుషీమణి పోలిక పట్టుటకు నిదర్శన మంపిన తరువాత భారతదేశమునకు పయనమైరి. మిరాదేవి భర్తయైన పాల్ రిచ్చర్డ్ కాధ్యాత్మికమునందు, ఆచరణయందు శ్రద్ధ అతిశయము కనుకనే పుణ్యభూమియైన భారతావని కేతెంచు టాయన కవకాశము కలిగినది. ఆయన ఫ్రెంచి ప్రభుత్వమునం దెన్నికలలో అభ్యర్థిగా నిలుచు నిమిత్తమై పుదుచ్చేరికి పయనమాయెను.

పాలు రిచ్చర్డ్‌గారు ప్రప్రథమమున భారతదేశమున కొక్కరే వచ్చిరి; మరి యొక పర్యాయము సతీసమేతముగ విచ్చేసిరి. శ్రీఅరవిందుల సందర్శన భాగ్యమనెడి తన్మయత్వముతో పాలురిచ్చర్డ్‌గారు తృప్తిజెందిరి. జపానుదేశమున ఒక సందర్భమున శ్రీ పాలురిచ్చర్డ్‌గారు శ్రీఅరవిందులను గూర్చి యిట్లు చెప్పిరి: 'నా జీవితమంతయు మహాత్ముల నన్వేషించుటలో గడపితిని. అట్టి మహాత్ముని భారతదేశమున గాంచ గలిగితిని. ఆయన అవతారమూర్తియని భావికాలమున లోకులు గుర్తింతురు. వారి నామధేయము శ్రీఅరవిందులు' పాలురిచ్చర్డ్‌గారి కాధ్యాత్మికము నందు ప్రవేశము గలదు. ఏది యెట్లున్నను కార్యార్థమై ఆయన భారతదేశమునకు విచ్చేసిరి. పాలురిచ్చర్డ్‌గారు ఓట్లు

యెక్కువగా సంపాదింపక పోయినను ఆయన యెన్నికలలో నిలచి గెలు పొందుటకే వచ్చిరని యెల్లరూహించిరి. కాని, ఈ యవకాశము జననికి సదవ కాశమే యయ్యెను. శ్రీఅరవిందులను దర్శించుటయే గాక, కొంతమంది విశ్వాసపాత్రులైన మిత్రులతో ఆమె కొక సన్నిహిత సంబంధ మేర్పడెను. ఎన్నికల సందర్భములో మిరాదేవి (శ్రీజనని) కారిక్కల్ అను గ్రామమునకు పయనమైరి. హిందూదేశపు పరిస్థితు లేవిధముగ నున్నవో ఆమె అనుభ వము ద్వార గ్రహించిరి. ఆమె నివాసము జేసిన గదిని గూర్చి ఆమె యిట్లు వివరించిరి: 'నేనుండిన గది శిథిలమై, యంధకారబంధురమై, చెద పురుగులతో నిండి యుండినది.' అనంత సౌందర్యమునకే సౌందర్యరాశియైన సుందరాతిసుందరమైన దివ్యమాత ఆ పెంట, ధూళితో నిండిన మానవ సం బంధమైన జీవితములోన ప్రవేశ మొనర్పవలసి వచ్చెను; ఇక మానవులకు విమోచన మెక్కడిది!

ఆ మహాత్మురాలు మాతో కలసి నివసించుట కేతెంచుచున్న వార్త విన్నతోడనే మరొక సమస్య యెదురైనది, అదేదన, ప్రవర్తన మామె పట్ల నెవ్విధముగ నుండ వలయును? మన జీవన విధానములో నించుక మార్పు గలుగునా యన్నదే యొక పెద్ద సమస్య. మేము ఆహారవిషయములందు కట్టుబాట్లనునవి లేక ఇష్టము వచ్చినట్లు భుజించుచు విచ్చలవిడిగా దిరు గుచుంటిమి. మా యలవాట్లు నాగరికతకు దూరమైనవిగా నుండినవి. ఏది యెట్లున్నను నూతన వాతావరణమున గూడ మేము మా యిష్టానుసారముగ ప్రవర్తించుటకే నిశ్చయించుకొంటిమి. మనము మన స్వాతంత్ర్య మెందులకు విడనాడవలయును? అన్న సంకుచిత భావములు మాలో చెలరేగినవి. ఇవియే మానవుని వ్యక్తిత్వమును క్రుంగజేయు నటువంటి అహంకార, అజ్ఞాన జనిత మైన భావములు.

అజ్ఞానాంధకారమున మునిగియున్న మాకు జ్ఞానజ్యోతిని ప్రకాశింప జేయుటకై యంధకారమును బాపు భాస్కరుని వోలె శ్రీజనని ఇచ్చటి కేతెం చిరి. మధ్యాహ్న సమయములందు మిరాదేవి శ్రీఅరవిందులను దర్శించుచు సంభాషించుచుండిరి. ఆమె మితభాషిణి. మేము మా కార్యకలాపములలో తరచు నిమగ్నులమై అప్పుడప్పుడు మధ్యాహ్న కార్యక్రమములందు పాల్గొను

చుంటిమి. 'ఆర్య' యను పత్రికను ప్రచురించుటకు నిర్ణయింపబడగా, మిరాంబ ఆ బాధ్యతను వహించిరి. ఆమె చందాదారుల జాబితాను స్వయముగ తయారు చేసి ఆ లెక్కలపట్టీలను తమవద్ద నుంచుకొనిరి. ఆపట్టీ లిప్పటికి గూడ నున్నవి. 'డూప్లే గృహము' సామాగ్రి నుంచుటకును, అతిథిగృహమున నున్న క్రిందిభాగము కచ్చేరిగాను ఉపయోగించు చుంటిమి. కార్యక్రమముల నమలు జరుపుటలో మిరాదేవి ప్రముఖపాత్రను వహించుచుండిరి. మే మెల్లరము శ్రీ అరవిందులతో సహా మిరాదేవి గృహమున కేగి యామె యొసగెడి ఆతిథ్య మును స్వీకరించెడివారము ఈ సమయములలో ఆమె స్వయముగ వండిన ఒకటి, రెండు భోజనపదార్థములను సేవించెడివారము. ఆమె ఫ్రెంచిదేశము నుండి ఇటకు వచ్చి స్థిరనివాస మేర్పరచుకొన్న తరువాత కూడ బయ్యాడ్ గృహమున ఈ యేర్పాట్లే కొనసాగెను. ఈ దినములలో మిరాదేవి కొంతమంది యువకుల నొక సముదాయముగా నేర్పఱచిరి. శ్రీజనని వెలుగునీడలలో ఆమె అనుగ్రహమునకు పాత్రులైన భక్తాదులు వ్యాపార కార్యకలాపములలో నిమగ్ను లైరి. ప్రారంభ దశలోనే శౌరీన్ 'ఆర్యన్ స్టోర్సు' ను సామాగ్రి నమ్ముటకై నెలకొల్పెను. దాని ముఖ్యోద్దేశము ధనార్జనయే। మేము చాల కష్టపరి స్థితులలో నుంటిమి. అట్టితటి, శ్రీమాత జపాను దేశమునుండి వ్యాపార సంబంధమైన విషయములను గూర్చి శౌరీన్‌తో ఉత్తర ప్రత్యుత్తరములను జరిపిరి.

కొంత కాలము తల్లిగారు పిల్లుల పెంపకమునందు శ్రద్ధవహించిరి. దివ్య మాతానుగ్రహము మానవాళికేగాక జంతుసముదాయమునకు, వృక్షసంపదకును లభించినది. మాతృశ్రీ దర్శన, స్పర్శలచే నవి గూడ ధన్యమైనవి. వేదములు జంతుబలిని గూర్చి యద్ఘాటించుచున్నవి. అయితే శ్రీజనని ఒక నూతన పంథాలో జంతుబలి నొనర్చిరి ఆమె తమ చైతన్యముతో వాని యభ్యుదయమునకై తోడ్పడిరి జంతు ప్రపంచమున కధిపతులుగా లేక సభ్యులుగా ఆమె కొన్ని పిల్లుల నెన్నుకొనిరి గుప్త ప్రపంచమునందు (occult world) పరిపాలించు మార్జాల రాజును, అతీతమార్జాల మనవచ్చునని నుడివిరి. ఆ యతీత మార్జాలము శ్రీజననితో సన్నిహిత సంబంధ మేర్పఱచుకొన్నది. ఈ మధ్య యీ మార్జాల జాతి యెట్టుల ప్రవేశించినదో చూడ మా కది యొక యాశ్చర్యకరమైన విషయము.

మేము నివాసము చేసెడి యతిథి గృహమున మచ్చికగాని మార్జాలము తలవని తలంపుగా ప్రవేశించినది. అది ఘూతో నుండినది. ఆ మచ్చికకాని మార్జాల మతి శీఘ్రముగా సాధుజంతువైనది. ఆ మార్జాలమునకు కూన లుద్భవించినపుడు మొదటి కూనకు శ్రీఅరవిందులు 'సుందరి' అను నామధేయ మొసగిరి. ఆ పేరునకు దగినట్లున ఆ 'సుందరి' తెల్లని బొచ్చుతో కూడి సుందరాతిసుందరముగ నుండినది. సుందరియొక్క కూన దట్టమైన తోక కలదియగుటచే దానిని 'బొచ్చుపిల్లి' అని పిలుచుచుంటిమి. ఈ 'బొచ్చుపిల్లి' తన నోటితో కూనలను తీసికొనిపోయి శ్రీజనని పాదపద్మములయం దిడుచుండెడిది. ఆ కూనలను జనని కర్పించి బహుళ దీవెనలను పొందుటకై యామార్జాల మట్లొనర్చియుండవచ్చును. కనుక, ఈ మార్జాలను యోగములో బాగుగా అభివృద్ధి నొందినదనియే చెప్పవచ్చును. ఈ 'బొచ్చుపిల్లి' (Bushy) యొక్క రెండు కూనలు తల్లిగారికి ప్రీతిపాత్రమైనవి. ఒకటి 'పెద్దబ్బాయి' (Big boy), రెండవది 'కిక్కి' (kiki). కిక్కి సమష్టి ధ్యానమున పాల్గొనుచు మాకన్నను బాగుగా ధ్యానమొనర్చెడిది. అది కళ్ళుమూసుకొని ధ్యానము చేయుటకు మొదలిడిన తరువాత దానికి దివ్య దర్శనము లగుపడుచుండినవేమో దాని శరీరము పులకితము జెందుచుండెడిది. సాధన చేసినను అది మావలె అన్నివిధముల అనాగరికముగా ప్రవర్తించెడిది, 'పెద్దబ్బాయి' మరియు 'కిక్కి' మార్జాల సోదరురులు రెండును అహర్నిశముల పోట్లాడుచుండెడివి. అవి దూరముగా నుంచబడుచుండెను. మార్జాల సోదరుడైన పెద్దబ్బాయి ధైర్యవంతుడు మరియు బలవంతుడు. మార్జాల సోదరుడైన కిక్కిని పెద్దబ్బాయి అదరగొట్టుచుండెను. తుదకు రెండును వ్యాధితో బాధపడి మరణించినవి అవి యింటి యావరణమున పాతిపెట్టబడెను. రాజకుటుంబమేరీతిగ భోగ-భాగ్యములతో పోషింపబడునో, అటులనే మార్జాల రాజవంశీయులకు పాలు, చేపలతో ప్రత్యేకముగ ఆహారము తయారుచేయబడెడిది. వానికి ప్రత్యేకశిక్షణ యొసగబడెడిది. ఇంటియం దేమాత్రమల్లరి చేసెడివి కావు. ఈ పిల్లులతో పాటు శునక మొకటి యుండెడిది. ఆ శునకమును శ్రీవారు 'యోగిని' యని పిలిచెడివారు.

వృక్షసంపద, జంతుజాలమంతయు శ్రీమాతతో సన్నిహితముగ నుండెడిది. చరాచర జీవములు, మానవాళి యుండు ఈ దృశ్యజగత్తేగాక గుప్తప్రపంచమున నున్న జీవులు — చిన్నపిశాచములనుండి దేవతలు, శక్తిమంతమైన దేవతలవరకు

నెల్లరామెతో సన్నిహిత సంబంధము కలిగినవారే; ఇంతవఱకు శ్రీజనని సాధనా విధానమునం దెటుల మార్గదర్శినియై యుండినదో ఆ విషయమును నేను (శ్రీనళినీ కాంత గుప్తగారు) క్షుణ్ణముగా దెలిపితిని. ఇంక సామాన్యరీత్యా జీవితకళ యందు ప్రధానాంశమునుగూర్చి శ్రీజనని యెట్లు బోధించెనో దానినిగూర్చి వివరింతును :—

వస్తువులను సక్రమపద్ధతిలో నమర్చుట, మేము మా జీవితవిధానముల నించుక మార్చుకొని ఆరోగ్యకరముగా పరిశుద్ధముగా నుండుటకు వలయు శిక్షణ మాతృశ్రీ మా కొసగుచునే యుండిరి—అనగా నేనిచట నుడువునది యాధ్యాత్మిక సాధనా విధానమునకు సంబంధించిన విషయము గాదు—సామాన్య జీవనవిధాన మున సక్రమ పద్ధతిలో జీవనము గడుపుట మాత్రము చెప్పుచున్నాను. ఏ వస్తు వెచ్చట సక్రమ పద్ధతిలో నుంచవలయునో యాతల్లి మాకు నేర్పిరి. మేమిదివరకు విచ్చలవిడిగా మా వస్తువులన్నిటిని భోజనపు గదిలో చిందర వందరగ నుంచెడి వారము. అంతియే కాదు, క్రమశిక్షణ లేక యిష్టానుసారము ప్రవర్తించెడి వారము. మా బాహ్యజీవిత మెట్లు క్రమము లేకుండెనో మా యాంతరంగిక జీవితము కూడ కల్లోలమయమై యాందోళన కరముగ నుండెను. బహుశః ఆంతరంగికముగ మేము క్రమపద్ధతిలో లేకుంటిమి కాబోలు, బాహ్యముగ గూడ మా జీవిత నౌక లొడు దుడుకుగా నుండెను. తలంపులు మాలో నొక్కుమ్మడిగ ప్రవేశించి గందరగోళము చేయుటవలన మామస్తిష్కమనాలోచితమైన తలంపులతో నిండుచుండెడివి. మేము కొన్ని క్షణములైనను స్థిమితముగా గూర్చొని, యొక విషయమును గూర్చి నిల కడగా నాలోచింపలేకపోయితిమి. మేమొక నియమమును పాటింపలేక క్రమము తప్పుటచే, మాకు శాంతి సమాధానములు, సామంజస్యము మృగ్యముగ నుండినవి. మనస్స్వపరిస్థితియందుండునెడ ప్రాణిక సత్తా యింకను క్షీణదశయందుండినది. మస్తిష్కము బజారైనచో, హృదయము వెఱ్ఱివాండ్ర వైద్యశాల గాక యేమగును! శ్రీమాత స్వయముగ సక్రమజీవన విధానము ననుసరించి బాహ్య జీవిత విధాన మున మన యనుదిన జీవనోపకరణములను క్రమమైన పద్ధతిలో నమర్చుట ముఖ్యాంశమని చెప్పుచు ఆచరణ ద్వార గనపరచిరి.

అంతియేగాక, మనవస్తువుల నతి జాగ్రత్తతో నుపయోగించు కొనవలయు

నన్న విషయమును సూచించిరి. శ్రీజననియందుండెడి ప్రత్యేకత యేమన, ఆమె వస్తువుల నతి జాగరూకతతో నుపయోగించుటయేగాక. మిగుల ప్రేమాను రాగముతో నుపయోగించెడి వారు. ఆమె దృక్పథములో జడమైన వస్తువు లచేతనమైనవి కావు. వానికి గూడ నొక జీవితమే గాక వాని కనుగుణమైన చేతన కలదని యామె భావన ప్రతియొకటి వ్యక్తిత్వమును, స్వభావమును గలిగి యుండును 'అంతఃసంజ్ఞా భవంతి యే తే సుఖ దుఃఖ సమన్వితా' అని పూర్వి కులు ప్రకృతి సంపదను (plants) గురించి నుడివిన చందంబున మొక్కలు గూడ సుఖ దుఃఖములనెడి రెండవస్థలను పొందునని నుడివిరి. ప్రాచీన వస్తు సముదాయములను కేవలము పాత వస్తువులని పారవేయక ఆమె వానిని భద్రపఱచు చుండిరి. అట్లనిన లోభిత్వమని లేక పూర్వాచార పద్ధతి యని భావింప గూడదు. ఆమెకు ప్రాచీన వస్తు సముదాయములు పాత మిత్రులవంటివి. అంతియేకాదు, అవి సజీవమైన స్నేహితుల వంటివి, శ్రీమాత: మొదట మూర్తీభవించిన సౌందర్య సామంజస్యతతో మాకగుపించిరి. మేమామెను స్నేహితురాలుగా ఆహ్వానించితిమి. ఆమె సుగుణసంపదను గాంచినవారై శ్రీవారు కూడ ఆమెనటులనే ఆహ్వానించిరి. దివ్యమాత గుణగణములను వర్ణించు నంతటివాడను గాను ఐనను ఆమెనుండి మేము నేర్చిన నిగూఢ విషయములను జెప్పక తప్పదు. అంతటి నిష్కపటమైన, సంపూర్ణ మైన ఆత్మార్పణమును జేసిన వ్యక్తిని తాము కని, విని యెఱుగరని శ్రీవారు తమ శ్రీముఖము నుండి జనని సుగుణ సంపదను గూర్చి మాకు నివేదించిరి. సామాన్య ముగా యువతీమణులే యాత్మ సమర్పణ గావించుటకు తగిన భక్తి తాత్పర్యములు, సామర్థ్యము కలిగినవారని వ్రాకుచ్చిరి. అంతియేగాక, సులభముగ సంపూర్ణ సమ ర్పణ జేయువారలని నుడివిరి. అనగా, సుగుణదుర్గుణము లనెడు ద్వంద్వముతో గూడిన గతమును రూపుమాపుటను సూచించును శ్రీజనని ఇచ్చటి కేతెంచిన తరు వాత యోగీశ్వరుడైన శ్రీఅరవింద పాదపద్మముల చెంత పసిపాప వోలె నిష్క పటమైన అమాయికత్వముతో, తమ ఆధ్యాత్మిక సంపత్తిని, చేతన యనెడి పెన్నిధిని—ఇత్యాదులతో కూడిన గతమును విస్మరించితిమని నుడివిరి. అప్పుడే జననమొందిన శిశువు భంగి ముగ్ధ వోలె జనని యుండెను

నా వ్యక్తిగతానుభవము ననుసరించి, ఆమెను గూర్చి నేను వినిన కొన్ని విషయములను సమగ్రముగ జెప్పెదను. ఆమె ఆధ్యాత్మిక వికాసము నొందిన

మహాత్మురాలు. తల్లిగారు విశేషమైన ప్రజ్ఞతో గూడినదన్న విషయము తరువాత నాకు తెలియవచ్చెను. ఆ మహనీయురాలు ప్రఖ్యాత చిత్రకారిణి; సాహిత్య సంగీతములం దసామాన్యమైన పాండిత్యము గలది. వైజ్ఞానికముగ ఆమె అసామాన్యమైన పాండిత్యము గలది. శ్రీ జనని విద్యావిజ్ఞానములను గూర్చి చెప్ప నలవికాదు. పండితోత్తముని చందంబున ఆమె ఆర్జించిన విద్యా వినయ సంపద లనంతములు, అమోఘములు. అంతకంటెను ఆశ్చర్యకర విషయమేమన, సకల భోగ విలాసములకు సంపదలకు నిలయమైన ఫ్రాన్సు దేశమునందు వాసముచేయు చున్నప్పుడే గీతోపనిషత్తులు, యోగసూత్రములు మరియు నారద భక్తిసూత్రములు – ఇత్యాది గ్రంథములను తర్జుమా చేసిరి. ఆమె అనంత విజ్ఞాన మెటులార్జించిరో, భగవద్గీతలో చెప్పబడు నిర్వాణమన్న అనుభూతిని కూడ ఆర్జించిరి. దేశసేవలో నిమగ్నులైన శ్రీఅరవిందులకు పలయుచో వాక్కు దైవమొసగినటుల శ్రీజననికి వాక్కు సంకల్ప మాత్రముననే అనర్గళముగ కలుగుచుండెడిది. విద్యావినయ సంపదతో విరాజిల్లుచు ఈషణ్మాత్రము గూడ అహంకారమునకు చోటివ్వక యెల్లరకు ఆదర్శప్రాయమై తల్లిగారు మార్గదర్శకులైరి.

ఆధ్యాత్మిక చేతన, సాధనలో నిమగ్నమై సంపూర్ణముగ గతమును విస్మరించు టామె యొక్క ప్రత్యేకత. సామాన్యముగా, గతమునకు సంబంధించిన వివేకయుక్తమైన జ్ఞానమునుగాని ప్రాణిక సత్తాకు చెందిన లక్ష్యములను గాని- విస్మరించుట సాధ్యము కానేరదు. కాని, ఆధ్యాత్మిక దృక్పథమున గతమును విస్మరించుట అత్యంతావశ్యకము. మాతృశ్రీ ఇందులకు దోహదకారియై మార్గ దర్శినియైనది. కనుకనే ఆమె గతము నంతటిని తృటిలో మరచి శ్రీఅరవిందుల సాన్నిధ్యమున నూతన జీవితమును ప్రారంభించిరి. ఇందుల కుదాహరణముగ ఆమె శ్రీవారికడ సంస్కృతమును, వంగభాషను నేర్వ సంకల్పించి అక్షరాభ్యాస మొనర్చినది.

ప్రారంభదశలో శ్రీ అరవిందు లామెను 'మీరా' యని పిలుచుచుండిరి. ఇట్లు కొంత కాలమైన తరువాత ఆయన 'మీరా' అని పిలవబోయి 'మీ' అని, కొంతసేపటికి 'రా'అని పిలుచుచుండిరి. అట్టితఱి అదేదో అస్పష్టముగ నుండెడిది. దాని అంతరార్థము తరువాతనే మాకు బోధపడినది. శ్రీఅరవిందులు 'మాత' అని పిలుచుటకు సంసిద్ధులైరి. కాని, ఆమెను 'మాత' యని పిలుచుటకు మేము

సిద్ధముగా నుండలేదు. కాన, మాత యనబోయి 'మీరా' యనుచుండిరి. శ్రీ అరవిందుల శ్రీముఖమునుండి 'మాత' అన్న వాక్కు ఏ శుభముహూర్తమున వెలువడినదో అది దైవ ముహూర్త మనుటతిశయోక్తి కానేరదేమో! ఈ పృథ్వీ తలమున మానవుని విధివిధానమున, నదియొక వాస్తవికమైన మధురక్షణము. ఈ జడమైన భౌతిక ప్రపంచమున ఈ శుభముహూర్తముననే శ్రీ జనని మానవ సంబంధమైన బాహ్యచేతనలో ఆరాధ్యదేవతగా ప్రతిష్ఠింపబడినది.

## 9

## అధిమానసావతరణము

శ్రీ మాతారవిందులు నేటి యుగమునకు మార్గదర్శకులు. వీరి యవతారోద్దేశ్యము ఐహిక జీవనమును దివ్యముగా పరిణమింప జేయుటయే! అన్నిటిని సమన్వయ మొనర్చు పూర్ణయోగమే నేటి మానవుని పునరుద్ధరణకు రాజమార్గమని వీరు నిరూపించిరి. మన జీవితమంతయు యోగమని శ్రీ అరవిందులు వచించిరి. అంతియేగాక 'నీలో యే భాగమైనను యెంతవరకు ప్రపంచమునకు సంబంధము కలిగియుండి నంతవరకు నిన్ను ప్రపంచము బాధించును. నీకు పరిపూర్ణముగా దైవముతో సంబంధము కలిగినప్పుడే స్వతంత్రుడవు కాగల'వని శ్రీఅరవిందులు వక్కాణించిరి. ఈ స్వాతంత్ర్య మెట్లు కలుగునన్నదే యొక సమస్య. జీవి స్వతంత్రుడు కావలయునన్న తన యాత్మను తానెఱింగి, విజ్ఞానభూమిక యందు నివసించుచు భాగవత దివ్యజీవనమున కలవాటు పడవలయును. ఇట్టి జీవితమునందు సంక్షోభమునకు గాని స్వార్థపరతకు గాని తావులేదు. ఈ విజ్ఞాన భూమిక నారోహించిన మహాపురుషుడు బాహ్యబుద్ధిచేత నడుపబడక దివ్యజ్ఞానము చేతనే నడుపబడుచుండును. కావున, అతీత కర్మలు చేయుచుండినను కర్మాతీతుడై విలసిల్లును. ఈ విజ్ఞాన భూమికకు జేరవలయునన్న మానవుడనేక భూమికలను దాటవలసి యుండును.

సాధారణ మానవ మానసమునకు, అతీత మానసమునకు మధ్య నెన్నియో దశలు కలవు. పూర్ణయోగానుసారము సహస్రారము పైననూ — మూలాధారము క్రిందను చక్రాలు కలవు. చక్రముల వివరణము:—

(1) మూలాధార చక్రము.
(2) స్వాధిష్ఠాన చక్రము
(3) మణిపూరక చక్రము (నాభి)
(4) అనాహత చక్రము (హృదయము)
(5) విశుద్ధ చక్రము (కంఠము)
(6) ఆజ్ఞా చక్రము (భ్రూమధ్య)
(7) సహస్రారము (శిరస్సు)

మనో భూమికపై నుండు స్తరములను

(1) ఉన్నత మనస్సు
(2) జ్యోతిర్మయ మనస్సు
(3) స్వతఃస్ఫురణ మనస్సు
(4) అధి మనస్సు
(5) అతీత మనస్సు

అను భూమికలుగా వివరించవచ్చును.

(1) మూలాధార చక్రము; — ఇందు జ్ఞాన శూన్యములైన యన్నివిధములగు ఆవేగములు, ఉద్వేగములు, స్మరణలు, అసంబంధమైన స్వప్నములుద్భవించును. ఈ చక్రము గౌర వర్ణముగల నాలుగు దళములు కలిగిన కమలము వోలె నలరుచుండును.

(2) స్వాదిష్టాన చక్రము :— ఇది నిమ్న ప్రాణిక చైతన్యమునకు ముఖ స్థానమై మన తుచ్ఛ లాలసలను, దురాశలను, కామమును ఇంద్రియ ప్రవృత్తులను నడుపుచుండును.

(3) మణిపూరక చక్రము :— ఇది నాభియందున్నది. ఇది యుదార ప్రాణిక

శక్తులను ఉత్తమ భౌతికావేగములను నడుపుచుండును. ఇది యూదా రంగుతో, పండ్రెండు దళములతో శోభిల్లుచుండును.

(4) అనాహత చక్రము :— దీని స్థానము హృదయము. ఇచ్చట విశుద్ధ హృదయుల కనాహత వాణి (అంతరుత్పన్నమగు వాణి) వినబడును. ఈ వాణి సత్యమార్గ ప్రదర్శకమై మానవుని నడుపుచుండును. ఈ చక్రము యెఱ్ఱని పుష్పచ్ఛాయతో పండ్రెండు దళములతో నొప్పారుచుండును.

(5) విశుద్ధనామ చక్రము :— ఇది కంఠము నందున్నది. ఇందలి చైతన్యము మన మనోధికారమునకు లోబడక ప్రాణిక దైహికాధికారమునకే లోబడి యుండును. మానవమనస్సంకల్ప మొక కార్యమును జేయవలదని యాదేశించినను, ప్రాణిక దైహిక చేతనలు దాని యాజ్ఞ నుల్లంఘించుచుండును. ఈ చక్రము గోధుమ వన్నెగల పదియారు దళముల పుష్పమును బోలి యుండును.

(6) ఆజ్ఞాచక్రము :— ఇది భ్రూమధ్యమునం దుండునది. ఇదియే అంతర్దృష్టికి కేంద్రస్థానము. ఈ పద్మము వికసించినతఱి, యోగదృష్టి గలిగి, వస్తు విషయముల యొక్క మనుష్యుల యొక్క బాహ్యస్వరూప స్వభావములనే కాక అంతఃస్వరూప స్వభావములను గూడ నెఱిగి యుండును. ఈ చక్రము రెండు శ్వేత దళములు గలిగి భాసిల్లును.

(7) సహస్రారము :— ఇది సహస్రదళములతో నలరారుచుండును, సువర్ణచ్ఛాయ గలిగియుండును. ఈ బ్రహ్మరంధ్రము పైని సహస్రారమందు మనచేతనను జీవుని వసింప జేయుటయే సమాధి — ఐహిక ముక్తి యగును.

సహస్రారముపైన నెన్నియో భూమికలు గలవు. అవి యతీతమానసమునకు సోపానములు. అందులో మొదటి సోపానము — ఉన్నత మనస్సు (Higher mind) ఉన్నత తలంపులతో ప్రజ్వలించుట దీని విశేషగుణము.

అత్యంత వెలుగుతో గూడిన జ్యోతిర్మయ మనస్సు ఉన్నత మనస్సునకు పైన గలదు. ఇది ఆధ్యాత్మిక వెలుగుతో గూడినది. ఇది భగవానుని సాకారముగా దర్శన మొనరించుటకు తోడ్పడును. తరువాత స్వతఃస్ఫురణము

(1) సత్య సందర్శనము

(2) సత్య శ్రవణము

(3) సత్య స్పర్శ

(4) సత్య వివేచనాశక్తి

ఈ నాల్గును స్వతః స్ఫురణము యొక్క శక్తులు. ఈ శక్తుల ద్వారా ఇది మనః, ప్రాణ, శరీరములను ప్రకాశవంతముగ జేసి దివ్యపరివర్తనమును కలుగ జేయును. తరువాతి సోపాన మధిమనస్సు (over-mind). ఇందెల్లెడల సర్వాత్మ గోచరించి విశ్వచేత నానందసత్తాలు ప్రత్యక్షమగును. తరువాత అతీతమానసశక్తి యనున దొకటి కలదు. కుండలినీశక్తి చక్రము లన్నిటిద్వార ప్రవేశించి, నూతన తేజస్సునుశక్తినిపొంది తుదకు సహస్రారభూమికలను బేధించి అతీతమానసవిజ్ఞాన జ్యోతిని పొంది మరల అవరోహణ మొనర్చునని శ్రీఅరవిందులు నుడివిరి కాని, ఈ దశను జేరుకొనుట సులభకరము కాదు. సాధారణభూమికల కావల చేరినంతనే సామాన్యముగా దివ్యభూమికలకు జేరినట్లుగా పలువురు భావింతురు. పైన కన బరచిన యేయొక్క భూమికనో జేరినంతనే కన్నులకు మిరుమిట్లు గొలుపు బ్రహ్మాండమైన ఆ జ్యోతి ప్రకాశమునకు తట్టుకొనలేక అది యతీతమానస భూమిక కాకపోయినను దృష్టి గోల్పోవునంతటి పరిస్థితి యేర్పడును. అంతియేగాక సమతను గోల్పోవుదురని శ్రీజనని నుడివిరి.

1926వ సంవత్సరమున నవంబరు 24వ తేదీనా డాధ్యాత్మిక దృక్పథ ములో నొక నూతనాధ్యాయము ప్రారంభమైనది. ఒక నూతన జాతిని సృష్టించు కొఱకు, యోగమునందింకను ఏకాగ్రత వహించుటకై శ్రీఅరవిందు లేకాంత ముగా నుండవలయునన్న నిశ్చయమునకు వచ్చిరి. నవంబరునెల 24వ తేదీనాడు శ్రీవారికొక గొప్ప సిద్ధి గలిగినది. ఈ ధరాతలమునం దింతవరకు ఉపలబ్ధి పొంది యున్న తమ దివ్యచైతన్యమును, శ్రీకృష్ణుడు పొందిన అధిమానస చైతన్యమును

శ్రీవారు భౌతిక సత్తాలోనికి దేగలిగిరి. ఈ పరమసత్తా శ్రీఅరవిందులలోని కవతరణ మొనర్చినది. తద్వార ముందిది పృధ్విలో అవతరించుటకు సాధ్యత యేర్పడినది. తామేకాంతమును స్వీకరించుటకు ముందు దివ్యమాతను — గురువుగాను, మార్గదర్శినిగా నియమింప దలచిరి. అంత తమవద్దనుండు ఇరువదిమంది సాధకులను బిలిచి, తామికమీదట యేకాంతముగా నుండదలచితిమనియు, ఇకమీదట మాతృశ్రీ శక్తిగాను, గురువుగా నుండెదరని తెలియజేసిరి. శ్రీకృష్ణుడు భగవద్గీతను బోధించి, విశ్వరూపసందర్శనమును చూపువరకు శ్రీకృష్ణునిలోని మహత్తర శక్తి అర్జునునకు తెలియనట్లు, మాతృశ్రీ తమశక్తిగాను, గురువుగా నుండ గలరని సాధకులకు శ్రీవారు చెప్పునంతవరకు ఆమెలోని మహత్తర శక్తిని వీరు గుర్తింప లేకపోయిరి.

అధిమానస శక్తి శ్రీమాతలోని కవతరణ మొనర్చినది. ఆ యధిమానసావతరణమును గూర్చి మాతృశ్రీ ఒకపరి సాధకుల కిట్లు విశదీకరించిరి: —

“ఇంతవరకు మానసిక, భౌతిక ప్రపంచమంతయు ఈ జగత్తంతయు శ్రీఅరవిందులు చెప్పునటువంటి అధిమానస చేతనా శక్తుల వలననే పరిపాలింపబడుచుండెను. భగవానుడని మానవుడు దేనిని జెప్పుచున్నాడో ఆ శక్తి, బల మాతని కధిమానసము నుండే కలుగుచున్నది. అంతియేకాదు ఈ జగత్తంతయు అధిమానసాధిపత్యముననే యున్నది ఈ యధిమానస భూమికను జేరుకొనవలయునన్న సాధకుడు నడుమనున్న భూమికల నొక్కొక్కటిగా ప్రవేశమొనర్పవలయును. అయితే, ఈ యధిమానసారోహణము బహుప్రయాసతో గూడినపని. మిరుమిట్లుగొలుపు ఆ ప్రకాశమునకు తబ్బిబ్బులుగాక, ఆ యధిమానస భూమికనే కొందరో జేరుకొందురు. అయితే అధిమానసాధిపత్య మిక అంతరించి దాని స్థానములో అతీతమానస మంకురింప నున్నదని శ్రీఅరవిందులుద్ఘాటించిరి. ఆధ్యాత్మిక సాధనల ననుభవించినవారలు, దైవయునికిని కనుగొని దైవముతో నైక్యమైనవారల కెల్లను అధిమానసమును గూర్చి బాగుగా విదితమే! అధిమానస భూమిక కావలేదియో కొంత ప్రకాశమున్నదనియు, ఆ ప్రకాశావతరణ జగత్పరిపాలన కొక మంచితరుణమనియు శ్రీఅరవిందులు నుడివిరి. అధిమానసమును గూర్చి విశేషముగా వివరించి అనుభవించినవారలు కొల్లలు గనుక దానిని గురించి

మనకంతగా నవసరము లేదు. ఎవ్వరును కని, విని, యెఱుగని ఒక మహత్తరమైన నూతనతేజ మొక నూతనపంథాలో అభివ్యక్తము కానున్నది, ఇంతవరకు దానిని గురించి యెవ్వరికి తెలియదు. అందుకనే అధిమానసపు అనుభవమును గూర్చిన వివరములకు, దానిని గూర్చి రచింపబడిన పుస్తకములకు కూడ కొఱతయే లేదు. ఒక నవీనతను గూర్చి చెప్పుటకే శ్రీఅరవిందు లవతరించిరి. ఇంతవరకు కని, విని, యెరుగని ఒక మహత్తర శక్తినే, అధిమానసిక ప్రపంచము మొదలుకొని ఇతర భూమికలకుపైన జేరి, అనుభవైక వేద్యమునే శ్రీవారతీతమానస మనిరి. ప్రాచీనయోగము లంతమగు తఱి, తమయోగము ప్రారంభింప బడుననియు చెప్పిరి. తమ యోగము నుపలబ్ధి బొందగోరినచో ప్రాచీనయోగము లుపలబ్ధి పొందినదాని అంత్యపు సరిహద్దులకు జేరుట ప్రప్రథమగా ఆవశ్యకమైనది. దివ్యజ్ఞానమును గూర్చి తెలిసికొనుట, దైవ సంయోగము, బ్రహ్మసాయుజ్య మని యర్థము. మానవచేతనచే నూహింప నలవిగాని యాదైవమునే శ్రీ అరవిందు లధిమానసిక దైవమనిరి. ఏలన దానిని చేరుట కొఱకు పెక్కు భూమికలను చేరవలసియుండును. అంతియేగాక, ఈ భూమికలలో మిరుమిట్లు గొలుపు మహత్తర ప్రకాశమునకు నిలువనాలని పరిస్థితి కద్దు. ప్రాణికలోకములో జీవులున్నారు. వారు మానవులకు కనిపించినపుడెల్లనా జీవులనే పరమేశ్వరుడుగా మానవులు భావింతురు — ఈ ప్రాణిక వ్యక్తులను మారువేషధారులు, విజయవంతమైన మారువేషధారులనియే చెప్పవచ్చును ఏలన, వానిని దర్శించినవారలలో ప్రధాన దేవతను గాంచినంత నమ్మకమును కలుగజేయును. అయితే వారు మాత్రము ప్రాణికలోక జీవులు మాత్రమే! అధిమానస వ్యక్తులు! అధిమానసిక దైవములు! మానవ సంబంధములో శక్తిమంతమైన వ్యక్తులు! వానితో మానవుల సంబంధము దిగ్భ్రమ నొందించును.

ఇతరులు పొందిన అనుభవము వలన నొకరు ఫల మనుభవించు నొకానొక యనుగ్రహము కలదు. అది శాస్త్ర సంబంధమైన బోధనా విధానము వంటిది. నూతన పరిశోధనను (New discovery) కనిపెట్టవలయునన్న శాస్త్రకోవిదులు మరల అన్ని ప్రయోగముల నొనర్చవలసి యుండును. ఇతరులు కనిపెట్టిన వానిని గూర్చి క్షుణ్ణముగా తెలిసికొనవలయునన్న జీవితమంతయు దానికై ధారబోయవలసి యుండును. నూతన పరిశోధనలను కనిపెట్టుటకు వ్యవధి యుండదు. ఇప్పటివటు

వంటి ప్రమేయమే లేదు. నీ వొక పుస్తకమును తెరచినచో దాని ఫలితములను గాంతువు. వాని ద్వార ముందుకు పురోగమింతువు. శ్రీఅరవిందు లిటులనే చేయ దలచిరి. తమకంటే ముందువారలు కనుగొన్న ఫలితముల నెచ్చట కానగునో వానిని గూర్చి శ్రీఅరవిందులు మీకు తెలిపెదరు — అంతియేగాక ఆధ్యాత్మిక చరిత్రలో వారుచేసిన ప్రయోగములు వాని ఫలితములను, అందలి మీ స్థానమును — ప్రాపంచి కాధ్యాత్మిక చరిత్రలో చారిత్రాత్మకముగ మీ స్థానమును గూర్చి శ్రీఅరవిందులు చెప్పెదరు. అక్కడనుండి పునాది దృఢముగా నున్నచోటికి మిమ్ము తీసికొనిపోయి పర్వతము నారోహింప జేయుదురు."

అధిమానస శక్తి యవతరించిన తొమ్మిది — పది మాసముల వర కెన్నో యద్భుత విశేషములు జరిగినవి. శ్రీ తల్లిగారు, శ్రీఅరవిందుల గది కేగి 'సృష్టికి వలయు వాక్కు నాకు కలిగిన' దని చెప్పగా శ్రీఅరవిందు లించుక సేపు మౌనము వహించి, 'ఈ సృష్టి అధిమానసమునకు చెందినది. మనకిది వలదు. మన మతీత మానస ప్రపంచమును నిర్మింప వలయు' ననిరి. ఈ మాటల నతి శ్రద్ధతో నాలకించి తల్లిగారు తమగదికి పోయి భూమిపై యవతరింపనున్న యధిమానస సృష్టిని లయమొనర్చిరి. పిమ్మట శ్రీమాతారవిందులు అతీతమానస జగత్తును నిర్మించుట — అతీత మానసశక్తి నూర్ధ్వము నుండి పృథ్వీతలమునకు గొనివచ్చుటకు సాధనను ప్రారంభించిరి. పూర్ణయోగ పంథా కొక మార్గమును నిర్మించి యెల్లరకును ముక్త జీవనమును ప్రసాదించుటకై శ్రీమాతారవిందులు కృషి సలుప దొడగిరి.

# 10

## ఆశ్రమ నిర్వహణ

శ్రీఅరవిందుల యాశయములను, అమృతత్వమును నిరూపించుటకు శ్రీఅరవిందాశ్రమము సజీవ చిహ్నము. అజ్ఞానాంధకారములతో నావరించియున్న

ఈ ప్రపంచమునకు ఆశ్రమ మొక వెలుగువంటిది. భారతదేశము దైవభూమి. ఇందు సత్యమునకై తమ సర్వస్వమును త్యాగము జేసినవా రెందరో మహాను భావులు జన్మించిరి. దైవాదేశానుసారము, మహాయోగీశ్వరుడైన శ్రీఅరవిందులు 1910వ సంవత్సరమున పుదుచ్చేరికి వచ్చిరి. ఆయన రాకతో పుదుచ్చేరి తపోవనమై పవిత్రమాయెను. అగస్త్య మహర్షి సందర్శించి వాసముచేసిన పుదుచ్చేరియందు స్థిరనివాస మేర్పరచుకొన సంకల్పించి శ్రీఅరవిందు లచ్చట నలువది సంవత్సర ముల పర్యంతము తపమొనర్చిరి. శ్రీవారి అఖండ తపఃఫలమే శ్రీఅరవిందాశ్రమ నిర్మాణము. శ్రీఅరవిందాశ్రమ నిర్వహణ శ్రీజనని యాధ్వర్యమున దినదినాభి వృద్ధి గాంచుచున్నది.

ఈ భువి పరిణామము నొందుటకు భగవానునిచే సృష్టింపబడిన ఒక క్షేత్రము. ఇందు మానవుడు క్రమేణ పరిణామము నొందుచున్నాడు. ఇచ్చట మనము త్రిగుణాతీతులగుటయే గాక వానిని మార్చ జేయ వలయును. మానవు డపరాప్రకృతికి గాక, పరాప్రకృతికి తన్ను తానప్పగించు కొనవలయును. శ్రీఅరవిందాశ్రమమున నున్న సాధకులు సన్న్యాసులు గాదు. ఈ యాశ్రమ మన్ని యాశ్రమములను బోలియుండలేదు. ఇచ్చట యోగము జేయుట కేవలము ముక్తి కొఱకు గాదు. యోగచేతన, యోగశక్తితో నేర్పరుపబడిన కర్మయోగము నకే ఇచ్చట ప్రాశస్త్య మధికము. పరికించి చూడ శ్రీజనని జీవితకార్యములే ఆశ్రమ చరిత్ర యనవచ్చును. 'ఆశ్రమము శ్రీజనని సృష్టించినదే' అని శ్రీఅరవిందులు చెప్పుట సమంజసముగ నున్నది. ఆమె ఆదర్శజీవనమే యెల్లరకు వెలుగుబాట. కనుకనే ప్రస్తుతమాశ్రమ వాసియైన శ్రీ నళినీకాంత గుప్తగారు శ్రీజననిని గూర్చి యిట్లు నిర్వచించిరి.

"మాతృశ్రీ యరుదెంచి, శ్రీఅరవిందులను గురువుగా, యోగీశ్వరునిగా నున్నత పీఠము నలంకరింపజేసిరి... ...ఆమె వాక్కు ద్వార, ఆచరణ ద్వార గురుశిష్య సంబంధ మేలాటిదో మాకు తెలియజేసినది. మాతృశ్రీ అహర్నిశ ములు బోధించినదానినే యాచరించుచుండిరి, శ్రీఅరవిందు లాసీనులగుతటి వారి కభిముఖముగ ఒకే స్థాయిలో ఆసీనురాలుగాక, గురుసాన్నిధ్యమున అత్యంత గౌరవభావముతో శ్రీవారి పాదారవిందముల కడ ఆసీనయయ్యెడిది. గురుసాన్నిధ్య

మున మెలగవలసిన విధానము నామె యాచరణ ద్వార కనబరచిరి."

ఆశ్రమ నిర్మాణపు దినములలో తల్లిగారు నిరాడంబర జీవితమునే కొనసాగించుచుండిరి. సామాన్యమైన రెండు, మూడు చీరల కంటె నామె కెక్కువ యుండెడివి కావు. ప్రత్యేకమైన గది కాని, సరియైన పడకగాని యుండెడిది కాదు. ఇట్టితఱి, సాధకులెల్లరు నొక గది నేర్పాటు జేసెదమని యామెకు విన్నవించుకొనిరి. ఆమె తమ పాశ్చాత్య పద్ధతులనెల్ల త్యజించి హిందూమత సంప్రదాయముల ననుసరించి. హిందూ యువతుల వోలె చీరను ధరించిరి. ఆమె యేకార్య మొనర్చినను హృదయ పూర్వకముగ చేసెడివారు. ఆమె దినచర్య పుస్తకము నందు ప్రార్థనలను రచించుచుండిరి.

1922వ సంవత్సరము నుండి మాతృశ్రీ ఆశ్రమ బాధ్యత నెక్కువగ వహించిరి. సాధకులు కొందరు చేరిరి. అట్టితఱి ఆహార సమస్యను గూర్చి ఆలోచింపవలసి యుండెను. ఇరువురు గుజరాతీ బాలికలు వంటచేయుట కంగీకరించిరి. 'బంగాళదుంపలు, పొట్లకాయలు — ఇత్యాది కాయకూరలున్నవి, వీనిని వండు విధానమును గూర్చి మాకు తెలియ జేసెదరా?' యని ఆ గుజరాతీ బాలికలు తల్లిగారిని ప్రశ్నింపగా ఆమె 'పొట్లకాయలు చిన్న గొట్టములవలె సన్నగా తరుగుకొని, లోపలివిత్తనములను తీసివేసి ఉడకబెట్టిన బంగాళ దుంపలను ఉల్లిగడ్డల ముక్కల నాగొట్టములలో నింపి సన్నని మంటపై బాణలినుంచి అందులో వేసి వండవలయు.' నన్న సలహాల నప్పుడప్పు డొసగుచుండిరి. ఒక్కొక్క పర్యాయము వంటచేయు విషయమై శ్రీవారు కూడ సలహాల నిచ్చుచుండిరి. 'సలహా లవసరము లేకయే మీరు బాగుగా వంటజేయుదురు. మీ ఇచ్ఛ వచ్చినట్లు చేయు' దని కూడ శ్రీవారనుచుండెడివారట. పుష్టికరమైన ఆహారము నొసగుటలో తల్లిగారతి జాగరూకత వహించుచుండిరి. సాధకులకొరకు భోజనశాల కూడ కట్టబడెను. ఒక్కొక్క సాధకుడొక్కొక్క ప్రత్యేకమైన పనికి నియమింపబడెను. వస్తువుల బేరమునకై ద్యుమాన్ అను సాధకుని తల్లిగారు నియమించిరి. భోజనశాల, వంటశాల, గ్రంథాలయము, వైద్యాలయము మొదలగునవికట్టబడెను. 1925వ సంవత్సరమున కల్తీలేని పాలను సాధకుల కందుబాటులో నుంచుటకై, పాలుపితుకు సమయమున తల్లిగారచ్చటనుండి పాలలో నీరు కలుపకుండునట్లు గమనించుచుండిరి. తరువాత ఆపని అమృత యను సాధకున కప్పగింప బడెను.

కొంతకాలమైన తరువాత ఆశ్రమమువారే గో సంరక్షణ బాధ్యతను వహించిరి. ఆశ్రమమునకు స్వంత గోవులు, గేదెలు — ఒంగోలు, సింధి కచ్ఛి మొదలగు వివిధ జాతులలో కలవు. ఆశ్రమ వాసులకు కావలసిన పాలు లభించుచుండెను. తరువాత కాగితపు పరిశ్రమ, కుటీర పరిశ్రమలు వృద్ధి నొందినవి. మాసమునకు కావలసిన వస్తువుల నొసగుటకై యొక సామాగ్రి కొట్టు నేర్పాటు చేసిరి. తల్లి గారు శ్రేయోదినమున (Prosperity Day) సాధకులకు అనుదిన జీవనోపాధికి వలయు వస్తువులను మాసమునకు సరిపోవునట్లు 1వ తేదీన సాధకీ – సాధకుల కొసగుచుండిరి.

ఇచ్చట కర్మయోగమున కెక్కువ ప్రాశస్త్యము ఒసగబడినదని యిది వరలో తెలిసికొంటిమి. 'జీవితమంతయు యోగము' — 'దైవము నేవిధముగ నుపాసింతుమో అదేవిధముగ కర్మలను గూడ జేయుదుము. ఏలన దైవమునకు దేహము యొక్క ఉత్తమ ప్రార్థన కర్మయే.' అన్న సూక్తు లన్ని శాఖలయందు వ్రాతమూలకముగా మనకగుపించుటయే గాక, సాధకుల హృదయ పూర్వకమైన సేవలో మనకా సత్యము గోచరించును ఇచ్చట భేద భావనలు లేక యెల్లరును కలసి యుమ్మడిగా తల్లిగారు వారికొసగిన పనులను సకాలమునకు శక్తివంచన లేక స్వార్థరహితులై నిర్వర్తించుచుండిరి. కనుక, ఇక్కడ సోమరితనమునకు తావు లేదు. ఆశ్రమమునందు పలుశాఖలు కలవు. ఒక్కొక్క శాఖ సక్రమపద్ధతిలో నభివృద్ధి గాంచుటకు ప్రతిశాఖ కొక సాధకుని పెద్దగా నియమించిరి. ప్రతిశాఖయు శ్రీజనని ఆధ్వర్యమున నడచుచున్నది.

ఇచ్చట నింకొక నియమము గలదు. ఎల్లరు శారీరక వ్యాయామము నందు పాల్గొనవలయుననిరి. 'శరీరమాద్యం ఖలు ధర్మ సాధనం' అన్నటుల దివ్యజీవన మును గడపుటకు దివ్య శరీరము గూడ అత్యంతావశ్యకమని శ్రీజనని నుడివిరి. రోగరహితమైన శరీరము యోగపరిపూర్ణతకు దోహదకారి యగుననిరి. పూర్ణ యోగి చురుకుగా ఉత్సాహముగ నుండవలయు ననిరి. అందులకు తామే మార్గ దర్శకులై ప్రతిదినము సాయం సమయమున బంతి ఆటాడుటకు వెళ్ళు చుండెడివారు.

యోగసాధన కత్తిమీద సాముపంటిదనియు, అంతములేని యెడారివలె

విస్తారమైన దనియు, సామాన్య జీవితమున కలవాటుపడిన విషయలోలుర యభి
ప్రాయము. కాని, యోగసాధన శ్రీమాతారవిందుల వెలుగునీడలలో సుఖమయా
నందదాయకము. యోగసాధన ప్రారంభదశలో దుఃఖమయముగ నున్నటు లని
పించును. కాని, సాధన చేయుకొలది అమృతప్రాయముగ నుండును. మరుగు
వడిన యా మాధుర్య ముబుకగా దానికే ప్రాపంచిక సుఖములు సరిరావు. ఆత్మ
సమర్పణ, హృదయ పూర్వకత యోగసాధనకు ప్రప్రథమముగా కావలసినవి.
ఒక పరి తల్లిగారు 'ఆత్మ సమర్పణ, హృదయపూర్వకత నీలో పెంపొందినచో
అంతయు సుగమమే యగు' నని యొక సాధకునకు జెప్పిరి. ఆ మాటలు విన్న
యాసాధకుడు దిగ్భ్రమ నొందెను. హృదయపూర్వకత, ఆత్మసమర్పణ ఇత్యాది
నిబంధనలను మాతృశ్రీ యేల విధించిరో ఆతని కవగతము కాలేదు. కాని, కాలమే
యాతని కీ విషయములను గూర్చి స్పష్టపఱచెను. మనో, వాక్కాయ కర్మలతో
భగవానునికి సమర్పణ జేయుట యెంత కష్టతరమో ఆతనికి తెలియవచ్చెను.
నిరుత్సాహపూరితుడై 'శాశ్వతముగా విలువ గలిగినదానిని నేను సాధించనైతిని.
అమూల్యమైన కాలము వృథాగా గడచిపోవుచున్నది. సాధన లేశమాత్రము
లేదాయె'నని చింతింప దొడగెను. ఒకనాడతనికి స్నేహితుని గృహమందు గోడకు
దగిలించిన పటములో శ్రీజనని రచించిన రాధికా ప్రార్థనను గాంచుట తటస్థిం
చెను. దానిని చదివి యందులోని నియమముల నొక్కటియైనను పాటించుటకు
తనకు శక్తి గలదా? యని తన్ను తానే ప్రశ్నించుకొనెను. ఆ రాధికా ప్రార్థన
ఆతనిపట్ల మంత్రమాయెను.

శ్రీతల్లిగారి కటాక్ష వీక్షణమున నొక సాధకున కహంకారము బాసినవైనము
నిందు వివరించుచున్నాను. ముప్పది సంవత్సరముల పాటు ఒక సాధకుడు భగవ
ద్గీతను పఠించుచు ఉపవాసాది క్రమములను పాటించుచు దైవమార్గానురక్తుడై,
నిత్యానుష్ఠానములను యథావిధిగా నొనర్చుచుండెను. ఆతడొక పర్యాయము
శ్రీఅరవిందాశ్రమమునకు వచ్చుట తటస్థించెను. ప్రప్రథమముగ ఆశ్రమమును
దర్శించి పదినెనిమిది దినములున్నను ఆతనికి దివ్యపరిణామము కలుగలేదు.
ఆతడాశ్రమమును వీడునపుడు బరువైన హృదయముతో తనలో నేమార్పు కలుగ
నందులకు చింతించెను. ఆతడు తన నిజనివాసమున కేగిన కొంతకాలమునకు

'నీవు ముప్పది సంవత్సరముల పాటు సాధనలను జేయు చున్నానన్న యహం కారముతో విఱ్ఱవీగుచున్నావు గాన నీకు జ్ఞానవికాసము కలుగ లే'దని ఆతని యంతరాత్మ ప్రబోధించెను. తరువాత శ్రీజనని ఆ సాధకునకు తన మనోమందిరమున సాక్షాత్కరించెను. శ్రీజనని సందర్శన మాత్రమున పరమానంద భరితుడై యతడు మరల ఆశ్రమమును సందర్శించెను. శ్రీజనని యాతనికి ఆశ్రమమునందు నివాసము చేయుట కనుమతి నొసగిరి. సాధనయం దాతడు పురోగమించిన విధమును శ్రీజనని యామోదించినట్లాతని జన్మదిన సందర్భమున తెలియజేసిరి. 'దైవారాధన వలన అహంకారమును జయింప వచ్చును. ఎడతెగని, నిష్కపటమైన యాకాంక్షతో నీవు ప్రార్థించిన యెడల దైవము నీ మొరాలకించు'నని తల్లిగారు జెప్పిరి.

ఒక్కొక్క పర్యాయ మాశ్రమవాసులుగ నున్న సాధకులు దుష్టశక్తుల ప్రమేయముతో నాధ్యాత్మిక జీవనమునకు స్వస్తిజెప్పి యాశ్రమమును వీడుట కుద్యుక్తులగుచుండిరి. కాని, సహనశీలయైన శ్రీమాత వారిని తృణీకరించక, యెప్పటి ప్రేమానురాగములే వారియెడ జూపు చుండెడిది. శ్రీమాతారవిందులు విశాల హృదయము గలవారు. వారు దేశకాలపరిస్థితులను క్షుద్రభావనతో జూడక, విశాలదృక్పథములో జూచుచుండిరి. సాధకులపై వారి ప్రేమానురాగము లపారము. 'మానవులు బాహ్యమునను, అభ్యంతరమునను, స్వతంత్రముగ తృప్తితో పూర్ణాభివృద్ధితో ప్రపంచములో నెక్కడైన నివసించవలయునని కలగనిరి. ఆ స్వప్నము నిజమైనది.

శ్రీజనని ప్రఖ్యాత చిత్రకారిణి యగుటచే నామె యెన్నియో చిత్రములను చిత్రించి అడిగినవారికెల్ల నొసగియుండిరి. ఒక పర్యాయ మొకానొక సాధకుడు వివిధప్రదేశములలో తల్లిగారు పంపిణీ కొసగిన చిత్రపటములను మరల సేకరించిన బాగుండునని తన అభిప్రాయము నామెకు తెలియజేసెను. అంత తల్లిగారు 'వాని సేకరణ కంత ప్రాధాన్యమా' యనిరి. అప్పుడా సాధకుడు 'జననీ! మీరెంతో శ్రమపడి చిత్రించితిరి. అవి యమూల్యమైనవి. అవి మనవద్దనే యుంచుకొన తగ్గవి.' అని నుడివగా శ్రీజనని చిరునవ్వుతో 'మనము శాశ్వత సచ్చిదానందములో నున్నామని నీకు తెలియదా!' యనెను.

శ్రీజనని సమస్తమును మార్పుచేసిరి. ముఖ్యముగా యోగ సాధనా

విధానములో మార్పు తే గలిగిరి. పరికించిచూడ, తల్లిగారు బోధించుట సమాధిని గూర్చి గాము ఆత్మ సమర్పణను గురించి; ముక్తిని గురించి కాదు పరిణామ మును గురించియే! 'సత్యం, శివం, సుందరం' అన్నటుల ప్రతియొక దానిలో సత్యము, శివమే గాక సౌందర్యమును గూడ అభివ్యక్త మొనర్చుటను గూర్చి యామె తెలియజేసిరి. ఆశ్రమములో నుండు రస సౌందర్యముతో తులతూగు సమస్త వస్తువులు తల్లిగారి కళాప్రపూర్ణ దృష్టికి, రసజ్ఞానాభిరుచికిని నిదర్శన ములు ప్రాచీన భారతదేశములో కళకుండు విశేష ప్రాముఖ్యత మరల ఇచ్చట ప్రస్ఫుటమగుచున్నది. ఆమె కళాస్వరూపిణి, మాధుర్యగానామృత మోదిని, కనుకనే ఆ శ్రమజీవితమంతయు కళాచ్ఛందోలయలతోనిండి, నిబిడీకృతమై నేయబడిన వస్త్రమువోలె నున్నది. ఆమెనుండి వెలువడిన దంతయు మధురకవిత్వ సదృశ్యమై యొప్పారును. దివ్యమాత సాన్నిధ్యములో నుండు కొందరిలోగూడ నామె శక్తి సామర్థ్య ప్రవాహము కొంతవరకు కానగును ఆమె కృపా కటాక్ష వీక్షణమునకు పాత్రులైనవారిలో లలితకళలు పెంపొంది యాదర్శగాయకులుగను, చిత్రకారులు గను విలసిల్లిరి. శ్రీమాత సన్నిధానమున నిరంతరము సేవలొనర్చు శ్రీచంప కలాలు చిత్రకళలో నసామాన్యమైన ప్రజ్ఞను గడించిరి. ఇంకొక విశేషమేమన, తల్లిగారి యనుగ్రహమున నూతనశక్తి సామర్థ్యము లాశ్రమవాసులకు లభించు చున్నవి. శ్రీజనని వారినేదైనను కార్యనిర్వహణకు నియమించినంతనే, ఆ నిర్వ హణ బాధ్యతతో పాటు ఆ కార్యనిర్వహణకు వలయు శక్తిసామర్థ్యములను గూడ ప్రసాదించెదరు. ఇది అనుభవపూర్వకముగ తెలిసికొన్న విషయము. మొక్క పెరిగి పెద్దదై మహావృక్షమైనటుల శ్రీజననిచే నిర్వహింపబడిన ఆశ్రమము క్రమముగ నభివృద్ధి జెంది, దివ్య జ్ఞానమునకు నిలయమైనది.

# 11

## పుష్పాంజలి - పుష్పప్రదానము

పుష్పములు పరిమళ భరితమై వివిధరకములలో నుండును. కొన్ని పుష్ప ములు చిన్నవిగను, మరికొన్ని పెద్దవిగను, కొన్ని పుష్పములు కొలది రేకులతో

మరికొన్ని యధిక రేకులతో నొప్పారుచుండును. పారిజాతములు, మల్లెలు, గులాబీలు, సంపంగి, మనోరంజని, రాత్రిరాణి — ఇత్యాదులు సువాసన వెద జల్లును. సూర్యకాంతి, తామర పుష్పము–ఇత్యాదులు పెద్దవై చూచుటకు రమ్యాతి రమ్యముగ నుండును. అన్నిటి కంటెను పెద్దదైన తామరపుష్పమును అష్టదళ పద్మము, సహస్రదళ పద్మమని యందురు. కమలము లక్ష్మీదేవికి నివాసస్థానము. సృష్టికర్తయైన చతుర్ముఖు డుద్భవించినది పద్మమునందే!

పుష్ప, ఫలభరితమై యొప్పారు ఉద్యానవనములను గూర్చి సుప్రసిద్ధులైన కవులెందరో వర్ణించిరి. రఘువంశ కావ్యమునందు శ్రీకాళిదాస మహాకవి, దిలీపమహారాజు, సుదక్షిణాదేవియు వశిష్ఠాశ్రమమునకు వెడలునపుడు మార్గ మధ్యమున వారికగుపడిన రమణీయ దృశ్యముల నీవిధముగ వర్ణించినారు.

శ్లో॥ సరసీష్వరవిందానాం వీచి విక్షోభ శీతలం ।
ఆమోద ముపజిఘ్రన్తౌ స్వనిశ్వాసానుకారిణం॥

తా॥ వారు కొలనులయందు అలల విక్షోభమువలన చల్లనైన తామరల పరిమళము నాఘ్రాణించుచు తరలిపోయిరి.

శ్రీ రఘువంశ కావ్యమునందు శ్రీకాళిదాసమహాకవి తరువాత ఆశ్రమ ప్రాంతమునెట్లు పుష్పసౌరభములతోను, జంతు సముదాయములతోను ప్రశాంత ముగ నుండినది చిత్రించినారు. వశిష్ఠాశ్రమములో మునికన్యలు మొక్కలను పెంచు విధానమును గూర్చి యిట్లు వివరించినారు.

శ్లో॥ సేకాన్తే మునికన్యాభి స్తత్క్షణోజ్ఝిత వృక్షకం।
విస్రమ్భాయ విహఙ్గానా మాలవాలామ్బుపాయినాం॥

తా॥ మునికన్యలు ఆశ్రమములోని గున్నచెట్లకు నీళ్ళుపోసి పాదులలోని యా నీళ్ళను త్రాగునట్టి పక్షులు బెదరిపోక యుండుటకై, ఆ చెట్లను వదలి వెంటనే యావలకు వచ్చుచుండిరి.

దిలీపుని కుమారుడైన రఘు మహారాజు కౌత్సుడను మునీశ్వరుని యాశ్రమ

ప్రాంతములను గూర్చి యడిగిన విధానమును శ్రీకాళిదాస మహాకవి యిట్లు వర్ణించెను:—

సర్వధనము దక్షిణగా గలదైన విశ్వజిత్తనెడి యాగమును సమాప్తిజేసి రిక్తుడైయున్న రఘు మహారాజు కడకు, వరతంతు మహాముని వలన సమస్త విద్యాగ్రహణమును పూర్తిగావించు కొన్నవాడు, ఆతని శిష్యుడైన కౌత్సుడు గురుదక్షిణ యాచించుటకై వచ్చెను. మహాముని రాకతో పరమానంద భరితుడై రఘుమహారాజు కౌత్సక ముని నాసీనునిగావించి, శాస్త్రోక్త విధానమున బూజించి కరకమలములను జోడించి, ఈ రీతిని పలికెను.

శ్లో॥ ఆధార బన్ధప్రముఖైః ప్రయత్నైః
సంవర్ధితానాం సుత నిర్విశేషం
కచ్చిన్న వాయ్వాది రుపప్లవో వః
శ్రమచ్ఛిదా మాశ్రమ పాదపానాం?

తా॥ పాదులు చేయుట, నీరుపోయుట యిత్యాది ప్రయత్నములచే మీ బిడ్డలునుం బోలె మీరు పెంచినవై బడలికను బాపునటువంటి మీ యాశ్రమ వృక్షములకు నుపద్రవము లేమియు లేవు గదా?

దీనిని బట్టి జూడ ఆశ్రమములందు శిష్యగణములు వృక్షములను కన్న బిడ్డలవలె గాపాడుచుండిరని మనకు దెలియవచ్చుచున్నది. మానవులను ప్రశాంత చిత్తులను జేయుటకు పుష్పములు సహకరించుచున్నవి. భగవదారాధనకు పుష్పము లావశ్యకత యెంతేనియు గలదు.

శ్రీ అరవిందాశ్రమము నందు విశేషముగ ప్రజల నాకర్షింపచేయునది పూదోటలు. పూర్వపు ఋష్యాశ్రమములలో మునికన్యలు పూదోటలను పెంచినట్లు, యిచ్చట గూడ సాధకీ-సాధకులు పూలమొక్కలను పెంచుటయందు ప్రత్యేకమైన శ్రద్ధ దీసికొనెదరు. ఇచ్చట దాదాపు యేడువందల పుష్పజాతులు కాననగును. ఆశ్రమావరణమంతయు పుష్ప సౌరభముతో నిండియుండును. మాతృశ్రీ భవనము

వివిధ రకములైన పుష్పములతో నలంకరింప బడియుండును. పుష్పములన్న నామె కత్యంత ప్రీతి. ఆశ్రమవాసులు కొందరు ప్రాతఃకాలమున పుష్పములను సమకూర్చి శ్రీ మాతారవిందుల గదులలోను మహాసమాధిపైన భక్తితో నలంకరింతురు. పుష్పములన్న శ్రీజనని కత్యంత ప్రీతి గనుక ఆమెను పుష్పములచే నారాధింతురు. మాతృశ్రీని దర్శింపబోవువారలు వివిధ రకములైన పుష్పములను గైకొని, ఆమెకు పుష్పాంజలిని సమర్పింతురు. ఆ పుష్పాంజలిని స్వీకరించి మరల పుష్పములతోనే శ్రీజనని వారి నాశీర్వదింతురు.

దైవారాధనను గూర్చియు, మాతృశ్రీని సేవించు విధానమును గూర్చియు శ్రీఅరవిందులిట్లు చెప్పిరి: "భగవానుని పూజించుటకు, ప్రేమించుటకు. యాంత రిక విధానములేగాక భౌతిక రూపమున గూడ దర్శన, స్పర్శనల మూలమున దైవమును కొలువవచ్చును. చైత్యసత్తామూలమున భగవానుని చేరుటకు శరీర ముతో మ్రొక్కుట, చేతులతో పూజించుట ఇత్యాది భౌతిక విధానములు కూడ అత్యంతోపకారులగును. కాని, బాహ్యముగ భగవానుని గాని గురువునుగాని సేవించునపుడు నిర్మల మనస్సుతో నమస్కరింపవలయును. బాహ్యో పచారములు చేయునపుడు కల్మషమనస్సు, యెదిరింపు విడనాడవలయును." తరువాత మాతృశ్రీ నర్చించు విధానమును గూర్చి యిట్లు చెప్పిరి:—"మాతకు ప్రణమిల్లు టొక విధిపూర్వకముగాను, మామూలు దినచర్యలో నొక విధిగను పరిగణింప గూడదు. తల్లిగారికి ప్రణమిల్లు టామెకు కానుకగా సమర్పించునట్లు భావింప కూడదు. ఆమెకు నమస్కరించునపుడు, ఆమె యాశీర్వాదముల మూలమున ఆధ్యాత్మిక సహాయ సాన్నిధ్యములు వేడుచు వానిని ప్రసా దించి సాధకుడైన తన స్థితిని మార్పుదల చేయమని ప్రార్థింపవలయును. ఇందులకు నిశ్చల నిమగ్నవాతావరణము లుండవలయును."

సామాన్యముగ సాధువులనో, సన్న్యాసులనో, మనము దర్శించునెడ విభూతి, కుంకుమ, అక్షతలు మొదలగునవి మనకిచ్చి యాశీర్వదింతురు. కాని, మాతృశ్రీ మన పుష్పాంజలిని స్వీకరించి పుష్పప్రదానము జేసి యాశీర్వ

దింతురు. ఇదియే ఇచ్చటనుండు ప్రత్యేకత, ప్రాముఖ్యత. పుష్పముల గుణాధిక్యములను బట్టి వాని కనువైన నామములను శ్రీజనని యొసగినారు. మరువమునకు — క్రొత్తజన్మయనియు, తామరపుష్పమునకు — విజ్ఞానాభివ్యక్తి యనియు, తులసికి — భక్తియనియు, గులాబికి — ఆత్మసమర్పణమనియు, ఇంకా కని, విని యెఱుగని వివిధరకములైన పుష్పములకు వివిధనామముల నొసగినారు.

1926 వ సంవత్సరమున ప్రణామము, ధ్యానము మేడమీద గదియందు జరుగుచుండెడిది. తల్లిగారాసనముపై అలంకరించి నంతనే సాధకు లర్ధ చంద్రాకారమున ఆమె సాన్నిధ్యమున ఆసీనులగుచుండిరి. భక్త బృంద ములు ఆమెకు ప్రణతు లర్పించు చుండిరి. ప్రతియొకరిని యామె తమ వీక్షణములతోడనే ఆశీర్వదించు చుండిరి. ఆమెొద్ద వివిధ రకములైన పుష్ప ములచే నిండిన పళ్ళెమొకటి యుండెడిది. భక్తులామెకు పుష్పాంజలిని సమ ర్పించి నమస్కరించుచుండిరి. నమస్కరించి నంతనే శ్రీజనని వారి నాశీర్వ దించి పుష్పప్రదానము చేయుచుండిరి. నేటికిని ఈ పద్ధతి యమలులో నున్నది. విదేశీయులు గూడ శ్రీతల్లి దర్శనార్థ మరుదెంచి, యామెను దర్శించి ఆశీర్వ చనములను బడయుచున్నారు. మాత సందర్శన భాగ్యమే భాగ్యము! అది యనుభవైకవేద్యమేగాని మాటలలో జెప్పుటకు సాధ్యము కానేరదు. శ్రీజనని దర్శన మాత్రమున పతితలు గూడ పావనులగుదురు. మాతను దర్శించిన శుభఘడియ మరువరానిది. శ్రీమాత ప్రతివారికి జన్మదినములందు పుష్ప ప్రదానము చేసెదరు. ఈ ప్రత్యేకాశీర్వాదములను పొందుటకై పలువురు దూరదేశములనుండి వచ్చుచుందురు. శ్రీమాతానుగ్రహము నాకాంక్షించు భక్త జనులు తల్లిగారికి ఉత్తరములను వ్రాయుచుందురు. వారల కాశీర్వచనములతో గూడిన కవరును (కాగితపు సంచిని) కూడ పంపెదరు. ఆ కవరులో కొన్ని పుష్పదళము లుండును. యాశీర్వచన కవరును గూర్చి శ్రీజననీవిధముగ తెలియ జేసిరి. "ఆ కవరులో కొన్ని పుష్పదళములుండును. ఆ కవరు నీ వద్దనుండి నచో నాతో సన్నిహిత సంబంధ మేర్పడును. ఆ కాగితపుసంచిని విప్ప

జూచినచో నాతో సంబంధ మేర్పడుటయే గాక నీకు సరియైన ప్రత్యుత్తర మొసగబడును."

శ్రీమాత పుష్పములతో నాశీర్వదించుటకు పెక్కు కారణములు గలవు. పుష్పములు పరిమళమును వెదజల్లును మరియు దుఃఖముతోను, బాధలతో నుండిన వారలకు పుష్పములు సృష్టికర్త వరప్రసాదము, ఆశీర్వాదము. పుష్ప వికాసము చేతనే స్వర్గము తన గొప్పతనమును పృథ్విపై చాటుచున్నది. మనము పుష్పముల విలువను తెలిసికొన లేక పోవచ్చును. అట్లని సృష్టి కర్త పుష్పసౌరభమును అడవులయందును, ఉద్యానవనములందును వెదజల్లుట మానివేయడు గదా ! భగవాను డరణ్యములను, వనముల నొకేరీతిగా సౌందర్య వంతముగ నొనర్చును. దైవప్రేమ గూడ నటువంటిదే : మనము భగవానుని దయకు పాత్రులైనను గాక పోయినను భగవానుడు మనల నెప్పుడును దయార్ద్రదృష్టితో జూచుచునే యుండును. పుష్పముల ప్రాధాన్యతను గూర్చి తల్లిగారొకసారిట్లు చెప్పిరి. :- " నేను నా చైతన్యము నొక మానవునిలో కంటెను నతి సులభముగ నొక పుష్పమునం దిమడ్చగలను. ఏక స్వభావము గలవానిగా జేయు నత్యద్భుతమైన శక్తి పుష్పముల కెంతేనియు గలదు. నేను నా చైతన్యము నందలి ఒక యంశమును పుష్పము ద్వార యితరుల కొసగెదను. ఫలితము దానిని స్వీకరించువారిపై నాధారపడియున్నది."

శ్రీమాత పుష్పప్రదానము జేయును. ఆమె శక్తి పుష్పముల ద్వారా పనిచేయును. కాని, దాని పూర్ణ ఫలమును. బొందుటకు తల్లిగారియందు మనకు సంపూర్ణ విశ్వాస మెంతేనియు యవసరము సమర్పణ సంపూర్ణమైనచో ఫలమును గూడ శ్రీఘ్రముగ బొందగలము. పుష్పములను తల్లిగారి పాద పద్మములకు భక్తాదులు సమర్పింతురు. పుష్పములనే యాశీర్వదమును బడ యుదురు. భక్తితో సాధకులు పుష్పాంజలిని సమర్పించుట మరల ప్రేమానురాగము లతో దైవమునుండి పుష్పప్రదానము జేయబడుట పుష్పముల ద్వారా జరుగు చున్నది.

తల్లిగారు పుష్పములతో నాశీర్వదించుటనుగూర్చి శ్రీఅరవిందులను కొందఱివిధముగ ప్రశ్నించిరి-"ప్రణామమప్పుడు తల్లిగారు పుష్పముల నొసగెదరే, వాని ప్రాధాన్యత యేమి ?" అందులకు శ్రీఅరవిందులు 'పుష్పమేది సూచించునో దాని నుపలబ్ధి పొందుటకు వీలగు" ననిరి. పుష్పముల ప్రాధాన్యతను గూర్చి శ్రీవారి నింకొక ప్రశ్న యీవిధముగ సాధకు లడిగిరి:— "పుష్పములు కేవలము చిహ్నము లేనా ?— లేక నిశ్చలతను సూచించు పుష్పము ఏకాగ్రత నుపలబ్ధి నొందుట కుపకరించునా ?" అందులకు శ్రీవారు మరల యిట్లు వక్కాణించిరి :— "తల్లిగారు పుష్పమునందు తన శక్తి నిమిడ్చినప్పుడే ఆ పుష్పము కేవలము చిహ్నముగాక చిహ్నమున కతీతమగును. ఆ పుష్పమును భక్తితో స్వీకరించిన యేకాగ్రత తప్పక కలుగును. కనుక స్వీకరించువారిలో నున్నది."

పుష్పములు సువాసన వెదజల్లుటయే గాక భక్తి, జ్ఞాన, ప్రేమలను గూడ సాధకులకు ప్రసాదించును. పుష్ప సౌరభము బాహ్యేంద్రియములకు సౌఖ్య మొసగుటయేగాక మనస్సునకు, హృదయమునకు — కాంతియు, వెలుగును ప్రసాదించును. పుష్పములు సౌందర్య ప్రేమానందములకు నిలయములు. భగవత్సాక్షాత్కారమునకు పుష్పము లెంతయో నుపకరించును. సుమములచే నెవరైనను భక్తితో భగవానుని పూజించి తరించవచ్చును. కొన్ని పుష్పములు దేవలోకములో వాడబడకుండ నుండునని ప్రతీతి. మనము కూడ దేవతుల్యులమై, దివ్యభావములు కలిగి దివ్యకుసుమములవలె నుండుటకు ప్రయత్నించెదము గాక ! పుష్పమునందలి మకరందమును తుమ్మెద యాస్వాదించినట్లు శ్రీమాతారవిందుల పాదపద్మములలో భ్రమరములై, వారి కృపా కటాక్షములచే పుష్ప సౌరభమనెడి ఆధ్యాత్మిక వికాసమును నిరంతరము గ్రోలి తన్మయత్వము నొందెదము గాక !

# 12

## శ్రీ మాత దినచర్య

మానవుడు తన సహజ సత్తాంశ మందు సత్త్వరజస్తమోగుణములచే గూడుకొనిన ప్రకృతి కీటకముగ నున్నాడు. ఆ ప్రకృతి గుణములలో నేది

తనలో విజృంభించునో దాని కనుగుణముగ తన జీవిత ధర్మమును, తన కర్మాచరణ విధానమును నిర్మించుకొని యనువర్తించును. జయాపజయములకు — సుఖదుఃఖములకు — ఉత్సాహ నిరుత్సాహములకు మధ్య తారుమారగుచు ముందుకు సాగుచుండును. ఇట్టి కర్మాచరణ మెంత యుత్కృష్టత నొందినను అజ్ఞానమునకు బానిస యగుచున్నాడు. త్రికరణ శుద్ధిగ దైవమును సంపూర్తిగా శరణు బొందినచో, ఈ యజ్ఞానము దూరమై మానవుడు భగవంతునిలో లీనమై కార్యకలాపములు జరుపుచుండును. మానవత్వమున వృద్ధిజెందు కొలది దేవత్వమునకు సమీపించినట్లగును. జీవితమంతయు యోగమని (All life is yoga) చెప్పినటుల జీవితమంతయు దైవికమే ! జీవనమును నిరసించుట అంతర్వర్తియగు భగవానుని నిరసించినట్లగును. జీవన వికాసమునకు కార్యాచరణ అలంకారప్రాయమైనది, ఆభరణము వంటిది కనుక, ఈ సకలచరాచర సృష్టిజాలమంతయు ఏదో విధమైన కార్యాచరణలో నిరంతరము నిమగ్నమై యుండును. మానవులే కాదు జంతుజాలము, కర్మ చేయుచున్నవి; వృక్షసముదాయములు కర్మ చేయుచున్నవి; ఆకాశమున సూర్యచంద్రులు, నక్షత్రములు, మేఘములు, పంచభూతములు కర్మ చేయుచున్నవి. కర్మలలో సత్కర్మ — దుష్కర్మ, యని రెండు విధములు. సజ్జన జీవన విధానము సత్కర్మ యుక్తమై యుండును. దీనినే భాగవత దివ్య జీవన మందురు. దుర్జనజీవన విధాన మొదుదుడుకులతో పాపభూయిష్ఠమై, ఇతరుల శ్రేయస్సును భంగపరచునదిగా నుండును. మహాత్ములజీవన విధానము కమలముల స్పర్శవోలె, సర్వజనరంజకమై శాంతియుతముగనుండును. మహాత్ముల జీవితము లాదర్శప్రాయమైనవి; మార్గదర్శకమైనవి. వారి కార్యాచరణ జగత్కల్యాణమున కాటపట్టయినది.

శ్రీరామచరిత మానసమునందు శ్రీ గోస్వామి తులసీదాసు అవతార పురుషుడైన శ్రీరాముని దినచర్య నీ విధముగ వర్ణించెను :—

1. చౌపాఇ : ప్రాతకాల సరయూ కరి మజ్జన ।
బైఠహి సభా సంగ ద్విజ సజ్జన ॥
బేద పురాన బసిష్ట బఖానహి ।
సునహి రామ జద్యపి సబ జానహి ॥

2. అనుజ న్వా సంజుత భోజన కరహీ ।
దేఖి సకల జననీ సుఖ భరహీ ॥

అనగా శ్రీరామచంద్రుడు ప్రాతఃకాలమున సరయూనదిలో స్నాన మాచరించుచుండెను. కాలకృత్యములను దీర్చుకొన్న తరువాత సజ్జన, బ్రాహ్మణ సమావేశములందు పాల్గొనుచుండెను. వేద, పురాణములను వసిష్ఠ మహాముని చెప్పుచుండగా ఆ విషయములను శ్రద్ధతో నవగాహన జేసికొనుచుండెను. అనుజ సమేతుడై శ్రీరాముడు భోజనము జేయుచుండెను. శ్రీరాముని గాంచి మాత లెల్లరు ఆనందపరవశులగుచుండిరి.

శ్రీ వాల్మీకి మహర్షి, ఆదికావ్యమైన రామాయణమునందు రాజ-ధర్మమును గూర్చి ఈ విధముగ విశదీకరించెను :—

రాముని దోడ్కొని వచ్చుటకు భరతుడు అరణ్యమునకేగి రాముని సందర్శింపగా, నాతడు భరతుని కౌగిలించుకొని తొడపై గూర్చుండ జేసి సమాహితుడై యిట్లనెను :— "నాయనా ! నీ వడవికి వచ్చితివేల ? తండ్రికి శుశ్రూష చేయుచున్నావా ? బ్రహ్మవేత్తయైన, పరమధార్మికుడైన, కులగురువైన వసిష్ఠమహామునిని, మునుపటివలె పూజించుచున్నావా ? యుక్తకాలమున మేల్కొనుచున్నావు గదా ? విద్యావంతులను, శూరులను మంత్రులుగా జేసికొంటివా ? సైనికులకు వేతనములు జాగుసేయక యొసగుచున్నావా ?" ఇత్యాది ప్రశ్నలు శ్రీరాముడడుగుట చూడ రాజుల దినచర్య, రాజధర్మ మేవిధముగ నుండవలయునో విదితమగుచున్నది.

మహానుభావుల కార్యాచరణ లోక కల్యాణము చేకూర్చునది. కాన, మహాత్మురాలైన, మహాయోగీశ్వరియైన శ్రీమాత దినచర్యను గూర్చి తెలిసికొను టెంతేనియు అవసరము, శ్రేయోదాయకము. 1927వ సంవత్సరములో శ్రీమాత అరుణోదయమున నాల్గు ఘంటలకే మేల్కొని కాలకృత్యములను దీర్చుకొని ఆరు ఘంటలకే మేడమీది కేగుచుండిరి. మాతృశ్రీ ఆశీర్వచనముల నొసగుటకు సమయమైనదని సూచించుటకు సాధకుడైన అనిల్ భరణరాయ్ ఒక శంఖము నూదుచుండెను. సాధకులు గుమిగూడిన తరువాత ప్రణామము, ఆశీర్వచన కార్యక్రమము

మేడమీదనున్న ధ్యానమందిరమున నొక ఘంట_రెండు ఘంటల పర్యంతము జరిగెడిది. తరువాత ప్రత్యేకముగ సంభాషింపగోరు వ్యక్తులతో ఆమె మాటాడు చుండిరి. తదుపరి భోజనశాలకు వెళ్ళి స్వయముగా నెల్లరకును అరటిపండ్లతో గూడ ప్రసాదవినియోగము జేయుచుండిరి. మధ్యాహ్న సమయమున సాధకులను వారివారి ప్రత్యేక గదులలో నిర్ణీతకాలమునకు దర్శన మొసగెడివారు. సాధకుల గదులకు పుష్పముల పేర్లను పెట్టుట పరిపాటి సాధకుడైన చంపకలాల్ గది పేరు 'చైత్యాత్మక సిద్ధి', సాధకుడైన ద్యుమాన్ గదిపేరు 'ఆత్మార్పణ.' సంధ్యా సమయమున శ్రీమాత వాహ్యాళి కేగుచుండిరి మరలి వచ్చిన తరువాత శ్రీ అరవిందుల గదిని సందర్శించి, సాధకుడైన పవిత్రగదిలో నుంచి 'శ్రేయోమంది రము' నకు వచ్చుచుండిరి. శ్రేయోమందిరమునందు సాధకులతో గూడ ధ్యానము జేయుచుండిరి.

బోధనా విధానము :— ధ్యానానంతరము తాము రచించిన 'ప్రార్థనలు — ధ్యానములు' అనెడి పుస్తకము నుండి యమూల్యమైన కొన్ని శీర్షికలను ఎంచి భాషలో చదువుచుండిరి. తరువాత తల్లిగారు తమ మనోభావములను పుష్పముల ద్వార సమర్చి వాని యర్థమును వెల్లడి చేయుచు పుష్పములతో ఆటలాడుచుండిరి. నిర్ణీత_స్థిర కార్యక్రమమేదియు లేదు. ఈశ్వర ప్రేరణచే కార్యము లనుక్షణము జరుగుచుండినవి. శ్రీజనని బోధించిన మహత్తర విషయములను సాధకుడు వ్రాసికొనెడివాడు. ఆ బోధలే పుస్తక రూపకముగ వెలువడిన 'మాతృ వాక్కులు' (The Words of The Mother) శ్రీజనని సాన్నిధ్య మానంద దాయకము. ఆమె బోధనా విధానములో నొక ప్రత్యేకత గలదు.

ఒకపరి శ్రీమాత సాధకుడైన ద్యుమాన్‌ను కాగితము కత్తిరించు ఉప కరణము (Paper-cutter) నొక పుస్తకములోనికి గ్రుచ్చుమనెను. ద్యుమాన్ పుస్తకమును తెరచి చూడగా బుద్ధునకు సంబంధించిన విషయము మాపుటయందు గానవచ్చెను. అపుడామె 'అది నీకు గాదు మరల ప్రయత్నింపు' మనెను. మరల అతడట్లే ప్రయత్నించిన తదుపరి శ్రీమాత సాధకునకు వలయు శీర్షిక నిట్లు జదివిరి :— 'నీ వాంతరంగిక సమస్యనేదైన విశదపరుప దలతువేని దానిపై నేకా గ్రతను కలుగ జేసికొనుము. నీవు నిజస్థితిని దెలిసికొన దలతువేని, కొంత [illegible] గింతువేని నిరాడంబరముగ ముందుకు బోయి

వెలుగు నర్థించుము. అవ్యక్తమైన జ్ఞానమును దెలిసికొన నీకాకాంక్ష కలుగునేని, కొంతసేపు మౌనమూని యొక పుస్తకమును దెరువుము. నీవేకాగ్రత వహించి యుందువు గాన వాడియైన కాగితములు కత్తిరించు ఉపకరణము(Paper-cutter) పుస్తకములోని కాయుపకరణము నొక్కిన పుటయందలి శీర్షికలను జదువుము. అట్లు నీవు చదివినచో నీకు సుగమమే యగును.'

శ్రీమాతచే ప్రసాద వినియోగము 1927 వ సంవత్సరము నుండే ప్రారంభ మాయెను. సాధకుడైన చంపకలాలుని మేడమీది యావరణమున ప్రసాదపంపకము జరిగెడిది. తదుపరి ప్రసాద వినియోగము శ్రేయోమందిరమున జరుగుచుండెడిది; తరువాత 'దివ్యసంయోగ' మందిరమునకు మార్చబడెను. ప్రస్తుత మాగదియే స్వాగత మందిరముగా వాడబడుచున్నది. సాధకులెల్లరు గుమిగూడి శ్రీజనని రాకకై నిరీక్షించుచు వారివారి స్థానములం దాసీనులగుచుండిరి. శ్రీమాత వచ్చిన తోడనే ఆమెవద్ద పులుసుచే నింపబడిన పెద్దపాత్ర(హండా) యుంచబడుచుండెను. శ్రీమాత ధ్యాన పరవశయై దివ్యజ్ఞానమందులో యిముడ్చునేమో నన్నంత యేకాగ్రతతో హస్తముల నా పాత్ర క్రింద బెట్టుట జూడ, ఆమె ఆశీర్వదించుచున్నటు లుండెడిది. అటుపిమ్మట చంపకలాలు ఆ పాత్రకు మూతను దీయుచుండెను. సాధకులెల్లరు భక్తితో వరుసగా ప్రసాదమును స్వీకరించుచుండిరి. ఇట్లు శ్రీమాత ప్రసాదమును పంచునెడ మాట్లాడదలచు కొన్నవారు ఆమెతో ఇంచుకసేపు సంభాషించుచుండిరి. ఒక్కొక్క పర్యాయమామె ధ్యానగ్రస్తయై దివ్యానంద పరిపూర్ణయై సాధకుల కొసగు గిన్నెలను అర్థముగా నింపుచుండిరి. ప్రసాద వినియోగమును గూర్చి శ్రీఅరవిందు లిట్లు చెప్పిరి: 'సాధకుని భౌతికాభివృద్ధికి గాను, తల్లిగారి నుండి ప్రసాద స్వీకారము చేతనామార్పు కలుగుటకు సహాయపడును.'

1930వ సంవత్సరములో వారములో ఐదు దినములు మాత్రము ప్రాతః కాలమున ప్రణామముండెడిది. రాత్రి ప్రసాద పంపకము జరిగెడిది. ప్రణామము లేని రెండు దినములు శ్రీమాత ప్రసాదవినియోగ సమయముననే పుష్పప్రదానము చేయుచుండిరి; ఎల్లరను బాగుగా విచారించుచుండిరి. సాధకుల కెవరికైనను కష్టములు సంభవించిన యెడల శ్రీజనని కనుగొనుచుండిరి. ఒకసారి సాధకుడైన శైలేన్ వేర్పులననున్న కోతను గూర్చి తల్లిగారు విచారించిరి ఎవరైనను చినిగిన దుస్తులను వేసుకొనినచో ఆమె కనుగొని వారికి మంచి దుస్తుల నొసగెడిది.

1930_32 సంవత్సరముల మధ్యకాలమున సాధకు లరుణోదయముననే మేల్కొని శ్రీమాతను సందర్శించి నమస్కరించుచుండిరి. మేడమీదనున్న ఆవరణమున శ్రీమాత యొసగు దర్శనమునకై సాధక సాధకీ లెల్లరును బాటయందు వేచి యుండుట పరిపాటి యయ్యెను. శ్రీజననిని సందర్శించనిదే ఆహారము గైకొనకుండిరి. క్రమముగ భక్తుల సంఖ్య అతిశయించినది. ఈ విధముగ శ్రీజనని యొసగెడు దర్శనము (Balcony Darshan) ప్రారంభమాయెను. నిరంతరము పాటించుటవలన ఆచారములందైనను శ్రద్ధ సడలవచ్చును. కాని మేడమీద ఆవరణమున శ్రీజనని సందర్శనము (Balcony Darshan) మాత్రము నవీనత నొందినదై నూతన తేజో వికాసమును కలిగించునను టతిశయోక్తి కానేరదేమో! 1938వ సంవత్సరము తరువాత ఆశ్రమ కార్యక్రమములలో కొంత మార్పు కలిగినది. ప్రణామము నిలిపివేయబడినది. శ్రీమాత మేడమెట్లపై నిలుచుకొని ధ్యానము జేయుచుండిరి. సాధకులెల్లరు ఆమె సాన్నిధ్యమున ధ్యానము జేయుచు పురోగమించుచుండిరి. తరువాత ప్రాతః కాలమున ధ్యాన కార్యక్రమము కూడ నిలిపివేయబడెను. సాయంకాలమున ధ్యానము చేయుట ప్రారంభింపబడెను. శ్రీజనని క్రింద మేడపైనున్న ఆవరణమున దర్శన మొసగుచుండిరి. స్థలాభావముచే నెల్లరును నిలువబడవలసి వచ్చెడిది. కాన ఆమేడ క్రిందనున్న దాని నంటియున్న గదులన్నియు పడగొట్టబడెను; కూర్చుండుటకు సౌకర్యమొనర్చబడెను. ప్రస్తుతము నిర్ణీత స్థలము లేవియు లేవు. ఆశ్రమమున సమాధివద్దగాని, ధ్యానమందిరమునగాని యెచ్చటనైనను సాధకులు కూర్చొని ధ్యానము జేయవచ్చును.

శ్రీమాత సాధకులు సమర్పించెడి కానుకలను గైకొని వారి నాశీర్వదించుచుండిరి. భక్తుల సంఖ్య అధికమాయెను. మేడమెట్లపై శ్రీమాత యొసగు దర్శనము ఘంటల తరబడి అగుచుండెడిది. ఆమె మేడమెట్లపై అటులనే నిలుచుకొని యెల్లరి విన్నపములను వినుచుండెడివారు. సాధకుల సంఖ్య అధికమగుట వలన మేడమెట్లపై ఆమె దర్శన మొసగినను ఇంకా దర్శనము జేసుకొనదలచిన వారి సంఖ్య అధికమాయెను. వారికి గూడ దర్శన మొసగుటకై ప్రణామమైన తరువాత ఆమె మేడమీది ఆవరణమునకు వచ్చెడివారు. ఒక్క సాధిక మాత్ర మామెను వెంబడించుచుండెను. కొంతకాలమున కిదికూడ నిలిపివేయబడెను. శ్రీజనని దర్శన, స్పర్శ శక్త్యానందములే సాధకుల జీవనధనము. శ్రీమాతచే

నొసగబడిన పుష్పము 'దైవమునే సర్వదా శరణు బొందుము.' అన్న యర్థమును సూచించుచుండెను. సాధకుల జీవనప్రకాశ మామెయై, సాధకుల సత్త్వాంశములోని అజ్ఞానంధకారమును బాపి తేజోవంతము నొనర్చు దివ్యజ్యోతి యామెయని వారి విశ్వాసము, ఆకాంక్ష. దృఢ విశ్వాసముతో, ఆకాంక్షతో సాధనయందు పురోగమించుచు సాధకు లామె యంతులేని దయను సంపాదించుచుండిరి. సాయంకాల ధ్యాన కార్యక్రమము కొన్ని సంవత్సరములవరకు పాటింపబడెను. మేడమీది ఆవరణమున నిలుచుకొని యుండుటకు బదులుగా తల్లిగారు ప్రణామమందిరమునకు విచ్చేసెడివారు. ఒక్కొక్క పర్యాయమామె అర్ధరాత్రి కూడ వచ్చుట సంభవించెడిది. భక్తాదు లామె దర్శనమునకై వేచియుండెడివారు. ధ్యానమైన తరువాత శ్రీమాత పుష్పప్రదానము చేయుచుండిరి. పుష్పప్రదానము చేయునపుడు కొన్ని సమయములలో ఆమె నిరంతరము సమాధిస్థితిలో నుండెడివారు. జగన్మాత సమాధిలో నుండి సాధకుని శిరస్సుపై ఆమె కరకమలము నిడుచు ఆశీర్వదించునపు డాస్పర్శ కమలముల స్పర్శవోలె మృదువై, సాధకునిలో ఆధ్యాత్మిక వికాసము కలుగుచుండెడిది. రాత్రివేళలందే గాదు రాత్రింబగళ్ళు శ్రీజనని కార్యాచరణలో నిమగ్నమై సమాధిస్థితిలో నుండెడివారు. కాని భక్తులను గూడ పావనము చేయుటకై యామె మరల లోకస్థాయి కొచ్చెడివారు.

1926 నుండి 1938వ సంవత్సరము వఱకు ఆశ్రమ పద్ధతు లొకరీతిగా సాగినవి. 1950వ సంవత్సరము వరకు ఆశ్రమ పద్ధతులలో ఇంచుక మార్పు గలిగినది. 1950వ సంవత్సరమున శ్రీజనని అనుదినము దర్శన మొసగక వారములో నాల్గు దినములు మాత్రము దర్శన మొసగుచుండిరి. అదియు ఒక ఘంట లేక రెండు ఘంటల వ్యవధిలోనే దర్శన మొసగుచుండిరి. ఆ యమూల్యమైన అవకాశము లభించినపుడు సాధకులామెతో సంభాషించెడివారు. సాధకుల శిరస్సుపై ఆమె అమృతహస్తము నిడుచు పుష్పప్రదానము జేయుచుండిరి. 1950వ సంవత్సరమున మేడమెట్లపై నొసగు దర్శనము కూడ ఆపివేయబడెను. శ్రీమాత యన్న సాధకుల కమిత భక్తిప్రేమ లుండుటచే వారిలో కొందరు మేడ మీదకేగి ఆమెను దర్శించు కొనుచుండిరి. 1954వ సంవత్సరమున సాధకుల సంఖ్య ఎనిమిదివందలడెబ్బది యైదు. ప్రత్యేకదినములందు మాత్రము వేరుశెనగ పప్పు, మిఠాయిల నెల్లరకు పంచుచుండిరి. ఆటలమైదానములో సాయంకాల

సమయమున ప్రసాదవినియోగము చేయుచుండిరి. 1957వ సంవత్సరము వరకు ఆటల మైదానములో ప్రసాదవినియోగము సక్రమముగ జరుగుచుండెడిది. 1958వ సంవత్సరమున డిశంబరు 7వ తేదీన ఆటలమైదానములో ప్రసాద వినియోగ కార్యక్రమము గూడ నిలిపివేయ బడెను. దర్శనపు దినములలో మాత్రమామె ఆటలమైదానములో దర్శనమొసగుచుండిరి. ఒక సంవత్సరానంతర మది కూడ నిలిపివేయబడెను.

# 13

## శ్రీమాతను గూర్చిన శ్రీఅరవిందుల యుత్తరములు మరియు వాక్కులు

శ్రీజననిని గూర్చి సాధకులడిగిన ప్రశ్నలకు శ్రీవారిట్లు ప్రత్యుత్తరముల నొసగిరి :—

ప్రశ్న :— ప్రభూ! 'శ్రీమాత' (The Mother) యను గ్రంథరాజమున తమకు సూచించునది మాతనుగురించి యేనా?

ఉత్తరము :— ఔను ఈ మాతను గూర్చియే!

ప్రశ్న :— తనకు మనపైగల ప్రగాఢమైన ప్రేమచే గదా మన మధ్య— అంధకారములోనికి,యసత్యములోనికి, యీ యపరాధములోనికి, యీ మరణములోనికి శ్రీమాత అవతరణమొనర్చినది! ఒనరింప లేదా?

ఉత్తరము :— ఔను......ఒనరించినది.

ప్రశ్న :— శ్రీమాత యవతరించుటకు హేతువేమి?

ఉత్తరము:_శ్రీమాత యవతరించు టెందుకనగా, విజ్ఞానమయశక్తిని-అతీతమానస శక్తిని క్రింది భూమికలలోనికి గొనివచ్చుటకై ఆ యవతరణము—ఆ యవరోహణము మాత్రమే సంపూర్తియగు నొక అభివ్యక్తీకరణము నిట సుసాధ్యము నొనరించును.

శ్రీజనని సాన్నిధ్యమున సాధకుల కెన్నియో దివ్యానుభవములు కలిగెడివి. ఒక పర్యాయమొక సాధకుడు శ్రీఅరవిందులతో నిట్లనియె:—

ప్రశ్న:_ నేడు ప్రణామ మందిరమున ధ్యానముజేయుచుండగా మార్గమంతయు నీలివెలుగుచే నావరింపబడినట్లు గాంచితిని. అందులో స్వర్గము నుండి- భూలోకమున కొక చక్కని బాట కూడ యేర్పరచి యుండుట గాంచితిని. శ్రీజనని ఆమార్గముగుండా వచ్చుచుండిరి.శ్రీజనని దేహమంతయు శ్వేత, సువర్ణ, జ్యోతిర్మయమై యుండినది. ఆ వెలుగు దశదిశల ప్రసరించి నది, శ్రీజనని భూలోకమునకు దిగివచ్చినంతనే ఆమె శరీరమీభూలో కమున మిశ్రితమాయెను. అంత ధ్యానావస్థనుండి మేల్కాంటిని—ఈ యాంతరంగిక దృశ్యానుభవమేమి సూచించును?

ఉత్తరము:- ఉన్నత మనోభూమిక నుండి కలిగిన అంతర్దృశ్యమున పవిత్రతతో గూడిన జ్యోతి—సత్యములతో మాత జడములోని కవతరించుట సూచించును.

ప్రశ్న:- నిన్నటి రాత్రి నేను శయనించినంతనే, స్వప్నములో దివ్యమాత నాకు ప్రత్యక్షమాయెను. ఆమె నుండి వెలుగు నాలోనికి ప్రసరించి, నాలో పరివర్తనము కలుగ జేసినది. అంత మా ఇరువురి దేహములు సాధారణ భౌతిక దేహముల కన్న పొడవై నీడ రంగుతో రాళ్ళవలె నుండెను—ఈ స్వప్నము దేనిని సూచించును?

ఉత్తరము:- స్వప్నమున నీకు కలిగిన యనుభవము మంచిదే: భౌతికచేతన శ్రీమాతవైపు ఉన్మీలన మగు దీని యంతరార్థము. బహుశః నీవు చూచినది నిశ్చేతనా భౌతికము. నీడగా నగుపించిన దాని కర్థమదియే: రాయి జడమును సూచించును.

ప్రశ్న:- శ్రీమాత వివిధావస్థలలో వివిధరీతులుగ అగుపింతు రేల? శ్రేయో మందిరమున ఒకరీతిగను, దర్శన సమయమున ఇంకొక రీతిగను, వివిధ స్థలములలో వివిధ భంగులలో సాక్షాత్కరింతురేల?

ఉత్తరము;- ఆమెలో అనేక వ్యక్తిత్వము లున్నందువలన ఈ పలువిధ వ్యక్తి భావముల నభివ్యక్త మొనర్చుటకు ఆమె శరీరమార్ద్రిముగా నున్నందు వలన ఆమె యనేక రూపములలో సాక్షాత్కరించును.

1933 వ సంవత్సరమున శ్రీజననిని ఆవరించియుండు తేజస్సును గూర్చి శ్రీఅరవిందు లీవిధముగ జెప్పిరి:—

"జనులు తల్లిగారి చుట్టు చూచునది ఆమె తేజస్సును, ఆమెనుండి ప్రసరించు శక్తుల యొక్క ప్రకాశమును నగుచున్నవి. ప్రతియొకరి చుట్టు ఒక తేజస్సున్నది. పలువురిలో అది బలహీనముగ నున్నది కాని, శ్రీజనని చుట్టు ఆవరించియున్న తేజస్సు శక్తిమంతమైనది; ప్రపూర్ణజ్యోతి శక్తులతో నిండినదై యున్నది. సామాన్యముగ జనులు దీనిని గాంచలేరు; ఏలన అది స్థూల భౌతికముగా సూక్ష్మ భౌతిక దృశ్యముగా నున్నది. ఈ తేజస్సును గాంచవలయునన్న సూక్ష్మదృష్టి కావలయును. తేజస్సు ప్రబలమైనప్పుడది భౌతికములో దాగుకొనక స్థూలభౌతికము నందీ బహిర్ముఖమై ప్రకాశించును. తనలోని ఈ తేజస్సు నితరులకు ప్రదర్శింప వలయు నన్న అభిప్రాయమాయె కినుమంతయునులేదు.కాని ఆశ్రమములో ఇరువది మందియో లేక ముప్పదుగురో ఆమె చుట్టునున్న తేజస్సును దర్శించినారు. ఉన్నత పరాశక్తి ఒడముపై తన ప్రభావమును జూపుటకు మొదలిడెననుట కిదియే తార్కాణము."

శ్రీమాతను గురించి శ్రీఅరవిందులు మరియు నిట్లు వక్కాణించిరి:—

"శ్రీజనని చేతన దివ్యచేతన. ఆ దివ్యచేతన నుండి వచ్చు తేజము దివ్య సత్యము యొక్క తేజమే! ఎవరైతే మాతృశ్రీ తేజమును పొందుచు దాని నంగీక రించి, దానియందు వసించుచున్నారో వారలు సర్వావరణముల యందు-మనోమయ, ప్రాణమయ, అన్నమయములందు సత్యమును జూడగలరు. అట్టివారు దైవ విరుద్ధములైనవాని నెల్ల తృణీకరించగలరు. అసుర శక్తుల యొక్క అనృత జ్ఞానములే దైవవిరుద్ధములు. ఏదేది యజ్ఞాన జనితమై దివ్యసత్యము యొక్క తేజశ్శక్తుల నిరసించునో అదికూడా దైవవిరుద్ధమని భావించవలయును. శ్రీతల్లి

గారి తేజశ్శక్తుల నంగీకరించుట కిష్టపడని వెల్ల దైవవిరుద్ధములే. కనుక నేను సర్వదా శ్రీజనని తేజశ్శక్తులతో సంబంధముంచుకొనుమని చెప్పుచుంటిని. మీరి ట్లొనర్చినచో ఈ యజ్ఞానము నుండి దూరమై ఊర్ధ్వము నుండి అవరోహించు సత్యమును గ్రహించ గలుగుదురు.

శ్రీజనని తేజమని గాని, నా తేజమని గాని ఒక ప్రత్యేక భావముతో సంభాషించు తఱి, యొక గూఢ కార్యమును గూర్చి అతీతమానసము నుండి అవరోహించు కొన్ని తేజముల గూర్చి మాట్లాడుచుందుము. శ్రీతల్లిగారి తేజము ధవళమై పరిణామమునకు తగిన పవిత్రతయును మరియు ఆధ్యాత్మిక వికాసము నను్గ్రహించి పరిణామమునకు వలయు సత్యశక్తులసారము నవరోహింపజేయుచు నట్టి మార్పుదల నీ కార్యమునందు సాధ్య మొనర్చును. వాస్తవదృష్ట్యా ఊర్ధ్వము నుండి, దివ్యసత్యమునుండి అవరోహించు సర్వతేజము శ్రీతల్లిగారిదే। శ్రీజనని మార్గమునకు నా మార్గమునకు భేదమేమియు లేదు. అతీత మానసావరోహణ మునకు, దివ్యసాక్షాత్కారమునకు మా యిరువురిది ఒకే మార్గము. ఇంతకు ముందుకూడా మేమొకే మార్గము ననుసరించితిమి. ఒక లక్ష్యమందే గాక, ఆది నుండి మా యిరువురి మార్గమొక్కటే।

మాతృశ్రీకి సమర్పణజేయు విధానముకు గూర్చి శ్రీఅరవిందు లీవిధముగ నుడివిరి. "సర్వసంపదలు భగవానునివి. ఆ సంపద నందుబాటులో నుంచుకొన్న వారు ఆ సంపదలకు ధర్మకర్తలే కాని అధిపతులు మాత్రము కారు. సంపద నేడు వారియొద్ద నున్నది. రేపెచటనైన నుండవచ్చును. నీవు నీ కొఱకై ధనమును వినియోగ మొనర్చునపుడు, నీవద్దనున్నదానిని నీవు తెచ్చుకొన్న దానిని శ్రీ జననిదిగా భావించుము. నీకు దేని మీదగాని హక్కున్నదని భావించవలదు. శ్రీతల్లిగారు ప్రసాదించినది మాత్రము స్వీకరింపుము. మాతృశ్రీ దానిని నీకు ఏ కార్యమునకై ప్రసాదించిరో ఆ కార్యమునకే దానిని వినియోగించుము. స్వార్థ రహితుడవై న్యాయబుద్ధి గలిగియుండుము. నీవు వినియోగమొనర్చెడి ధనము తల్లిగారిదని సర్వదా జ్ఞప్తియందుంచుకొనుము. ఆమె కొఱకై నీచేతికి ఇవ్వబడిన ధనమును భక్తిపూర్వకముగ ఆమెకే యర్పింపుము. నీవు దివ్యమాతలో పూర్తిగా ఐక్యమై నీవొక ఉపకరణముగాని, సేవకుడవుగాని కావనియు నీవు నిజముగా ఆమె బిడ్డయనియు, ఆమె శక్తిచేతనలయొక్క అంశమని యనుకొన గలిగినప్పుడు పరిపూర్ణత యందలి కట్ట కడపటి దశ నీకు రాగలదు. నీవు దివ్యకర్మలయందు పరిపూర్ణుడవగుదువు."

* * *

"మాతృశ్రీయే నీగమ్యస్థానము. అన్నియు ఆమెలోనే యున్నవి. ఆమెను పొందియుండుట సర్వమును పొందియుండుటయే; ఆమె చైతన్యములో వసించుట అన్నిటియందు స్వతశ్చలన వికాసము నొందినట్లే."

*  *  *

"శ్రీజనని వైఖరి మారునటువంటిది కాదు. అది యెల్లప్పుడును ఒకే రీతిగ నుండును. సాధకుడామెను తన మానసిక దృక్పథములో దర్శించినపు డతనికి ఆమె వైఖరి మారినట్లగుపించును. అయితే ఇది వాస్తవము కానేరదు."

*  *  *

"మాతృప్రేమ నుండి యెవరు దూరమగుదురు: హృదయనిశ్చలత లేనివారలు, నమ్మికలేనివారలు, వారి ఊహాగానమే తల్లిగారి ఇచ్ఛకన్నా మిన్నయని భావించువారలు బహుశః జనని సాన్నిధ్యమును వీడవచ్చును. అయితే నమ్మిక, నిశ్చయము గల సత్యాన్వేషకుడు, మాతృప్రేమను నిరంతరము వాంఛించు ఆకాంక్షాపరుడు భయపడవలసిన నిమిత్తము లేదు. ఒకవేళ కొలది కష్టపరంపరలు వాని నావరించినా వానినుండి గట్టెక్కును, వాని స్వభావము దోషపూరితమైనను వానిని సరిదిద్దుకొనును, ఒకవేళ కుంటువడినచో మరల లేవగలిగి యేనాడో ఒకనాడా సాధనయొక్క గమ్యస్థానము చేరగలుగును."

*  *  *

"నిశ్చలనీరవతలో, శాంతి చేతనలలో నుండుము, మంచిస్థితి కలుగును. ఆత్మార్పణము జేయుటకు వ్యవధిపట్టును. సమర్పణజేసినను ఇంకను చేయవలసినదిగ మిగిలి యుండుట నీవు గమనించెదవు; ఎడతెగక చేయుకొలది సమర్పణ క్రమముగా సంపూర్ణమగును."

*  *  *

"ఎల్లప్పుడు శాంతియుతముగ నుండుము. శ్రీజనని ఉన్నతచేతన నీలో అవతరణ మొనర్చును —ఇది మాత్రమే నిన్ను బాహ్యచేతన నుండి మార్చగలుగునది."

*  *  *

# 14

## భారతావని—ప్రపంచ యుద్ధము

## తల్లిగారు సూచించిన భవిష్యత్తు

1939—1947 :—

రెండవ భీకర సంగ్రామ మారంభమాయెను. యుద్ధారంభమున శ్రీ అరవిందులు దానిని గురించి తెలిసికొనుట కియ్యకొనకుండిరి. ఆ ప్రపంచయుద్ధము కొంత తీవ్రరూపము దాల్చినంతనే శ్రీవారు ఆంగ్లేయులను రక్షించు నిమిత్తమై తమ యాధ్యాత్మిక శక్తులను వినియోగింప దలచిరి.

భారతదేశ స్వాతంత్ర్య సముపార్జన కోసము గాంధీమహాత్ముడు, శ్రీ లోకమాన్యతిలక్—ఇత్యాది మహానుభావులు కంకణము గట్టుకొనిరి. స్వాతంత్రోద్యమమున పలువురు దేశభక్తులు తను, మన, ధనములను భారతమాతకు సమర్పించుచుండిరి. ఆశ్రమవాసులలో కొందరు త్యాగశీలురు దేశమునకై వారి సర్వస్వమును త్యాగమొనర్చిరి. స్వాతంత్ర్య సమరమున పాల్గొనిరి. ఆంగ్ల పరిపాలననుండి భారతావనికి విముక్తి జేకూర్చుటయే యెల్లర ధ్యేయము. రాజకీయములలో జోక్యము లేనివారలు గూడ శ్రీఅరవిందు లాంగ్లేయులకు బాహాటముగా సహాయ మొనర్చుటను నిరసించిరి. కళాశాల విద్యార్థిగ నుండినపుడే ఆంగ్లేయుల నెవరు ధిక్కరించిరో, యెవరిని నెవిల్‌సన్ 1907 సంవత్సరమున "అపాయకరమైన భారతీయు"డని నిర్వచించెనో, ఆ యరవిందులు నేడాంగ్లదేశము నాశనము గావింపబడు పరిస్థితియందు, ఆంగ్లదేశమును హిట్లరు వశపఱుచుకొను పరిస్థితియందు తమ యాధ్యాత్మిక సంపద నాంగ్లవిజయమునకై ధారపోయు చున్నారే! పరికించి చూడ ఇదియొక నిగూఢ రహస్యముగ వింతగా నున్నదే యని యెల్లరు తలపోసిరి.

ఇట్టి సంక్షోభ, సందిగ్ధావస్థలలో మనలో విశ్వాసమును పెంపొందింప జేయుటకై 1941 వ సంవత్సరమున, మే మాసమున 6 వ తేదీన తల్లిగారీవిధముగ రచించిరి. "ఎవరైతే నాజీ విజయము నాకాంక్షించుచున్నారో యెవరి భావములు వారివైపు మరలియున్నవో వారలు దైవము నెదిరించి యసురులతో నేకీభవించుచు,

అసురులకు విజయమును జేకూర్చుటకు సహాయకారులగుచున్నారని ఇచ్చట స్పష్టముగా దెలుపు టావశ్యకమైనది." ఐనను భారతీయుల జాతీయ భావము లమితముగా పెంపొందినవి. ఆంగ్లేయులపై వైరభావములు ద్విగుణీకృతమై హిట్లరు విజయమే మన విజయముగా భావించుచుండిరి. ఆ వాతావరణమే యట్టిది; ఆంగ్లేయుల పట్ల యెవరైన సానుభూతిని కనబరచినచో, దయార్ద్రహృదయులైనచో అట్టివారలను దేశద్రోహులుగా పరిగణించుచుండిరి. శ్రీఅరవిందులు బహిరంగముగ భారతదేశ స్వాతంత్ర్య పోరాటమునకు ముందుకు రాకున్నను, తమ యాధ్యాత్మిక తపశ్శక్తి నిందులకై వినియోగించిరి. డన్‌కర్క్ వద్ద అపజయమును బొంది, హిట్లర్ విజయ భేరిని మ్రోగించినపుడు, శ్రీఅరవిందులు హిట్లరునకు పరాజయము కలుగుననియు, ఆంగ్లేయులకే విజయము చేకూరుననియు చెప్పి తాము గూడ యుద్ధనిధికై దువందల రూప్యములను విరాళముగా నొసగిరి.

డన్‌కర్క్ పతనాంతరము, ఫ్రాన్స్ హిట్లరునకు వశమైపోయెను. ఇంగ్లండునకు లొంగెడు పరిస్థితి యేర్పడెను. ఇట్టితఱి, ఆంగ్లదేశము—ఫ్రెంచి దేశము రెండును యేకీభవించిన బాగుండునని బ్రిటీషు రాజ్యాంగ ప్రధానమంత్రి చర్చిల్ నుడువగా, బ్రిటన్ గూడ పరాజయము పొందినట్లేయని జనరల్ వేగాండ్ ఉద్ఘాటించి, ఈ విషయములో పేటైన్‌ను గూడ ఒప్పించెను; బ్రిటన్‌తో యేకీభవించుట "శవముతో ఒకటయి పోవుటయే" యని నుడివెను. చర్చిల్ వేసిన పథకమును శ్రీఅరవిందు లామోదించిరి. ఫ్రాన్స్ ఆ ప్రతిపాదనను నిరాకరించుట భగవదనుగ్రహమునకు దూరమగుటయే యని శ్రీమాతారవిందులు భావించిరి. భారతదేశపు వైఖరి గూడ యిటువంటిదే; 1942 వ సంవత్సరమున, మార్చి 11 వ తేదీన భారతదేశ మైక్యతతో ఒక స్వతంత్ర సంస్థగా రూపొందగలదని చర్చిల్ వ్రాక్రుచ్చిరి. యుద్ధానంతరము భారతదేశమునకు స్వాతంత్ర్య మొసగెదమని తెలుపుచు నొక ప్రతిపాదనను గావించిరి. ఇందు నిమిత్తమై రాయబారిగా క్రిప్స్‌ను పంపిరి అట్టితఱి, శ్రీఅరవిందులు తప్పిదమును లెక్కచేయక ఆ ప్రతిపాదనను మన్నించవలసినదిగ నొక సందేశము నొసగిరి. అయితే మానవయుక్తి, రాబోవు కీడును గురించిన శంక దివ్యజ్ఞానమును గూడ నతిక్రమించిన దాయెను. ఆ క్రిప్స్ ప్రతిపాదన నిరాకరింపబడెను. "ఈ నివారణ ఫ్రెంచి దేశపు నిరాకరణవంటిదే; భారతీయులు గూడ దైవానుగ్రహమునకు దూరమైరి" అని శ్రీజనని నుడివిరి. భవిష్యత్తున భారతదేశమున కాపద కలుగుననియు భారతదేశ విభజన ఫలితముగా పాకిస్తాన్ వేరై అందుమూలముగ హింసాత్మక చర్యలు విజృంభించి, రక్తపాత

మతిశయమై ప్రజలు భరింపరాని కష్టముల ననుభవింపవలసి యుండునని త్రికాలజ్ఞులైన శ్రీమాత దివ్యదృష్టిచే దర్శించిరి. ఆనాడు క్రిప్స్ ప్రతిపాదనకు దేశనాయకు లంగీకరించి యుండినచో దేశవిభజన గాకుండెడిది. లక్షలాది శరణాగతులు పాకిస్థాన్ వదలి భారతదేశమునకు రావలసిన యవసర ముండెడిది కాదు.

ఫ్రాన్స్ ఓటమి నొందినను శ్రీమాతారవిందుల యాశయమునకు తిరుగు లేదు. అసురుడైన హిట్లరు మరణించెను. అరవిందమహాయోగి యాదేశానుసార మాంగ్లేయులు యుద్ధమునందు విజయమును బొందిరి. భారతీయులకు స్వాతంత్ర్యము వచ్చినది. స్వరాజ్యము శ్రీవారి జన్మదినమగు ఆగస్టు 15వ తేదీన వచ్చెను అది శ్రీవారి జన్మదినమగుటవలన ఎల్లరకు పర్వదినము.

## భారతావని భవిష్యత్తు

ఇదివరలో క్రిప్స్ ప్రతిపాదనను, దాని నిరాకరణను గూర్చి తెలిపితిని. ఆ ప్రతిపాదన వచ్చుటకు ముందు శ్రీజనని సాధకులకు భారతదేశపు భవిష్యత్తును గూర్చి నుడివిన యమృతవాణిని వివరింతును:—

ఒకనాడు క్రిప్స్ ప్రతిపాదనపై పవిత్రయను సాధకుని గదిలో వాద వివాదములు చెలరేగెను. తల్లిగారు స్నానమాచరించిన తరువాత ఆ గదివైపు వచ్చుట తటస్థించెను. ఆమె లోన ప్రవేశించి, వారి చర్చనీయాంశమును గూర్చి తమకు దెలుపుమనిరి. పవిత్రయను సాధకుడు 'క్రిప్స్ ప్రతిపాదన హిందూదేశ నాయకులచే అంగీకరింపబడదని యొకరు వాదించుచున్నారు.' అని సవినయముగ బల్కెను. అందుల కావిషయమును గూర్చి శ్రీజనని యిట్లు వక్కాణించిరి:

"దైవమే సర్వము సమకూర్చునన్న విశ్వాసముతో క్రిప్స్ ప్రతిపాదనను సంపూర్ణముగ దైవమునకే వదలివేయవలయును. ఆ ప్రతిపాదనలో లోపముండుట వాస్తవమే! మానవుని బుద్ధి మితిమైన పరిమాణముగలది గాన మానవునిచేత సృష్టింపబడిన దేదియు నిర్దోషము గానేరదు. ఈ ప్రతిపాదనతో పాటు దైవానుగ్రహము ప్రత్యక్షముగ నున్నది. సహాయమొనర్చుటకు సిద్ధమై దైవానుగ్రహము హిందూదేశపు ద్వారముకడ వేచియున్నది. ప్రపంచ జాతీయ చరిత్రలో యిటువంటవకాశములు తరచు కలుగ నేరవు ఆ జాతి యెన్నియో శతాబ్దములు ప్రయత్నము చేసిన తరువాత దైవానుగ్రహ మరుదుగా లభించును ఆ యనుగ్రహమును

స్వీకరించినచో జాతి కలకాలము వర్ధిల్లి దివ్య చేతనలో నొక నవజన్మ పొందిన దగును. దానిని త్రోసిపుచ్చినచో దైవానుగ్రహముపసంహరించి జాతి యిక్కట్టుల పాలై యాపదలకు లోనగును.

"కొన్ని మాసముల క్రితమిటువంటి దైవానుగ్రహమే ఫ్రెంచిదేశపు ద్వారముకడ ప్రత్యక్షముగ నుండినది. డన్కర్క్ పతనానంతరము ఫ్రెంచివారును ఆంగ్లేయులును ఉమ్మడిగా కలిసి శత్రువులను దునుమాడెదరని తెలిపిన చర్చిల్ ప్రతిపాదనలో, దైవానుగ్రహము స్పష్టముగ నుండినది. ఆ యుద్దేశ్యము మంచి దనియు, అట్లు చేసినచో తమ కార్యమున కమితముగా సహాయపడునని శ్రీఅరవిందులు వక్కాణించిరి. అయితే ఫ్రెంచిదేశము సామాన్యమానవస్థితి కతీతముగ పోజాలక దానిని త్రోసిపుచ్చెను. అందువలన దైవానుగ్రహము వీడెను. ఫ్రెంచి దేశపు నిజాత్మ క్రుంగిపోయెను. మరల ఫ్రెంచి దేశపు ఔన్నత్య మెప్పుడు పునరుద్భవమగునో తెలియుటలేదు.

"యుగములనుండి యత్యంతాధ్యాత్మిక ఘనతగల భారతదేశము ఈ ప్రతిపాదన వెనుకనున్న దైవానుగ్రహమును గ్రహించవలయును. అది సాధారణ మానవ ప్రతిపాదన గాదు. అందులో కొంత లోపములున్నను స్వతహాగా వచ్చిన భగవదనుగ్రహమును భారతదేశము తిరస్కరించుట సమంజసము గాదు. దైవము నందు విశ్వాసము గలిగియుందుము. అంతయు ఆయనకే విడచిపెట్టుము, అంతయు ఆయనే సమకూర్చును."

"హిందూదేశము దానిని నిరాకరించకుందుగాకయని మనఃపూర్వకముగ నేను కోరుచున్నాను. ప్రస్తుతము ఫ్రెంచిదేశము తప్పిదమునుజేసి యగాధము లోనికి బోయెను. కాన, హిందూదేశమా తప్పిదమును మరల జేయకుండుగాక!"

ఇట్లు తల్లిగారు మృదుమధురముగ హిందూదేశపు భవితవ్యమును గూర్చి తెలియజేసి వెడలిపోయిరి. మరుసటి రోజున క్రిప్స్ ప్రతిపాదన నిరాకరింప బడెనని తెలిసెను. శ్రీజనని యేమాత్రమును చలింపక 'హిందూదేశ మాపదల పాలగు'నని మాత్రము నుడివిరి.

భారతావని భవిష్యత్తును గూర్చి మాతృశ్రీ యిట్లు స్పష్టముగ విశదీకరించిరి;

"భారతదేశపు భవిష్యత్తు చాల స్పష్టముగనున్నది. భారతావని ప్రపంచ

మునకు గురువై భాసిల్లును. భారతావని జీవాత్మయై ఆధ్యాత్మిక విజ్ఞానమును ప్రవహింపచేయును. భారతప్రభుత్వము, భావి, భారతదృష్ట్యా ప్రణాళికలు, కార్యక్రమములు నిర్ణయించు టవసరము"

మాతృశ్రీ మొదటి చైనా యుద్ధము—ప్రథమ ప్రపంచ సంగ్రామము—ద్వితీయ ప్రపంచసంగ్రామము—కొరియా యుద్ధము—భారతదేశ స్వాతంత్ర్యము—ఇవన్నియు సంభవించుటకు చాలకాలము క్రిందటనే దర్శించి శ్రీఅరవిందులకు తెలిపిరి. 1927 వ సంవత్సరమున భారతదేశ స్వాతంత్ర్య ప్రాప్తిని గురించి యొక సాధకునికి తెలియజేసిరి.

1927 వ సంవత్సరములో తల్లిగారు సాధకులను వారి ప్రత్యేక గదులలో గాంచుచుండిరి. ఆమె అటుల వారి గదుల కేగినతటి ఒకానొక సాధకుడు 'హిందూదేశమునకు స్వాతంత్ర్యమెట్లు కలుగు?' ననెను. అంత శ్రీమాత 'ఆంగ్లేయులు భారతదేశమును జయించలేదు. మీరే భారతావని నాంగ్లేయుల కర్పించితిరి. ఆ విధముగనే వారు కూడ తమకుతామే యుద్ధము లేకయే భారతదేశమును మీ కొసగుదురు. ఒక నావ వారికొరకై వేచియున్నచో ఎంత త్వరపడెదరో అంత శీఘ్రముగ వారు దానిని నిర్వర్తించెదరు' అంత సాధకుడదెప్పుడు జరుగునని ప్రశ్నింపగా తల్లిగారు "జపాను యుద్ధనౌక హిందూమహాసముద్రమున కొచ్చినప్పుడు హిందూదేశమునకు స్వాతంత్ర్యము రాగల" దనిరి. 1927 వ సంవత్సరమున మాతృశ్రీ సూచించిన భవిష్యత్తు 1947 వ సంవత్సరమున యదార్థమాయెను.

పాకిస్థాన్ పతనమెట్లు సంభవించునని ఒకరు ప్రశ్నింపగా అది అంతఃకల్లోలమువలన గలుగవచ్చుననిరి. హిందూదేశమును క్లిష్ట పరిస్థితులనుండి రక్షించుట కేవిధానము ననుసరించవలయును? అని ప్రశ్నింపగా శ్రీమాత 'దైవశక్తి యందు మీకు నమ్మకమున్న యెడల ఆ దైవశక్తియే సహకరించు' ననిరి. 1971 వ సంవత్సరమున భారత—పాకిస్థాన్ యుద్ధమునకు మునుపు ప్రధాని ఇందిరాగాంధీ గారు శ్రీజనని దర్శనార్థ మాశ్రమమునకు విచ్చేయగా బంగ్లాదేశమును గుర్తించి వెంటనే యుద్ధమును ప్రకటింపుమని తల్లిగారామెతో చెప్పి యామె నాశీర్వదించిరి. మాతృశ్రీ ఆశీస్సులతో మనకు విజయము చేకూరినది. శ్రీజనని ఏకాంతవాసము చేయుచు ఆమె దివ్యశక్తి నంతటిని ప్రపంచ కల్యాణముల కొఱకై వినియోగించిరి.

# 15

## శ్రీ అరవిందుల నిర్యాణము

### శ్రీఅరవిందుల నిర్యాణాంతర మాతృశ్రీ సందేశములు

శ్రీఅరవిందులు సూక్ష్మలోకమునుండి మనకు సహాయ మొనరించుటకై తమ దేహమును త్యజించ నిశ్చయించిరి. అందులకే వ్యాధి సంభవించినను నివారణ గావించుటకు శ్రీవారు తమ శక్తిని వినియోగించరైరి. వైద్యులెంత చికిత్స చేసినను నివారణకు బదులు వ్యాధి యధికముగాజొచ్చెను. తుదకు ప్రాణవాయువు నెక్కించవలసిన పరిస్థితి కూడ ఏర్పడెను. 1950 వ సంవత్సరము డిశంబరు 4 వ తేదీన వ్యాధి తీవ్రరూపము దాల్చెను. తల్లిగారు శ్రీఅరవిందుల సాన్నిధ్యమున నుండిరి. చంపకలాలుగారు, పురాణిగారు తదితరులక్కడనే యుండిరి ప్రతిదిన మర్ధరాత్రి సమయమున రెండు ఘంటలు మాత్రము తల్లిగారు విశ్రాంతి గైకొను చుండిరి. ఒకనాడు రాత్రిసమయమున శ్రీఅరవిందులు హఠాత్తుగా మేల్కొని సమయ మెంతయని నిరోద్ అను సాధకునడిగిరి. అంత వైద్యుడైన సాన్యాల్ "తల్లిగారిని పిలచిన బాగుండు" ననెను. ధ్యుమాన్ తల్లిగారిని బిలువగా తల్లిగారు విచ్చేసి శ్రీఅరవిందులు శయనించిన పాన్పు కావల నిలుచుకొనిరి. శ్రీఅరవిందులు మేల్కొని సేవించుట కేదైన పానీయము నొసగుమనిరి, కాని శ్వాసలేనందున క్రిందికొరిగిపోయిరి. రాత్రి 1-26 ఘంటల సమయమున శ్వాస ఆగిపోయినది. అంతయు ప్రశాంతముగ నుండినది. శ్రీజనని చలింపక మనస్థైర్యముతో శాంతి యుతముగ నుండిరి. శ్రీవారి యుత్క్రమణమునకు చంపకలాలు సాగువగా తల్లిగారు వారి నోదార్చిరి.

క్రమముగా యీ వార్త యాశ్రమమంతయు వ్యాపించినది అంతిమ దర్శనమునకు ప్రతియొకరు విచ్చేసిరి. సేనావృక్షముక్రింద శ్రీవారి సమాధిని

నిర్మించవలసినదిగ శ్రీజనని నుడివిరి. శ్రీఅరవిందులు దేహత్యాగ మొనర్చినను తేజస్సుమాత్రము వారిని వీడలేదు. ఆ శరీరము దివ్యతేజస్సుతో నలరారు చుండినది.

"శ్రీఅరవిందు లతీత మానస చేతనలో నివసించుటవలన ఆది ఆయనయం దవరోహించి హిరణ్మయ తేజస్సుతో వెలుగుచున్న" దని శ్రీజనని నుడివిరి.

అవతార పురుషుడైన శ్రీఅరవిందులు నలువది సంవత్సరములు పుదుచ్చేరిని తపోవనముగ చేసికొని, నిరంతర యోగసాధనచే దివ్యజీవనమును గడపి 1950 వ సంవత్సరమున, డిశంబరు 5 వ తేదీన తమ భౌతిక దేహమును విడనాడి నిర్యాణ మును బొందిరి. శ్రీవారి నిర్యాణాంతరము వారి భౌతిక దేహము నాల్గు దినముల వరకు విజ్ఞానమయ జ్యోతితో ప్రకాశించుచు శరీరము సచేతనముగ నుండెను. భక్తులు, సాధకులు వేలకొలది పుదుచ్చేరికి వచ్చి శ్రీవారిని కడపటిసారి దర్శించి ప్రణమిల్లిరి. శ్రీవారి భౌతిక దేహమున కంత్యక్రియలు జరుపబడి భూ స్థాపితము గావింపబడి సమాధి కట్టబడినది. ఈ భరింపరాని దుఃఖ సమయమునందు డిశంబరు 7 వ తేదీన మాతృశ్రీ ఈ క్రిందవివరించిన ఓదార్పు మాటలను జెప్పు కొని సమాధానపడిరి.

"ప్రభూ! తమ కార్యము సమాప్తియగువరకు మా వద్దనే యుందురని ఈ యుదయము వాగ్దానము చేసియుంటిరి. నావద్ద సూక్ష్మ చేతనారూపముననే గాక స్థూలముగ గూడ నుందురని వాగ్దానము చేసియుంటిరి. దివ్యపరిణామము జరుగువఱకు పృథ్వీ వాతావరణము విడనాడక తమరు సమగ్రముముగా నుండునటుల వాగ్దత్తమొనరించితిరి.

మీ సాన్నిధ్య కృపకు పాత్రులగుటకును, మాలోని సర్వము తమ కార్యము సఫలము చేయుటకు కేంద్రీకరించుటకును అర్హులుగ నుండుటకు తమ యనుగ్రహమునకై ప్రార్థించుచున్నాను."

శ్రీఅరవిందయోగి యుత్క్రమణమునకు ఆశ్రమవాసులు, తదితరులు విచారపడగా డిశంబరు 14వ తేదీన మాతృశ్రీ వారి కీవిధముగ జెప్పిరి.

"శ్రీఅరవిందులు భౌతిక దేహమును వదలియున్నారు. కాని, వారి కార్యము సదా సర్వదా నిర్వహింపబడుచునే యుండును. వారు సజీవులుగా నున్నారు. వారు గతించినారని దుఃఖించుట వారి నవమానము చేసినట్లగును. శ్రీవారు తమ శరీరమును పరిత్యజించుటకు కారణము తమ కార్యమును బాగుగా సిద్ధింపజేయుటకే! వారుద్దేశించిన పనిని మానవులు పృథ్వియందు నెరవేర్చెదరు. వారు భూమండలమునకు గొనివచ్చిన దివ్యచేతన అన్నిటను నడపించును.

1951 వ సంవత్సరమున, జనవరి 18 వ తేదీన తల్లిగా రీవిధముగ సందేశము నొసగిరి :—

"మనలో దివ్యపరివర్తనము కలుగచేయుటకై తమ శరీరము సహితము త్యాగము చేసిన శ్రీవారి సాన్నిధ్యముననే మనమున్నాము. ఆయన మనతో నివసించుచు, మనో, వాక్కాయ, కర్మలతో మనము గావించెడి పనులను, భావనలను గమనించు చున్నారు"

మరియొక సందేశము నీవిధముగ నొసగిరి.

"ఆయనకు కృతజ్ఞత చూపడమనగా ఆయన యాశయములను పాటించి వానిని క్రమబద్ధముగా నాచరణలో పెట్టి పరిపూర్ణత నొందుటయే!"

*　　　*　　　*

శ్రీఅరవిందులను గూర్చి ఒకపరి శ్రీమాత యిట్లు నిర్వచించిరి:—

భౌతికముగ శ్రీవారి జన్మ జగత్తునందు శాశ్వతమై ప్రాముఖ్యమైన ఫలితములను కలిగియుండునదగును.

*　　　*　　　*

మానసికముగ, వారి జన్మ చరితార్థమై శాశ్వతముగ స్మరింపబడును.

*　　　*　　　*

చైత్యకముగ, వారిజన్మ భువిపై యుగయుగమునను సంభవమగుచుండును.

*　　　*　　　*

ఆధ్యాత్మికముగ వారిజన్మ ధరాతలమున దివ్యశాశ్వతత్వమునే సూచించునదగును.

# 16

## అతీత మానసావతరణము

క్రమేణ తూర్పు దిశయందు వెలుగు ఘనతరమగును,
క్రమేణ దైవమార్గమునందు ప్రపంచ మభివృద్ధి గాంచును.
భగవదామోద ముద్ర నా కార్యముపై ముద్రింపబడినదిగాన.
అది విఫలము కాజాలదు.

విశ్వాత్మను దైవము కలియు నెడ,
నేను స్వర్గద్వారపు రజితపుటూయెల నూగిత శబ్దముల నాలకింతును.

అని శ్రీఅరవిందులు వారు రచించిన 'సావిత్రి' అను గ్రంథరాజమున **అతీత**మానసావతరణమును గురించి నిర్వచించిరి. శ్రీఅరవిందులు యోగద్రష్టలు; ఋషిపుంగవులు; వారు యోగదృష్టివలన రాబోవు భవిష్యత్తును స్పష్టముగా వ్రాసి యున్నారు. వారు సత్యమును గమనించి, ఒక నూతన తేజస్సీ భువిపై నవతరించు చున్నదనియు, ఒక నూతనప్రపంచము సృష్టింప బడుచున్నదనియు, ఒక నవీనజాతి యుద్భవమగు చున్నదని విశదీకరించిరి.

అతీతమానసావతరణమును గూర్చి శ్రీవారీవిధముగ నుడివిరి.

"సాధ్యతయందేగాక సంభావ్యతయందు నాకు నమ్మకము గలదేని, అతీత మానసావతరణము తథ్యమని నేను భావింతునేని, అది కేవలము గాలియూహల వంటి నమ్మకముగాదు. అందలి నా విశ్వాసమునకు నా కాధారములు కలవు. అతీత మానసావతరణము తథ్యమని నాకు విదితమే! ఆ సమయమిప్పుడే యనియు తరువాత యుగమున కాదని నే ననుభవ పూర్వకముగ నుడువుచుంటిని.

భౌతిక భూమికయందు నేను రాత్రింపగళ్ళు ఏండ్లతరబడి శాస్త్రజ్ఞుడు పరిశోధనలను జేసినరీతి యోగమునందు పరిశోధన గావించుచున్నాను. అందువలన

నా చుట్టునున్న ప్రపంచమును గూర్చి నేనంతగా పట్టించుకొనలేదు. వెలుగి జడ ప్రపంచమునకు సమీపించుకొలది క్రోధాగ్నిని ద్విగుణీకృతము చేయు నసురశక్తుల తాకిడికి భయము చెందలేదు."

మహాత్ములు భవిష్యత్తును గూర్చి యూరక చెప్పరు; అందులో ఏదో ఒక సత్య ముండితీరవలయును. విశ్వమునందు కలుగు పరిణామములను యోగులు గుర్తింతురు కదా! అటులనే మహాయోగీశ్వరుడైన శ్రీఅరవిందుల దర్శించిన భవితవ్యము కొఱకే మహాయోగీశ్వరియైన శ్రీమాత కృషిచేయుచుండిరి. 1912వ సంవత్సరమున డిశంబరు నెలలో 11వ తేదీన శ్రీజనని దైవము నిట్లు ప్రార్థించిరి. "మీరు సూత్రధారులు; నేను కేవలము సాధనము మాత్రమే! ఈ సాధనము సంపూర్ణాభివ్యక్తికి సిద్ధమైనంతనే అభివ్యక్తము సహజముగ రూపొందగలదు."

దైవసామ్రాజ్యము భూమిపై స్థాపింపబడుట తథ్యమనియు అందులకు తామే ఎన్నుకొనబడిన మార్గదర్శకురా లగుదురనియు 1912వ సంవత్సరమునకు ముందే జననికి విదితము. 1913వ సంవత్సరమున, ఫిబ్రవరి నెలలో 10వ తేదీన ఆమె వహింపనున్న ప్రధానపాత్రను గురించి నిష్కపటముగా వైరాగ్యదృష్టితో, అమితానందముతో శ్రీజనని యిట్లు ప్రార్థించిరి:—

"నేను మీతో వందన పూర్వకముగా ఐక్యమైనపుడు ఈ బలహీనమైన అపరిశుద్ధమైన ఈ శరీరములో తమరు సాక్షాత్కారమగుదురని కాదు; అయితే తమరి స్వయంప్రకాశ మానందాతిశయము, శోభాయమానము, అత్యద్భుతము."

1913వ సంవత్సరమున, మార్చి 13వ తేదీన యిట్లు ప్రార్థించిరి;—"మిమ్ము సాక్షాత్కరింప చేయుటకే మీతో ఐక్యమగుట."

1913 వ సంవత్సరమున నవంబరు 29వ తేదీన ఆమె దైవము నిట్లు ప్రార్థించిరి:—

"మీ సాక్షాత్కార శుభఘడియ యాసన్నమైనదికాన సర్వదిశలనుండి ఆనంద గీతధ్వని యుత్పన్నమగును."

1914 వ సంవత్సరమున, ఫిబ్రవరి 8 వ తేదీన మాతృశ్రీ భగవానుని యిట్లు ప్రార్థించిరి:—

"మీతో సంపూర్ణముగా ఐక్యమగుటయేగాక, మనో, వాక్కాయ కర్మలతో నేను మీరు కావలయునని నేను వేడుకొనుచున్నాను."

మాతారవిందులు పృథ్విపై దైవశక్తి నవతరింపచేయుటకు కృషి సలిపినట్లు తెలియుచున్నది. అతీతమానసావతరణమును గూర్చి మాతృశ్రీ అవతారకారణమును గురించి సాధకులకు వ్రాసిన లేఖలలో స్పష్టముగా ఇట్లు విశదీకరించిరి.

"శ్రీజనని మూర్తిత్వము, పృథ్వీచేతన కతీతమానసము నవతరణ మొన ర్చుటకొక సదవకాశమనియు, అత్యవసరమైన ప్రథమ పరిణామము నమలు పరచుటకది సాధ్యత ఏర్పరచును."

"అతీత మానసము నవతరింప చేయుటకే శ్రీజనని అవతరించినది. ఆ యవతరణమే పూర్ణసాక్షాత్కారము నిట సాధించును"

1914వ సంవత్సరమున సెప్టెంబరు 25వ తేదీన శ్రీజనని ప్రార్థనా ప్రవాహ మిట్లుండెను.

"ఓ దివ్యమాతా! నీ సహకారమున కసాధ్యమైన దేదియులేదు కదా! సాక్షా త్కార సమయమేతెంచెను. ఆ పరమేశ్వరుని సంకల్పమును సంపూర్ణముగా సాధించుటకు సహాయకారిగా నుందునని వాగ్దాన మొనర్చితివి. ఊహాతీతమైన సత్యములకును, భౌతికప్రపంచమునకు నడుమ మమ్ములను తగుసంబంధకులుగ నుండుట కంగీకరించితివి. మాలో నీ నిరంతర సన్నిధానమే నీ తోడ్పాటుకు చిహ్నము కదా!

ప్రభువు సంకల్పించెను నీ విక నెరవేర్చుము.
నూతన తేజ మొకటి యీ భువి కరుదెంచును.
నూతన ప్రపంచ మొకటి యుద్భవిల్లును.
వాగ్దత్తములైన యీ సమస్తములును సంపూర్ణములే యగును.

ఇట్లు దివ్యదృష్టితో రాబోవు భవిష్యత్తును శ్రీజనని దర్శించిరి. పై ప్రార్థన

జరిగిన ముప్పదిరెండు సంవత్సరముల తరువాత నూతన ప్రపంచారంభమును గూర్చి శ్రీమాత యీ విధముగ ప్రకటించిరి:—

ప్రభో, నీవు సంకల్పించితివి; నే నెరవేర్తును
నూతన తేజమొకటి యీ భువి కేతెంచెను.
నూతన ప్రపంచ ముద్భవించెను.
వాగ్దత్తములైనవన్నియు ఫలించెను.

1956వ సంవత్సరమున జనవరిలో శ్రీఅరవిందులు (నిర్యాణానంతరము) మాత్రశ్రీకి దర్శన మొసగి యదృశ్యులైరి. వారి ఆశీర్వాద బలముతో 1956వ సంవత్సరము ఫిబ్రవరి 29వ తేదీన దైవశక్తి అతీతమానసరూపమున ఈ పృథ్వి పై నవతరించినది ఆ యవతరణమును గూర్చి శ్రీజనని యిట్లు వ్యాఖ్యానించిరి.

"ఈ సాయంకాల మీమధ్య స్థూలవాస్తవికాకారముతో భగవద్రూపము ప్రత్యక్షమాయెను. నేను విశ్వమునకన్న విశాలమైన సజీవ సువర్ణస్వరూపమును పొందితిని. ప్రపంచము దైవమునుండి వేరుపరచిన బ్రహ్మాండ స్థూల సువర్ణ కవాటమున కెదురుగ నేనుంటిని.

ఆ కవాటమును చూడగనే "సమయమేతెంచెను" అని ఒక క్షణిక సచేతనను ప్రగతియందే యెఱిగితిని, తెలిసికొంటిని, సంకల్పించితిని. నా రెండు చేతులతోను మహత్తరమైన ఒక బంగారు సమ్మెటను పైకెత్తి ఒకే యొక దెబ్బ ఆ కవాటముపై కొట్టితిని; ఆ కవాటము పగిలి ముక్కలు ముక్కలాయెను.

అపుడతీత మానసిక తేజశ్శక్తి చైతన్యము లవిచ్ఛిన్నధారగ క్రిందికి పరుగిడెను. ఆ దివ్యజ్యోతి ఇరువది నిముసముల పర్యంతము వ్యాపించినది. నేను ధ్యాన నిమగ్నురాలనై దాని నిరువది నిముసము లతి జాగ్రత్తతో గమనించితిని తదుపరి ధ్యానము నాపి వేసితిని. ఈ స్థితిలో నేను ధ్యానమునింకను కొనసాగింప జాలనైతిని. నేను బాహ్యవైయుక్తికాత్మలోనికి (బాహ్య ప్రపంచమునకు) మరలి వచ్చుటకు ప్రత్యేకప్రయత్న మొనర్పవలసి వచ్చెను. మరియు, చాల కష్టముతోనే నేనొక పదము నుచ్చరింప గలిగితిని.

ఈ అతీత మానసావతరణమును ఆశ్రమములో నిరువురువ్యక్తులను,

వెలుపల ముగ్గురు శిష్యులు మాత్రమే గుర్తించి యనుభవించిరి. వారేదో యొక యసాధారణానుభవమును పొందిరి."



శ్రీమాతారవిందుల కృషివల్లనే ఈ పృథ్వీపుణ్యవంతమైనది. వారు దైవశక్తి నవరోహింపచేసి పృథ్వియందలి శాంతి నెలకొల్పి దివ్యమానవుల సృష్టికి తగిన వాతావరణము నేర్పరచిరి. భూలోకమును స్వర్గతుల్య మొనరించుటకు ప్రయత్నించిరి. మాతారవిందుల యాశీస్సులతో నూతనప్రపంచము వర్ధిల్లి మానవులెల్లరు తేజోవికాసములతో నొప్పారుచు, మూర్తీభవించిన దివ్యత్వముతో దివ్యపురుషులై భాసిల్లెదరు గాక!



అతీతమానసమును గూర్చి 1972 వ సంవత్సరమున జనవరి మాసమున 1 వ తేదీన శ్రీజనని ఇట్లు నుడివిరి:—



"శ్రీఅరవిందు లీపృథ్వీతలమున కేతెంచినది కేవలము దాని నభివ్యక్తతను ప్రకటించుటకు గాదు; అతీతమానసశక్తిలో నొక భాగముగ మూర్తీభవించి దాని నభివ్యక్తము చేయుట కొకరెట్లు సంసిద్ధులు గావలయునన్నది యాదర్శప్రాయముగజూపిరి. ఆయన జెప్పినదంతయు మనము బాగుగా నభ్యసించి, ఆయన యాదర్శమును పాటించి నూతనాభివ్యక్తికి దోహదమిచ్చుటకు సంసిద్ధులు గావలయును. ఇట్లొనర్చినచో మనకడ్డంకులన్నియు తొలగిపోవును. జీవితమునకొక యర్థము కలుగును. నూతన సృష్టికొఱకై జీవించెదము గాక! యౌవనవంతులుగ నుండి బలవంతులగుచు, బలవంతులగుచు ప్రగతినొందుచు నూతనసృష్టికి గాను వసించెదము గాక!"

## 17

## మాతృశ్రీ వెలుతునీడలో ఆశ్రమాభ్యుదయము

శ్రీఅరవిందాశ్రమము శ్రీజనని అద్భుత ప్రత్యక్ష సృష్టి. ఈ యాశ్రమము దివ్యమానవపరిణామమునకు దోహదమొనర్చుచున్నది. ఇచ్చటనున్న

ప్రతిసాధకుడు సత్యాన్వేషకుడై దివ్యజీవనమును గడుపుచు దైవము నారాధించు వాడుగా నున్నాడు. శ్రీఅరవిందాశ్రమమున శ్రీఅరవిందుల సాన్నిధ్యమున 1922 వ సంవత్సరమున యెనిమిది మంది సాధకులు మాత్రమే వాసము చేయు చుండిరి. 1923 వ సంవత్సరమున పదునొకండు — పదునైదు సాధకుల వరకు పొడిగింపబడెను. అప్పటినుండి క్రమేణ సాధకుల సంఖ్య అధికమాయెను. 1926 వ సంవత్సరమున ఇరువది ఐదు సాధకులైరి. 1927వ సంవత్సరాంత్యమున ముప్పది ఆరుమంది సాధకులైరి. 1928 వ సంవత్సరమున సాధకుల సంఖ్య యెనుబది. 1942 వ సంవత్సరమున సాధకులసంఖ్య మూడువందల యేబది. 1952 వ సంవత్సరమున సాధకుల సంఖ్య యెనిమిది వందలు. 1962 వ సంవత్సరమున సాధకుల సంఖ్య ఒకవేయి రెండువందలు. 1964వ సంవత్సరమున సాధకుల సంఖ్య దాదాపు ఒకవేయి మూడువందలు లేక వేయి నాల్గువందలవరకు వ్యాపింపబడినది. ఇప్పుడు రెండువేలమంది సాధకులు కలరు. అప్పుడప్పుడు దర్శనమునకు వచ్చు సాధకులు కూడ కొంత కాలముండుట పరిపాటియైనది.

సాధకు లధికమైనకొలది యనుదిన జీవనోపాధికి వలయు వస్తుసామాగ్రి అత్యవసరమాయెను. అప్పుడు గృహోపకరణ శాఖ (Furniture Service), పరిశుభ్రపరచుశాఖ (Washing Service), విద్యుచ్ఛక్తిప్రసారశాఖ (Electric Service) ఇత్యాది శాఖ లేర్పాటు గావింపబడినవి. అంతియేగాక, కుట్టుపని (Tailoring), కేంద్రనిలయము (Bureau Central), ముద్రణాలయము (Printing Press), గ్రంథాలయము (Library) — ఇత్యాదిశాఖ లనేకములు కలవు ఈ శాఖలన్నియు ప్రయోజనాత్మకమై, ఆధ్యాత్మిక దృక్పథములో కర్మ యోగమునకు నిలయమై, సాధకులకు జీవనాధారమై యున్నవి. ఈ శాఖలు శిక్షణా కేంద్రములై కర్మసాధనలో భాగమని నిరూపించుచున్నవి. కర్మయోగమునుగూర్చి ఒకపరి శ్రీజనని ఇట్లు నిర్వచించిరి. "కర్మలలో ఆకాంక్షాపరులై పరిపూర్ణత్వ మును సిద్ధింప చేసికొనుటయే వాస్తవికమైన ఆధ్యాత్మికత."

ప్రశాంత వాతావరణములో యోగాభ్యాసమును చేసికొనుటకుగాను సాధకులకు ప్రతియొక్కరికి ఒక ప్రత్యేకగది అత్యావశ్యకమాయెను. అట్టికటి

నిర్మాణశాఖ (Building Service), ఏర్పడెను. ప్రథమమున గుజరాతీ దేశస్థుడైన యంత్రకారుడైన చందూలాల్, నిర్మాణ శాఖాధిపత్యమును స్వీకరించెను. ఆతనికి శ్రీజనని యొసగు సలహాలకై వేచియుండుట పరిపాటియయ్యెను. తల్లిగారి అనుమతి లేనిదే నిర్మాణకార్యక్రమమును కొనసాగించెతివాడు కాడు. నిర్మాణ శాఖానిర్వహణ ఆయన వల్లనే కొనసాగినది.

1932 వ సంవత్సరమున ప్రతియొక శాఖకు సంబంధించిన సమాచారములు తల్లిగారికి తెలుపబడుచుండినవి. అనుదిన మొనర్చవలసిన కార్యక్రమములను గురించి శ్రీజనని వ్రాతమూలకముగ సలహాల నొసగుచుండిరి. శ్రీజనని వెలుగు నీడలోనే ఆశ్రమ కార్యకలాపములు కొనసాగుచుండెడివి. 1952—53 సంవత్సరములలో నిర్మాణశాఖ ఆశ్రమశాఖ లన్నిటికంటెను పెద్దదైనది. అన్ని కట్టడముల కంటె గోల్కొండ కడు రమ్యమైనది.

ఒక పర్యాయ మాశ్రమ నిర్వహణను గూర్చి మాతృశ్రీ ఇట్లనిరి:—

"మొదట నే నన్నిటకు నియమములను లేక నిబంధనలను విధించుచుంటిని. నా యెఱుకలేనిదే యే పనియు నిర్వర్తింపబడెడిది కాదు. తరువాత నేనింకొక విధానము ననుసరించితిని. నే నన్నిటకు దూరమై ప్రతి ఒక సాధకునికి ఆ యా రంగమున వలయు దివ్య ప్రేరణము గలిగించుచుంటిని."

సాధకులకు, తదితరులకు సరసమైన ధరలకు ధాన్యమును, వస్తువుల నందజేయుటకు సామాగ్రికొట్టు (Honesty Society) నెలకొల్పబడెను. ఆఫ్రికాదేశమునుండి భారతీయ పారిశ్రామికవేత్త సకుటుంబ సమేతముగ శ్రీజనని సాన్నిధ్యమున చేరెను. ఒకనాడు తల్లిగారి సందర్శనార్థము వెళ్ళి హిందూ దేశములో కొన్ని పరిశ్రమలు నెలకొల్పు ఉద్దేశ్యము తన కెంతేనియు గలదని తల్లిగారితో విన్నవించుకొనెను. తల్లిగారు ఒక చక్కెర ఫ్యాక్టరీని నెలకొల్పవలసినదిగ అనుజ్ఞ నొసగిరి. పుదుచ్చేరిని గూర్చిగాని, దాని యార్థిక పరిస్థితులను గురించి తన కేమియు తెలియదని ఆతడు విన్నవించుకొనగా మాతృశ్రీ దరహాసవదనయై "ముందుకు పురోగమింపుము, అంతయు సుగమమే" యగుననిరి.

"భగవత్స్పర్శచే సర్వము సమకూడు" నని శ్రీఅరవిందులు "సావిత్రి" యను గ్రంథరాజమున రచించిరి. ఆ దివ్యవాక్కు ననుసరించి, ఆ ఫ్యాక్టరీ స్థాపింపబడి క్రమముగ అభివృద్ధి గాంచి, దక్షిణభారతదేశములో ఇంతకన్నా మించిన చక్కెర ఫ్యాక్టరీ లేదన్న ఖ్యాతి గడించినది. మొదటి సంవత్సరమున 1,90,000 సంచుల చక్కెర తయారు గావింపబడినది. ఇట్లు శ్రీజనని ఆశీర్వాదబలమున ఆశ్రమాభ్యుదయ మమోఘముగ విరాజిల్లుచున్నది.

# 18

## ఆశ్రమ కార్యకలాపములు

### స్వర్ణ దినము

శ్రీ అరవింద గాయత్రి:—

తత్ సవితుర్వరం రూపం జ్యోతిః పరస్యధీమహి
యన్నః సత్యేన దీపయత్॥

సవితృదేవుని మంగళరూపమును, సత్యముతో మనల నుద్దీపనము చేయు పరాత్పరుని జ్యోతి స్వరూపమును ధ్యానింతుము గాక।

శ్రీఅరవిందులు తాము జెప్పిన క్రొత్త గాయత్రీమంత్రములో మాతృశ్రీని మంత్రమునకు దేవతగా నధిష్ఠింపజేసిరి. ఈ మంత్రములో ఆహ్వానింపబడిన జ్యోతియే మాతృదేవిలో మూర్తీభవించి సాధకునకు యోగము నుపదేశించి మానసాతీత ప్రాప్యమగు తేజస్సును సాధించు వరకు తీసికొని పోవుచుండును. కనుక యీమెయే యీ మంత్రదేవత యగుటలో న్యాయమున్నది. ఈ మంత్ర ద్రష్టయగు శ్రీఅరవిందులు ఆధ్యాత్మిక చైతన్యముతో ఈ మంత్రములో నిబిడీకృతమై యుండెను.

1960 వ సంవత్సరమున, ఫిబ్రవరి మాసమున — 2వ తేదీన — అనగా సరస్వతీ పూజ రోజున శ్రీజనని ఆ గాయత్రీ మంత్రమును, సందేశమును

సర్వులకు నొసగిరి. ఆ పదకముల మీద అతీతమానసాభివ్యక్తిని సూచించు గుర్తును, కేంద్రములో శ్రీఅరవిందులకు ప్రీతి పాత్రమయిన తామరపుష్పమును, వెనుక భాగమున తల్లిగారి చిహ్నము మధ్యన, 29-2-56 తేదీలు పై భాగమునను 29-2-60 వ తేదీలు క్రింద భాగమున నుండినవి.

ఆ దినమంతయు ఆశ్రమము హిరణ్మయకాంతితో ప్రకాశించుచుండెను. అనుదినము తల్లిగారు దర్శనమిచ్చు మేడమీద "బాల్కనీ" యంతయు బంగారు కాంతిగల పట్టువస్త్రముతో నలంకరింపబడి, ఆ పట్టువస్త్ర మతీత మానసాభివ్యక్తి సూచనా పుష్పముతో కూడియుండెను. స్వర్ణ దినమున భారతదేశమునుండి, ఇతర ప్రాంతములనుండి, భక్తాదులు విచ్చేసియుండిరి. ఆశ్రమసాధికలు తల్లిగారిచే నొసగబడిన బంగారంచులుగల చీరలను ధరించి యుండిరి. ఆశ్రమమంతయు పూలమొక్కలతోను,విద్యుద్దీపములతోను నలంకరింపబడి యుండెను.ఆ యలంకరణ జూచి తీరవలయునుగాని జెప్పుట కెంతమాత్రము సాధ్యముకాదు. సాధకీసాధకులు, తదితరులు శ్రీవారి సమాధిని పుష్పములతో పూజించిరి, ధ్యానించిరి.

సంగీతము జీవుని యున్నతచైతన్యమునకు గొనిపోవుటకు గొప్ప సాధనము కదా! అమెరికా దేశీయులలో భక్తిపూర్వకముగ యొకరిచే నొసగబడిన పయానా వాద్యమును తల్లిగారు పదిఘంటల ప్రాంతమున కొంతసేపు సర్వులను తన్మయత్వ మొందించున ట్లతిశ్రావ్యముగా వాయించిరి. ఆ సమయమున మాతృశ్రీ సంగీతము నుండి హిరణ్మయ దివ్యవర్షమును కురిపించునట్లొక సాధకున కనుభవము గలిగెను, సహకారవేతనమును పుచ్చుకొనిన యొక న్యాయాధిపతి, తల్లిగారి గదిలో శ్రీకృష్ణుడు నాట్యము చేయుట గాంచెను. ఇది నిజమా యని తల్లిగారిని ప్రశ్నింపగా ఔను యౌ నిజమని చెప్పిరి.

సాయంకాలము 4-30 ఘంటలకు, ధ్యానమందిరములో స్వర్ణమయ సింహాసనమున తల్లిగారు హిరణ్మయ దుస్తులను ధరించి ఆసీనులై, వచ్చిన వారలకు-బంగారు వర్ణముగల పుష్పములను, పదకములను నాశీర్వదించి యిచ్చిరి. ఈ దినము స్వర్ణ దినమనియు, ప్రతి నాలుగవ సంవత్సరమును ఈ దినము స్వర్ణదినముగనే

పరిగణింపవలయునని స్వర్ణాక్షరములచే లిఖింపబడెను. రాత్రిభోజన సమయమున ప్రతియొకరికి ఐదౌన్స్యులతేనె ప్రసాదింపబడెను.

## నవయుగారంభము

4_6_67

4 అభివ్యక్తి (Manifestation)

5 శక్తి (power)

6 నూతనసృష్టి (New Creation)

7 ఉపలబ్ధి (Realisation)

4-5-67 నూతన సృష్టిలో నుపలబ్ధితో గూడిన శక్తియొక్క అభివ్యక్తి 4_5_67 వ తేదీల ప్రాముఖ్యతను గురించి శ్రీజనని ఈ క్రింద జెప్పిన విధముగ సందేశము నొసగిరి.

"4_5_67 వ తేదీలు విజ్ఞానాభివ్యక్త దినము. ఇది భారతదేశము యొక్క నూతన సంవత్సరము; పృథ్వియొక్క క్రొత్త సంవత్సరము మరియు ప్రపంచము యొక్క క్రొత్త సంవత్సరము కూడ నగును. ఇవన్నియు నొక్కటే దినమున ఐక్యమై ప్రపంచమును మార్పుదల చేయగలిగినవగును. విజ్ఞానశక్తి పృథ్విపై ఈనాటి నుండి పనిజేయుటకు మొదలిడును. ఈ దినమును మనము విజ్ఞానాభివ్యక్త దినముగ పరిగణింపవలయును."

స్వర్ణదినము (The golden day) వలెనే 4-5-67 వ తేదీల దర్శనము గూడ చాల ప్రశంశనీయమైనది. అది సర్వులకు పర్వదినము. మనదేశమునందేగాక విదేశములనుండి భక్తులు సుమారు ఐదువేల మంది పుదుచ్చేరికివచ్చి శ్రీమాతను దర్శించి యామె కృపకు పాత్రులైరి ఆ పర్వదినమున ధ్యాన మందిరములో తల్లిగారి స్వర్ణమయ సింహాసనమును బంగారు కాంతిగల పట్టువస్త్రములతో నలంకరించి. యుండిరి. తామర పుష్పములను, వివిధరకములైన యితర పుష్పసముదాయములను పగిషీపనులతో గూడిన చిన్న చిన్న పాత్రలయందు చక్కగా నమర్చియుండిరి. ఆ యలంకరణ, ఆ ప్రశాంతత వర్ణనాతీతము. తల్లిగారు యేకాంతముగ నుండుట

వలన సాధకి సాధకులు స్వర్ణమయ సింహాసనమున తల్లిగారాసీనులైనట్లే భావించి, ఆ సింహాసనమునకు నమస్కరించి వెళ్ళుచుండిరి. 4వ తేదీ ఉదయమున శ్రీవారి సమాధియంతయు పరిమళ సుగంధద్రవ్యములతోను, సువాసనగల పుష్పములతో సర్వులు భక్తిపూర్వకముగ పూజించిరి. ఉదయము 10 ఘంటలనుండి—10-30 వఱకు శ్రీవారి సమాధియందు ఆవరణమునందు ధ్యానము నిర్విఘ్నముగా కొన సాగెను.

స్వర్ణ దినమున తల్లిగారే స్వయముగ సువర్ణకాంతిగల పదకములను సర్వులకు నొసగియుండిరి. కాని, 4-5-67 వ తేదీన శ్రీజనని యేకాంతముగ నుండుటవలన, పదకములన్నియు సాధకులే సర్వులకు నొసగిరి. ధ్యానమందిరము నుండి మేడమీదికివెళ్ళి, శ్రీమాతారవిందులు మునుపు దర్శనమిచ్చుగదిని దర్శించిన తరువాత పదకముల నెల్లరు స్వీకరించునట్లేర్పాటు గావింపబడెను. భక్తజనులు సమాధి ఆవరణమున కొంతసేపు ధ్యానముజేసిన తరువాత పదకములను స్వీకరించుటకై మేడమీదికి వెళ్ళిరి శ్రీవారి గదిని దర్శించి, నమస్కరించి, పదకములను స్వీకరించి ధ్యానమందిరమునకు వచ్చిన తరువాత శ్రీఅరవిందుల సందేశము నాంగ్లము, ఫ్రెంచి—ఇత్యాధి భాషలలో వ్రాయబడి యుండిన పత్రికలను సాధకులు భక్తజనుల కొసగిరి. ఆ పత్రిక యందలి సందేశమును గూర్చి క్రింద వివరింపబడినది.

"పార్థివజీవన మొక గొప్పదేవతచే స్వయముగా నేర్పఱచుకొనబడిన నీ నివాసస్థానము, అంధకారకారాగారముగ నున్న దీనిని తనయొక్క మనోహర ప్రాసాదముగను, స్వర్గతుల్యమైన మందిరముగను పరివర్తన మొనర్చుటయే ఆయన సనాతన సంకల్పము."

శ్రీఅరవిందులు

సర్వులు పదకములను స్వీకరించునంతలో రెండు ఘంటల సమయమాయెను. ఇక సాయంకాలము శ్రీమాత మేడమీదనున్న ఆవరణము నుండి యొసగు దర్శన మేర్పాటు గావింపబడెను. శ్రీమాత దర్శన మొసగు ఆవరణమంతయు బంగారు కాంతిగల పట్టువస్త్రములచే నలంకరింపబడియుండెను. భక్తజనులామె దర్శనమునకై

వేచియుండిరి. 6 ఘంటలకు శ్రీమాత మేడమీది యావరణమునకు విచ్చేసిరి. పదునైదు నిముసములపాటు భక్తజనులనెల్ల కరుణార్ద్రదృష్టితో చూచి ఆశీర్వదించిరి. శ్రీమాత నెంతసేపు చూచినను తనివి తీరదు. ఆమెయే జగజ్జనని, యోగీశ్వరి. శ్రీమాత దర్శన మొసగి లోనికి వెళ్ళినంతనే ఆ మూర్తినే మనము కొంతసేపు వీక్షించినట్లనుభవము కలుగును. ఇట్లు భక్తజనులు శ్రీజనని కటాక్షవీక్షణములకు పాత్రులై, ఆ దినమంతయు ప్రశాంతముగాను, ఆనందముగను గడిపిరి. ఆ నాడు 8 ఘంటల సమయమున ఆశ్రమమువారు ఆటస్థలమందు మాతారవిందుల చిత్రపటములను, ఆశ్రమమున వికసించు పుష్పముల ప్రాధాన్యతను విశదపరచునట్లు చలనచిత్రముద్వార ఆశ్రమవాసులకును తదితర ప్రేక్షకులకును జూపి వారల నానందాబ్ధిలోలలాడించిరి.

# 19

## ప్రార్థనలు—ధ్యానములు

తల్లిగారు రచించిన "ప్రార్థనలు—ధ్యానములు" అన్న గ్రంథరాజము ప్రపంచఖ్యాతి గడించిన మతగురువులను జయించి సువర్ణస్థానము నలంకరించు నను టతిశయోక్తి కానేరదేమో! ప్రార్థనలు—ధ్యానములను గురించి ఫ్రెంచి భాష యందు శ్రీజనని ట్లు వక్కాణించిరి.

"తీవ్రయోగోపాసన మొనర్చు సందర్భమున రచించిన శీర్షికలే 'ప్రార్థనలు—ధ్యానము' లన్న పుస్తకమునందు పొందుపరుపబడియున్నవి. ఈ పుస్తకము మూడు విధములైన ఆకాంక్షాపరులకు—అనగా ఆత్మవిజయమును పొందినవారలకు, దైవ మార్గాను రక్తులకు, దైవకార్యములకు తమ సర్వస్వమును సమర్పణజేయు వారల కీపుస్తకము మార్గదర్శిని" ప్రేమ, ఆకాంక్ష, యేకాగ్రత, ధ్యానము, వైరాగ్యము, ఆత్మనిగ్రహము—ఇత్యాది సుగుణములను యెడతెగని కృషితో అలవర్చుకొని, జితేంద్రియులై, ఈ ప్రస్తుత భౌతిక నిర్మాణ బంధనములనుండి విముక్తులు గావలయునన్న కాలాతీతమైన పరమసత్తాతో ఐక్యము గావలయును. శ్రీజనని

విరచిత గ్రంథ రాజమైన 'ప్రార్థనలు —ధ్యానములు' మార్గదర్శకమై, జీవనాధారమై దైవాన్వేషకులను వెలుగుబాటలో నడిపించును. ఆత్మనిగ్రహమును, ధ్యానమును గురించి బోధించుచు సాధనాసంపత్తికి వలయు నోరిమిని? శాంతి? జ్యోతి శక్త్యా నందములను ప్రసాదించును.

అనుదినము ఉషఃకాలమున 5 ఘంటల సమయమునందు శ్రీజనని తమ గదియందు కిటికీవద్ద ఆసీనులై ధ్యానమునందు నిమగ్నులై ధ్యానానంతరము తమ భావములను, అనుభవములను గూర్చి వ్రాయుచుండిరి. ఆ రచనలే "ప్రార్థనలు_ ధ్యానములు" అన్న యొక పెద్దపుస్తకమాయెను. శ్రీజనని రచించిన ప్రార్థనలు_ ధ్యానము లనేకములు; అందు కొన్నిమాత్రమిందు సేకరించి రచించితిని.

## ప్రాతఃకాల ప్రార్థన

దివ్యమాతా! నీ ఇచ్ఛకు నీ కార్యమునకుగాను, మమ్ము పూర్ణకానుకగాను, తన్ను తాను సంపూర్ణముగ మరచిపోవుటకును, ఘనతరమైన వెలుగునకు, పవిత్ర ప్రేమకు సంపూర్ణ సమర్పణము చేయుటకు నేడు మమ్మనుగ్రహింపుము. అత్యంత గంభీరముగా ఎడతెగక పెంపొందు సమగ్రతలో మే మెల్లప్పుడును నీ సామీప్యమున ఐక్యత నొందునట్లును మేము యోగ్యులుగాను, సేవకులుగా నుండునట్లనుగ్రహింపుము. మమ్మహంకార రహితులుగ నొనర్చుము. నీచమైన ఆడంబరమును మా నుండి నిర్మూలమొనర్చుము. నీ దివ్య ప్రేమ అను దేదీప్యమాన వెలుగుచే, ప్రకాశించునట్లొనర్చి ఈ జగత్తులో మమ్ము నీతేజో దీపికలుగా నొనర్చుము.

1937 వ సంవత్సరమున, అక్టోబరు 23 వ తేదీన శ్రీజనని ఒక ప్రార్థనను ఫ్రెంచి భాషలో రచించిరి. దీనిని శ్రీఅరవిందు లాంగ్లమునకు తర్జుమా చేసిరి. ఆ ప్రార్థన నిట పొందుపరచుచున్నాను.

## దైవసేవాపరాయణుల కొక ప్రార్థన

మహిమాన్వితమైన ఓ ప్రభూ! ప్రతి విఘ్నము నెదుర్కొని జయోత్సాహముచే వెలుగొందు ఓ దేవదేవా!

మీకార్యాచరణయందు ఏ విఘ్నము కలుగకుండునట్లు మమ్మను గ్రహింపుడు.

మీ ప్రత్యక్షమున కాలస్యము లేకుండునట్లనుగ్రహింపుడు.

అనుక్షణ మన్ని విషయములందును మీ ఇచ్ఛా సంకల్పములే జరుగునట్లు దయ చేయుడు.

దేవా! మేము మీ సమక్షమున నిలుచుకొనియున్నాము. ప్రతిమూలపదార్థము నందును, మాసత్త యొక్క ప్రతికార్యములయందును, ఉత్కృష్ట ఉచ్ఛ్రయముల నుండి చిన్న శరీరాణువులవరకు మీ ఇచ్ఛ మా యందు ఫలవంత మగునట్లొనర్పుడు.

మే మెప్పటికిని విశ్వాసపాత్రులుగా నుండునట్లనుగ్రహింపుడు. ప్రతి యొకటిని నిరసించుటచే మేము సంపూర్ణముగా మీ ప్రాబల్యమున నుండువారము. మీ అగాధానంత కృతజ్ఞతను మరువకుండునట్లనుగ్రహింపుడు.

అనుక్షణము మీచే యొసగబడిన బహుమానముల నమితవ్యయ మొనర్పకుండునట్లనుగ్రహింపుడు.

మా సర్వస్వము మీ కార్యమునందు సహాయకారిగా నుండి యుపలబ్ధికి సంసిద్ధులగు నట్లొనర్చుడు.

ఉపలబ్ధికి శ్రేష్ఠతమమైన ప్రభూ! నీకు జయము కలుగు గాక! మీ జయప్రద కార్యాచరణలో చురుకుదనము, పట్టుదల సంపూర్ణాధికారము, అచలనమును ప్రసాదింపుడు.

ఐహికవాంఛలను జయించి, భగవానుని తెలిసికొనగోరు ఆకాంక్షాపరులకు 1914 వ సంవత్సరము, జనవరి మాసము 4 వ తేదీన మాతృశ్రీ రచించిన ప్రార్థన యెంతో ఉపకరింపగలదు.

ఆ ప్రార్థన నిట పొందుపరచుచున్నాను:—

ఐహికవాంఛ లనుక్షణము వేధించుచునే యుండును. మన మెలకువ ఒక క్షణమాత్రము సడలినను యే మాత్ర మజాగ్రత్తగ నుండినను తలంపులు

తండోపతండములుగా అన్ని వైపులనుండి ప్రవాహరూపముగా వచ్చి మన ప్రయత్న ఫలితములను ముంచివేయును. అంతః సత్త ఒక విధమైన జడత్వము లోనికి ప్రవేశించును. అంత దాని భౌతికావశ్యకతలైన ఆహారము, నిద్ర ఇత్యాదు లతిశయించును. దాని వివేకము మరుగుపడును. అంతర్దృష్టికి తెరవేయబడి, బాహ్య కార్యాచరణలో శ్రద్ధవహించుటయే గాక, అవి ప్రత్యేకముగా ఆక్రమించు కొనును. ఇటువంటిస్థితి ఇక్కట్టుల పాలొనర్చును; అలసట నొందించును. పంజరములో బంధింపబడి రెక్కలను జాచలేక స్వేచ్ఛావిహారమున కువ్విళ్ళూరు పక్షిచందంబున, ఐహికవాంఛలతో నిండి నిబిడీకృతమైన అలసట జెందిన మానసము కూడ తరణోపాయమున కెదురు చూచుచు బాధ నొందును.

1914 వ సంవత్సరమున, జనవరి, 24 వ తేదీన శ్రీజనని రచించిన ప్రార్థన భగవద్దర్శనలాలసను వ్యక్త పఱచుచున్నది. ఆ ప్రార్థన నిట పొందుపరచు చున్నాను.

1914, జనవరి, 24:—

ఓ దేవా! నీవు మాసత్త యొక్క మూలకారణము. ఓ పరమేశ్వరా! గంభీర ప్రేమైకమూర్తీ! ముక్తి ప్రదాతా! సర్వవిషయము లందును నాలో జ్ఞానతేజస్సు తప్ప అన్యమేదియు నుండకుండు గాక! నీ యిచ్ఛ కనుకూలముగ నేను జీవించక పోతినా, నేను తీవ్రవ్యధకు లోనగుదును. అంతియేకాదు క్రమేణ నాకు నాశనము తథ్యము; ఏలన నీవే నాయునికికి యేదుగడ! నా గమ్యము కూడ నీవే! నా యేకైకాధారము నీవే! రెక్కలు యెదగని పక్షి యెగురుటకు సంశయించు చందంబున నేను కూడ నీతో ఐక్యమొందుటకు సందేహించుచున్నాను.

ఓ పరమేశ్వరా! నీతో నిజమైన ఐక్యము బొంద గలుగుటకు నేను పైకెగయుదును గాక!

శ్లో॥ స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం న్యాయేన మార్గేణ మాహీం మహీశాః
గో బ్రాహ్మణే భ్య శ్శుభమస్తు నిత్యం, లోకా స్సమస్తా స్సుఖినో భవంతు॥

అన్న స్వస్తివాక్యము వోలె, శ్రీజనని ఈ జగత్తునకు శాంతి కలుగ

వలయునని 1914 వ సంవత్సరమున ఫిబ్రవరి 14 వ తేదీన ఇట్లు శాంతిపాఠమును రచించిరి.

1914, ఫిబ్రవరి, 14:—

ఈ జగత్తునకు శాంతి కలుగు గాక: సామాన్య ఐహికము నుండి యెల్లరును కడతేరుదురు గాక: విషయాసక్తులనుండి విముక్తి నొందుదురు గాక: నీ దివ్య సాన్నిధ్యము యొక్క విజ్ఞానమున వారికి జ్ఞానోదయమగు గాక: నీ పరమ చైతన్యములో ఐక్యత నొంది, యందుండి యుద్భవిల్లు ద్విగుణీకృతమైన శాంతిని చని జూచెదరు గాక:

ప్రభూ: నీవు మా సత్త యొక్క పురాణాధిరాజువు: నీ నియమమే మా నియమము: ప్రతివస్తువునందును అనుక్షణమునను దేవా: నీ మహత్తర కార్యమును నిర్వహించు నిమిత్తము నీ శాశ్వత చైతన్యముతో మా చైతన్యమును తాదాత్మ్య మొనరించి, మా శక్తి సామర్థ్యములతో నున్నత స్థితిని బొందుటకు ఆకాంక్షించెదము.

ప్రభూ: ఆకస్మిక సంభవములందుగల చింతనుండి, సామాన్య వ్యావహారిక దృష్టినుండి మమ్ము మరల్చి రక్షించుము.

నీ నయనములతో వీక్షించుటకును, కేవలము నీ యిచ్ఛతోనే ప్రవర్తించు నట్లనుగ్రహింపుము. నీ దివ్యప్రేమ జ్యోతిని దీప్తిమంతము చేయుటకు దీపకళికలగా మమ్ము మార్పు నొందజేయుము.

ఓ స్వామీ: పూజ్యభావముతో, భక్తిభావముతో నీ నియమమును ఫలవంత మొనర్చుటకై నా సత్తనంతయు నీకు సమర్పించి నేను సంతోషముతో నీ కర్పణ జేసికొనుచున్నాను.

సర్వ ప్రపంచమునకు శాంతి కలుగు గాక!

శాంతి కలుగు గాక !

ఓం శాంతిః శాంతిః శాంతిః

"ప్రార్థనలు—ధ్యానములు" దైవకార్యాచరణ, ప్రగతి నభివృద్ధి చేయు

ఘంటానాదముచే నుట్టిపడు ధ్యానశ్లోకములు. ఈ ధ్యానశ్లోకములను శ్రద్ధాభక్తులతో పఠించినచో దైవకార్యాచరణ పట్ల పరిపూర్ణత, క్రమములను గూర్చి వ్యక్త మగును. తల్లిగారు 1912, నవంబరు 19 వతేదీన రచించిన ప్రార్థనలో ఆమె నిశ్చయముగ దైవమును కనుగొన్నామనియు ఆ యైక్యత నిరంతరముగ నుండె ననియు తెలిపిరి. తాము దైవమును స్పష్టముగా గాక, దృఢ నిశ్చయముతో కనుగొన్నామని తెలిపిరి. ఇచ్చట స్పష్టము (definite) అను పదము గాక దృఢనిశ్చయము (definitively) అన్న పదమును వాడిరి. ఈ పదజాలము నామె వాడుట యందలి అంతరార్థ మేమనగా ఆ యైక్యతనుండి తాము తప్పిపోలే దనియు, అదియే అంత్యమనియు, సురక్షితమనియు విశదీకరించిరి. తరువాత ప్రార్థనలలో ఆమె పరిపూర్ణతను గూర్చి దైవముతోడి ఐక్యతను గూర్చి స్పష్టముగ ఇట్లు విపులీకరించిరి.

"ప్రభూ! నా ప్రార్థనను మన్నించితివి. నే నడిగిన దానిని నాకు ప్రసాదించితివి. "నేను" అన్నది. ఇక యేమియు లేదు. నీవు నా జీవిత సర్వస్వమును తీసికొని నన్ను నీలో ఐక్య మొనర్చితివి. నా ప్రేమానురాగము స్వీకరించి నీలో చేర్చుకొంటివి. నా భావమును గైకొని దానిని నీ చైతన్యములో నింపివేసితివి."

# 20

## సంగీత రీతులు మూలములను గూర్చి శ్రీజనని నుడివిన వాక్కులు

(1)

సంగీతమనునది దివ్యకళ; ఇది మోక్షమునకు సాధనము. ఈ దివ్యకళ నారాధించి తరించిన మహానుభావులెందరో గలరు. శ్రీజనని లలితకళలయం దసామాన్యమైన పాండిత్యమును గడించినారు. సంగీతరీతులను చక్కగ నభ్యసించుటయేగాక, సంగీత సాధన జేసినారు. శ్రీమాత పయానా వాద్యము

నతిశ్రావ్యముగా వాయింతురు. ఆ సంగీతమును వినతీరవలయునేకాని మాటలతో జెప్పుటకు సాధ్యము గానేరదు.

ఒకసారి సంగీతోత్పత్తిని, రీతులను గూర్చి శ్రీమాత కొన్ని మణిపూసల వంటి వాక్యములను నుడివిరి ఆ యమృతవాణి నిట పొందుపరచుచున్నాను:—

అన్ని కళలవలెనే సంగీతమొక యభిప్రాయమును, భావమును, రాగమును నిశ్చయమైన యాకాంక్షను వ్యక్తము జేయుటకు సాధనము వంటిది. ఈ గమనములు గల ఒకానొక సామ్రాజ్యము నుండి అవి సంగీత రూపకముగ అవరోహింపబడును. సరియైన యావేశము కలిగిన దివ్యజ్ఞాన పరిపూర్ణుడైన గాయకుడు రసవత్తరమైన సంగీతమును దైవప్రేరణచే నుత్పన్నమొనర్చును; అట్లొనర్చినచో నాతడు సుప్రసిద్ధ సంగీతవేత్త యనబడును. ఉన్నత దివ్యసామ్రాజ్యము నుండి ప్రతిభా రహితుడైన గాయకునకు గూడ దైవప్రేరణ కలుగుట కద్దు, అయితే సంగీత శాస్త్రమునందు ప్రతిభలేనందువలన ఆతడు రసవంతము కాని సాధారణసంగీతమును మాత్రమే యుత్పన్నము చేయును......

దైవప్రేరణా రహితమైన యాంత్రికమైన సంగీతమొకటి కలదు. చిక్కయిన, తీవ్రగమకములతో గూడిన సంగీతమును దోషములులేక అందులో ప్రావీణ్యతను సంపాదించిన చందంబున వాయించు గాయకులెందరో గలరు. దానిని కూడ సంగీతమనియే యందురు. కాని, అదొక యంత్రము వోలె నేమియు వ్యక్తమొనరింపదు. అందులో నైపుణ్యమున్నను రసహీనమై ప్రాణరహితముగ నుండును. సంగీతమునందే కాదు మానవసంబంధమైన నిర్మాణము లన్నిటను దైవప్రేరణ యుండుటత్యవసరమని నేను చెప్పుచున్నాను. సహజముగ దైవప్రేరణకు సరిపోవునట్లుగా సంగీతము నుత్పన్నము జేయుట వాంఛనీయము. వాస్తవికముగా భావయుక్తముగా పాడవలయునన్న ఘనతరభావములు కలిగియుండవలయును. పాండిత్య మనవసరమని చెప్పుట సరికాదు. సంగీతము భావయుక్తమై వీనులకింపొనగు నట్లుండవలయునన్న ఘనతరమైన పాండిత్యమత్యంతావశ్యకము. అవశ్యకమైన సంగీతము దాని మూలస్థానమైన ఊర్ధ్వస్వరముల నుండి అవతరించును. ప్రతిదానికిని నొక మూలస్థానముండును. మూలస్థానము లేనిదే యే పదార్థ ముండబోదు. ఉన్నత

సత్యమున మూలము లేనిదే యేదియు భౌతికముగ ఇహలోకమున అభివ్యక్తము కానేరదు. భౌతిక ఉనికికి మూలము—ప్రాణికము. అటులనే ప్రాణికమునకు—మనస్సును, మనస్సునకు—అధిమనస్సును, అధిమనస్సునకు—అతీతమనస్సును, అతీతమనస్సునకు—సచ్చిదానందము మూలస్థానములుగ నున్నవి. ఈ జగత్తు చదునైన వస్తువై తనకుతానే మూలముగా నున్నచో అది త్వరలోనే నశించును. అది రహస్యశక్తితో నడుపబడి దివ్యాభివ్యక్తికి దోహదమొనర్చుచున్నది.

సంగీత మూలమున క్రమబద్ధమైన స్థాయిలు గలవు ఉన్నత ప్రాణికము నుండి యుత్పన్నమగు సంగీత మాకర్షణీయముగను, ఇంపుగ నున్నను ఇంచుక మోటుగానుండి ఉద్రేకపూరితముగ నుండును ప్రాణికసత్తానుండి వచ్చు సంగీతము వలెనే ఉన్నతస్థరమున నున్న చైత్యసత్తానుండి వచ్చు సంగీతము కలదు. అటులనే ఆధ్యాత్మిక సత్తానుండి వచ్చు సంగీతము కలదు; దాని స్వలోకమున ఉన్నత సంగీతము ఘనతరముగను దివ్యముగ నుండును. అది నిన్నాకట్టుకొని నిన్నెటకో గొనిపోయి తన్మయత్వము నొందించును. కాని దీనిని ప్రస్ఫుటము జేయవలయు నన్న ఇది ప్రాణికముద్వార బహిర్గతము గావలసి వచ్చును. ఊర్ధ్వము నుండి అవతరణమొనచ్చు సంగీతము ప్రాణికముద్వార బలపూరితము కానిచో అది నీరస మగును. మహోన్నత సంగీతమునకు బలమొనగూర్చునది ప్రాణికసత్తాయే! ప్రాణికసత్తా చైతన్యవంతము కానందున ఊర్ధ్వమునుండి దివ్యసంగీత ముద్భవించి నను అది రసవత్తరము కాకపోయి ఇతరులను రంజింప చేయలేకపోయిన గాయక శిఖామణుల నేనెందరినో చూచియున్నాను. ఆధ్యాత్మికసాధన వారిలో గొప్పదైనను, ప్రాణికము నిద్రావస్థలో నున్నందున దివ్యప్రస్ఫుటము కాలేదు. అది ఊర్ధ్వము నుండి నేరుగా భౌతికమునకు వచ్చునదే కాని రసవంతము కాలేదు. లలితకళలన్నిటికి నొక యూర్ధ్వములో కలుగు దివ్యావేశమును, దీనిని రసవత్తర మొనర్చి బహిర్గతము చేయు విపులప్రాణశక్తి స్పందనము కూడ అవసరము. ఈ రెండును లేకపోయి నప్పుడు ఎట్టి దివ్యకళయు రాణించదు. సంపూర్ణపాండిత్యమును సంగీత కళయందార్జించవలయునన్న దైవప్రేరణ, పాండిత్యము రెండును అత్యవసరములే. అయితే రెండును కలిగియుండు టరుదు.

ప్రాణికము మాత్రమే యున్నయెడల చలనచిత్రసంగీతము(Film music)

ఫలహారపు కొట్టులోని (Hotel) రికార్డుల సంగీతము వంటి సంగీతము ఉత్పన్నమగును. అది యద్భుతమై, నిపుణత్వముతో విశేషముగా అసభ్యతతో కూడినదై యుండును. అంత నిపుణత్వముతో అది గానము చేయబడుటవలన ఆ సంగీతము నీ మస్తిష్కమును, జ్ఞాపకశక్తి నావరించి నిన్నాకర్షింపజేయును. దాని ప్రాబల్యము నుండి నీవు తప్పుకొనలేవు. అదే ప్రాణశక్తి; దైవప్రేరణా మిశితమై యూర్ధ్వము నుండి యుద్భవించి దేవతలను గూడ సంభ్రమాశ్చర్యములలో మునుగునట్లు చేయు సంగీతమే దివ్యసంగీతము: అటువంటి దివ్యసంగీతము పాశ్చాత్యులైన సీసర్ ఫ్రాంక్, బీతోవెన్, బాక్ — మరికొందరిలో కాననగును. ఐనను ఆ దివ్యసంగీతామృతమొక క్షణమే కాని సుస్థిరముగ నుండజాలదు.

## భారతీయ సంగీతము — పాశ్చాత్య సంగీతము

**(2)**

భారతీయ సంగీతమునకు — పాశ్చాత్యసంగీతమునకు భావ ప్రకాశత యందును లేక భావవ్యక్తతయందును, రీతులందును వ్యత్యాసము గలదు. పాశ్చాత్య సంగీతమున మహోన్నత, ఆధ్యాత్మిక దైవప్రేరణ అరుదుగానుండును; అంతియే కాదు. చైత్యసత్తామూలము కూడ అరుదే: అది యున్నత మూలమునుండి వచ్చినను ప్రాణికమునుండి వచ్చు మూలమే గాని ఆధ్యాత్మికమూలము నుండి వచ్చునది కాదు. మూలము ప్రాణికమైనందువలన ప్రకాశత కూడ ప్రాణికమునకు సంబంధించినదే: కొన్ని సమయములలో పాశ్చాత్యసంగీతము కూడ ఊర్ధ్వము నుండి వచ్చును. అట్టి సమయములలో అది అత్యద్భుతముగ నుండును. చైత్య సత్తానుండి అరుదుగా ప్రస్ఫుటమగు గానము మతసంబంధమైనది. కాని అది తరుచుగా నుండబోదు.

భారతీయ సంగీత మెల్లప్పుడు వారు గానము చేసెడి రాగములయందు మూర్తీభవించును. భారతీయసంగీతమును నేను బాగుగా విన్నాను; ప్రాణశక్తితో గంభీరముగా తేజోవంతముగా వచ్చెడి సంగీతము ఏ నాలుగైదుమారులో అరుదుగా విన్నాను. ఆంతరికమునుండి భౌతికమునకు నేరుగా అవతరించిన సంగీతము భారతీయ సంగీతము. భారతీయ సంగీత మాధుర్యమును చూరగొన

వలయునన్న నవి సూక్ష్మముగ, సున్నితముగ రంజకముగనుండి, ప్రాణశక్తియుత ప్రతిధ్వను లతిశయముగ లేనందున, నీవు దానిని ఏకాగ్రతతో నాలకింప వలయును. చైత్యసత్తామూలములో నీవు ప్రవేశించి, ఆ సంగీత ప్రవాహములోనికి జారి అందులో కొట్టుకొనిపోదువు. అందులో తన్మయుడవై మత్తుచెందిన స్థితి నైనను లేక సమాధిస్థితినైనను బొందుదువు. ఈ విధముగ చైతన్యానందములోనికి పోవుదువు. అట్టితరి, ఇంకను నీవు లోతులకు దిగినచో చైత్యచైతన్యమును కూడ చేరుదువు. కాని, నీవు బాహ్యచైతన్యములో నుంటివేని నీ కాంతరంగికానందము కలుగనేరదు. అది నిర్వీర్యముగ నుండును. చైత్యసత్తాలో ప్రాణికసత్తా మిశ్రితమైనచో నత్యద్భుతముగ నుండును.

ఒకే ఒక సంగతి కలిగి వ్యత్యాసములతో గూడి, క్రమముగా నభివృద్ధి గాంచెడి యమితమైన భేదములు లేక ఒకే ఒక నిరంతరమైన సంగతినే గానము జేయునటువంటి, వ్యత్యాసములే శాఖలై మరల మూలమైన సంగతికి వచ్చు సంగీతమన్న నా కత్యంత ప్రీతికరము (అని మాత వివరించెను). యూరపు నందు కూడ ఇటువంటి సంగీతమే కొంత యుండవచ్చును. బాక్ మరియు మోజార్టున కీర్తులు క్షుణ్ణముగా తెలియును. నవీనకాలములో దిబ్బసీ, రావల్, రష్యాదేశస్థుడైన బొరొడిన్ తదితరులయం దీసంగీత పోకడలు కొన్ని కలవు. కొన్ని స్వరములను తీసికొని. వ్యత్యాసములతో వానిని వాయించుము; అట్టితరి వినుట కత్యద్భుతముగ నుండును. అది నిన్ననంత అగాధములలోనికి దీసికొని పోయి నీవు సిద్ధముగా నున్నచో బాహ్య, భౌతిక చైతన్యమునుండి నిన్ను దీసికొనిపోయి చైత్య వికాసమును కలుగజేయును.

శ్రీజనని తాము పయానా వాద్యమును వాయించు విధానమును గూర్చి యిట్లు నుడివిరి:...

"పయానా వాద్యమును వాయించుట కుద్యుక్తురాలనైనతరి, యేమెట్లను నొక్కబోవుదునో నాకే తెలియదు. అది యహర్నిశముల యాంతరంగిక స్థరము నుండి వచ్చును. బెరిలాయ్ సంగీతపు ఉత్పత్తిస్థానమును గూర్చి నేనెరుగుమను. ఆ స్థానమును గూర్చి నాకుబాగుగా తెలియును. దానిలో పలుమారు నాకు ప్రవేశము

గలదు. నానుండి వెలువడు సంగీతమును గూర్చి నాకేమాత్రము తెలియదు. నే నే చేతనాస్థితిని ఏ భావమును వ్యక్తపరచ బోవుదునో దానిని గురించి ముందే మాత్రము నిశ్చయించను. నే నొక శ్వేతపత్రమువలె పయానావాద్యమును వాయించుట కాసీననై ఒక క్షణమాత్ర మందు ఏకాగ్రత వహించి వాయింతును. సాయంసమయమున రెండవసారి ఉపరికార్డునందు నేను వినినపుడే నేను వాయించిన సంగీతమును గూర్చి నాకు దెలియునది.

# 21

## మతమును గూర్చి శ్రీజనని నుడివిన వాక్కులు

యోగమునకు—మతమునకు గల వ్యత్యాసమేమని ఒకరు తల్లిగారిని ప్రశ్నించిరి. దృఢేచ్ఛతో, కౌశలముతో, ఏకాగ్రతతో దైవముతో ఐక్యమగుటకు చేయు ప్రయత్నమును యోగమందురనియు—దైవమీవిధముగనుండును.—దైవమును కనుగొనుటకు వ్రతములు సలుపవలయును—నేనీమతమునకు కట్టుబడి 'ఇదియే సత్యమనియు సరియైనదనియు దీనిని నేను స్వీకరించుచున్నా' నన్న కొన్ని నిబంధనలతో కూడినది మతమనియు శ్రీజనని మతమును గూర్చిన కొన్ని అభిప్రాయములను వెల్లడించిరి. ఇతరులచే వ్రేలెత్తి చూపబడకుండుట కొరకు మతమును ప్రతియొకరు పాటించు చున్నారనియు, పల్లెటూళ్ళలో మతసంబంధమైన కార్యక్రమములకు బోనిచో ఇరుగుపొరుగువారు వారిని వ్రేలెత్తి చూపుదురన్న భయము మెండుగాన ఇష్టము లేకున్నను తప్పనిసరిగా ఆ కార్యక్రమములలో పాల్గొనుట యెల్లరకు పరిపాటి యైనది, ఐనను ఆధ్యాత్మికజీవితము వేరు—మతమువేరు; మతముతో ఆధ్యాత్మిక జీవితమున కెంతమాత్రము పనిలేదని శ్రీజనని నుడువుచు దాని ననుభవ పూర్వకముగ ఈ క్రింద కనబరచిన సంఘటన ద్వారా వివరించిరి:—

"నేను ప్రప్రథమముగ భారతదేశమునకు పయనమైనపుడు జపాను నావలో ప్రయాణము చేసితిని. ఈ జపానునావలో ఇరువురు మతగురువులు గూడ పయనించు

చుండిరి. బహుశః ఒకరు అంగ్రేజీవారు (Anglieans) మరియొకరు ప్రెసిబిటేరియన్ (Precebetarian) అనుకొందును.

ఆదివారమునాడు మతసంబంధమైన ఆచారమొకటి పాటించవలసియుండెను. ఆ యాచారమును అంగ్రేజీవారలా లేక ప్రెసిబిటేరియన్లా ఎవరు దానిని యథావిధిగా జరిపింపవలయునన్న సమస్య బయలుదేరెను. అంగ్రేజీవారు జగడమాడక అంతయు సగౌరవముగా ప్రెసిబిటేరియన్లకే అప్పగించిరి. ఆ యాచారమును పడవలోనే జరుపుటకు ప్రెసిబిటేరియన్లు నిశ్చయించిరి. ఆ యాచారము జరుపబడు స్థలమున కెల్లరు బోవ నుద్యుక్తులైరి. అట్టితటి వేడిమి తీవ్రముగా నుండి భరింపరానిదైనది. బహుశః మేము ఎఱ్ఱసముద్రము నందు పయనించుచుంటిమేమో? ఎల్లరును మంచి దుస్తులు వేసికొనిరి, స్త్రీలు ప్రత్యేకముగ అలంకరించుకొని "ప్రార్థనావళి" పుస్తకములను చేతబట్టుకొని ఓడలోని మందిరమున కేగిరి. ఆ పడవలోని ఆ ప్రార్థనా మందిరమంతయు జనసమ్మర్దముచే కిటకిట లాడిపోయెను ప్రార్థనానంతర మేదో కర్తవ్యపాలన మొనర్చినటుల ఎల్లరును సంతృప్తహృదయులై మరల తమ తమ గదుల కేతెంచిరి. అయిదునిముసముల తరువాత వారు మద్యపానము సేవించుచు పేకాటాడుటకు ప్రారంభించిరి. కొద్ది క్షణముల క్రితము చేసిన ప్రార్థనను గూర్చిన దంతయు మరచిపోయిరి.

ఇట్టితఱి, మతగురువు నన్ను సమీపించి ప్రార్థనామందిరమున కేల రాలేదని మర్యాదగా అడిగిరి. అంత నేను "మహాశయా! నాకు మతములో అంత నమ్మకము లేదని చెప్పుటకు విచారించుచున్నా"నని నుడివితిని.

"అయితే మీరు ఐహిక వాంఛాపరు లనుకొందు"నని మతగురువనెను-నేనట్లు కాదంటిని.

అయితే ఇంకే కారణమై యుండనోపునని అతడడుగగా "నేనీ విషయములను గురించి చెప్పినచో అవి మీకు రుచించవేమో! కనుక యేమియు చెప్పకుండుట మేలని నాకు తోచుచున్న" దంటిని. ఆతడు మరల నన్ను చెప్పుమని ప్రాధేయపడగా ఆతనితో నే నిట్లంటిని:—

"మీలోను మీ సమూహములోను హృదయపూర్వకత లోపించి యున్నది. ఒక సాంఘికాచారమును, కర్తవ్యమును నిర్వహించుటకై, మీరొకచో గుమిగూడితిరే కాని మీరు దైవముతో నైక్యము నొందుటకు గాదని నాకు స్పష్టమగుచున్నది."

'దైవముతో నైక్యమగుటయా! దానిని మేమెనర్చలేము. ఏదో సుమధుర, గంభీరమైన మాటల నుచ్చరించుచు దైవము నారాధింతుమే కాని దైవముతో ఐక్యము నొందుటకు మాకు సామర్థ్యము లేద'ని ఆ మతగురువు ముక్తసరిగా జవాబొసగెను.

తరువాత ఆ మతగురువు నన్నెన్నియో ప్రశ్నలడిగెను. అనార్యులను మార్చు నిమిత్తమై చైనాకు వెళ్ళుచున్నాననెను. అంత గంభీరముగ నేనిటు లంటిని:—

'మీ మత ముద్భవించుటకు మునుపే ఇంకా రెండువేల సంవత్సరము లైనను గాక మునుపే చైనీయులు ఆధ్యాత్మికమును బాగుగా నవగాహన చేసికొని దైవమార్గానురక్తులైరి. వారు పాశ్చాత్యుల ననాగరికులుగా భావించిరి. మీకన్నా అతిశయజ్ఞానమును బొందినవారినేనా మీరు మార్చదలచినది! హృదయపూర్వకతలేని యీ బూటకమైన యాచారములను గూర్చియేనా వారికి మీరు బోధించ దలచు కొన్నది?'

నా మాటల కాతడు ఉక్కిరిబిక్కిరియై 'మీరు మాటలచే నన్నొప్పింప లే' రనెను.

'నేను మిమ్మొప్పింప ప్రయత్నము జేయుటలేదు. ఉన్నపరిస్థితిని గూర్చి మీకు తెలియజేసితిని. మునుపే నాగరికులైనవారలను, అనాగరికులు మార్చు ప్రమేయము లేదంటిని. కాని అంతే!' అని ఆయనకు దెలియజేసితిని. అంతటితో ఈ సంభాషణ యంతమాయెను.

1. క్రైస్తవదేవాలయపు క్రూరత్వములు, మతముల యొక్క సంకుచితత్వము నకు నాస్తికత్వమన దొక విరుద్ధాభిప్రాయము. ఈ పేక మేడలను నాశనము గావించుటకు దీనిని రాయిగా భగవాను డుపయోగించుచున్నాడు.

2. ఎంతయో వివేక హీనముగ, ద్వేషయుక్తముగ యుక్తితో జనులు మతములను విజయవంతము జేయుటకును, వానికొక విచిత్రమైన పేరును కల్పించుటకు జూతురు.

అని శ్రీఅరవిందులు మతమును గూర్చి చెప్పిరి. మతము—నాస్తికత్వములలో ఏది మిన్నయని సాధకుడు తల్లిగారిని ప్రశ్నింపగా శ్రీజనని ఇట్లు నుడివిరి.

"మతములుండువరకు వానిని సమానబలముతో నెదిరించుటకు నాస్తికత్వమత్యంతావశ్యకము సత్యమునకుగాను, నిష్కపటమైన నిష్పక్షపాతమైన యన్వేషణకును, ఈ పారమార్థికాన్వేషణకును స్థానమిచ్చుటకుగాను రెండును అదృశ్యము గావలయును."

* * *

"మతబోధతో ఆధ్యాత్మికమును జేర్చి బిబ్బిబ్బి పడవలదు. ఆది నుండియు మతబోధ యున్నదే! కనుక యిది గతకాలమునకు జెందిన ప్రగతి నాటంక పరచును. ఆధ్యాత్మిక బోధ భవిష్యత్తున కొటపట్టును, చేతనను వికాస మొనర్చి, భవిష్యదుపలబ్ధికి దానిని సంసిద్ధమొనర్చును.

ఆధ్యాత్మిబోధ మతముల కతీతమై, సంపూర్ణసత్యమునకు గాను ప్రయత్నించును. అది దైవముతో ఐక్యమగుటను గూర్చి మనకు బోధించును."

# 22

## మాతృశ్రీ నూతనవర్ష సందేశములు

## మాతృ వాక్కులు

శ్రీజనని ప్రతి నూతన సంవత్సరమున నొక సందేశము నొసగిరి. అందులో కొన్నింటిని మాత్రమిట పొందుపరచుచున్నాను :—

1933

నూతన సంవత్సరోద్భవ ముజ్జ్వల భవిష్యత్తును సూచించునదియై మన చైతన్యమును వికాసమొనర్చు నవజన్మగా నుండుగాక!

*　　　*　　　*

1934

ఓ ప్రభూ! సంవత్సర మంతమగుచున్నది; మా కృతజ్ఞత నీ కభివందన మొనర్చుచున్నది.

ఓ ప్రభూ! సంవత్సరము మరల నుద్భవించుచున్నది. మా ప్రార్థనా ప్రవాహము మీకొరకు కుద్యమించుచున్నది.

అది మాకు నవజన్మ ఉషస్సగునట్లు వరమొసగుడు.

*　　　*　　　*

1937

ప్రభూ! నీకు జయము కలుగుగాక! సర్వవిఘ్నములను జయించి విజయము నొందిన విజయవంతా: నీకు జయము జయము! నీ కార్యమునకు మా అంతర్యమున నున్న దేదియు ప్రతిబంధకము గాకుండునట్లను గ్రహింపుము!

*　　　*　　　*

1938

ఓ ప్రభూ! మే మాంతరంగికముగ నుపలబ్ధి నొందునట్లనుగ్రహింపుడు. ఓ పరమసిద్ధి ప్రదాతా! ఈ నూతన సంవత్సరారంభమున నున్న మేము నీకు సాష్టాంగ నమస్కార మొనరించుచున్నాము.

*　　　*　　　*

1939

ఈ సంవత్సర మాధ్యాత్మిక రీత్యా పరిశుద్ధమైన దగును, ఓ ప్రభూ! దైవ కార్యమునందలి భా^స్వాములైన కార్యకర్తలెల్లరును దివ్యకర్మల ద్వారా పవిత్ర మగుటకును, అహంకారము నుండి విముక్తి నొందుటకు నిన్ను వేడుకొనెదరు.

*　　　*　　　*

1940

ఇదియొక మౌనము అంతర్ముఖము నొందుటకు నిరీక్షించు సంవత్సరము...

భగవానుడా: నీ యేకమాత్ర కృపలో మేము సర్వాధారములను బడయుదుముగాక!

*    *    *

1941

అసుర, దైవవిరోధ శక్తుల ఆక్రమణచే భయాస్పదముగ నున్నను ఈ జగత్తు ఆధ్యాత్మిక జీవన రక్షణార్థము సమరము సలుపుచున్నది.

ఓ ప్రభూ! నీ మహిమ లీపృథ్వీతలమున అభివ్యక్త మగుటకు, మేము నీ శూరవీరుల మగుటకు ఆకాంక్షించు చున్నాము.

*    *    *

1942

నీకు జయము కలుగుగాక! శత్రుంజయా: నీ విజయముతో భాగస్వాము తుదివరకు ఓర్పుతో నుండుటకు వలయుశక్తిని మా కనుగ్రహింపుడు.

*    *    *

1945

మానవులు తమ అంతర్దేశీయ వ్యవహారములలో గూడ సంపూర్ణముగ సత్యపరాయణులగు నంతవరకు ఈ పృథ్వి సజీవమైన శాశ్వతశాంతిని పొందజాలదు.

ఓ ప్రభూ: మేమిటువంటి సత్యపరాయణతకోస మాకాంక్షించుచున్నాము.

*    *    *

1946

భగవానుడా! మేము కోరునది నీ శాంతియే కాని వ్యర్థమైన దాని ఆభాసము కాదు; నీ స్వతంత్రతయే కాని దాని ఆభాసము కాదు. నీతో ఏకత్వమే కాని ఏకత్వము యొక్క ఆభాసము కాదు; నేడీ మహీతలమున రాజ్యము చేయుచున్న అనృతాంధకార దంభములను శాసించగలుగునది ఏకమాత్రమైన నీ శాంతి, స్వతంత్రత, మరియు ఐక్యత మాత్రమే!

ప్రభూ! నీ విజయము కొరకై సాహసముతో యుద్ధమొనర్చి కష్టముల

కెవరోర్చిరో వారలావిజయ వాస్తవిక పరిణామము నీ జగత్తులో స్థాపితమొనర్చునట్లును నీ జయము నుపలబ్ధి నొందునట్లు అనుగ్రహింపుడు.

*　　　　*　　　　*

1947

ఈ క్రింద కనబరచిన సందేశము ప్రార్థనకాదు. ఇది కేవల మొక ప్రోత్సాహము మరియు దాని వ్యాఖ్యానము:—

చెడునుండి మిగుల హానికరమైన పరిస్థితులకు దారితీయుక్షణము సంప్రాప్తించిన సమయముననే ప్రధానమైన విశ్వాసముతో భగవత్కృప మనలను వీడదను సద్భావనము పెంపొందించుకొనవలయును.

ఉషఃకాలమునకు ముందు ఘడియలెల్లప్పుడును గాడాంధకారమయమే!

స్వతంత్రము వచ్చుటకు మునుపు దాస్య మతి దుఃఖదాయకమైనది.

అయితే, ఏ శ్రద్ధాసక్తమైన సనాతన ఆశాజ్యోతి హృదయమున వెలుగుచుండునో అందు నిరాశకు, నిరుత్సాహమునకు తావులేదు.

*　　　　*　　　　*

1948

పురోగమించుడు! నిరంతరము పురోగమించుడు!

సొరంగాంతముననే వెలుగుండునది......నీ

యుద్ధాంతముననే విజయము సంప్రాప్తమగునది.

*　　　　*　　　　*

1949

ప్రభూ! ఈ నూతన సంవత్సరారంభమున నేనేమి చెప్పవలయునో దానిని గూర్చి నిన్నడిగితిని. నీవు నాకు రెండు విరుద్ధమైన సంభావ్యములను జూపి, మౌనముగా నుండుమని ఆదేశించితివి.

*　　　　*　　　　*

1950

మాట్లాడకుము—కర్మచేయుము

ప్రకటన సల్పకుము— ఉపలబ్ధి నొందుము

*　　　　*　　　　*

1951

భగవానుడా! ఈ ధరాతలమున నీ కార్యమును రూపాంతర మొనర్చుటకే యున్నారము. అదియే మా ఏకమాత్ర సంకల్పము; ఏకమాత్ర చింత. అదియే మా యేకమాత్ర కార్యముగా నుండునటుల మా సమస్తకర్మ లీ ఏకమాత్ర ఉద్దేశ్యమునకే పెంపొందుటకు సహాయాత్మకముగ నుండునటుల, వరమును దయచేయుడు.

* * *

1952

ఓ ప్రభూ! మాకుగల శ్రద్ధ యెటువంటిదోనని పరీక్షింప నిశ్చయింతివి. మా సత్యసంధతను, హృదయపూర్వకతను నీ గీటురాయిపై ఒరపెట్ట నిశ్చయించితివి.

అగ్నిపరీక్షలో గూడ ఘనతరముగను, పవిత్రులుగను వెలుపలకు వచ్చునట్ల నుగ్రహింపుము.

* * *

1953

ప్రభూ! మీరే ఈ విధముగ ఆదేశించితిరి.

'అపజయమని భావించకుము. పట్టువిడువకుము. అంతయు గోల్పోయిన సమయముననే అంతయు సంరక్షింపబడును.

* * *

1954

ఓ నా ప్రభూ, ఈ సంవత్సరమున ఎల్లరకు మీరొసగు సలహా ఇచటనే యున్నది:—

'దేనిని గూర్చియైనను దంబములు పలుకకుము, నీ కార్యాచరణమే నీ కొరకు మాటాడనిమ్ము"

1955

దైవసంకల్పము ముందు మానవ సంకల్పమేపాటి! మనముద్దేశ్య పూర్వకముగ మనలను దైవసాన్నిధ్యమున సమర్పించుకొనెదము రండు. అంతమున విజయము తథ్యము.

* * *

1956

గొప్ప విజయములన్న పట్టి శబ్దముతో గూడుకొనియున్నవి కావు. నవప్రపంచ నిర్మాణమునకు సూచన కేవలము భేరీనినాదము కాదు.

* * *

1957

చెఱుపున కతీతమైన శక్తి యొకటియే విజయము చేకూర్చునది. హింసకు గురియైన దేహముగాక, మహిమాన్వితమైన శరీరమే ప్రపంచము నుద్ధరించునది.

* * *

1958

ఓ ప్రకృతి మాతా! భూమాతా! నీవు సహాయ మొనర్చెద నంటివి. ఈ సహాయము యొక్క భవ్యమహిమ కంతులేదు.

* * *

1960

తెలిసికొనుట మంచిది.

జీవించు టంతకన్నా మంచిది.

స్వారాజ్యమే పరమసిద్ధి.

* * *

1961

అద్భుతానందమయ జగత్త్రీ ధరాతలమున అవతరించుటకు మనపిలుపునకు నిరీక్షించుచు మన ద్వారముల కడ వేచియున్నది.

* * *

1962

పరిపూర్ణత నొందుటకు తృష్ణ మనకు గలదు; కాని దివ్యపరిపూర్ణత కద్దుపచ్చు అహంకార జనితమైన మానవసంబంధమైన పరిపూర్ణతకు గాదు.

* * *

1963

దైవ ముహూర్తమునకు సిద్ధమయ్యెదము గాక!

*　　　*　　　*

1964

నీవు సిద్ధముగా నున్నావా?

*　　　*　　　*

1965

సత్యాగమనమునకు నమస్కారము.

*　　　*　　　*

1966

సత్యమునకు సేవజేయుదుము గాక!.

... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...

సత్యమునే అంటిపెట్టుకొని యుండెదముగాక!

*　　　*　　　*

1967

మానవులు! దేశములు! మహాద్వీపములు!
సత్యమా—అగాధమా
దీనిలో నొకదానిని కోరుకొనుడు.

*　　　*　　　*

1968

అహర్నిశముల యౌవనులుగా నుండి పరిపూర్ణత్వమును ప్రాప్తింప జేసికొనుటను మానకుము.

*　　　*　　　*

1969

చెప్పుటకాదు; చేయుటయే.

*　　　*　　　*

1970

ఈ జగత్తొక గొప్పపరివర్తనమునకు సిద్ధపడుచున్నది. నీ వందులకు సహాయ మొనర్చగలవా?

♦ ♦ ♦

1971

భవిష్యాభిముఖులైనవారలు ధన్యాత్ములు!

1972

♦ ♦ ♦

శ్రీఅరవింద శతజయంతి మహోత్సవమునకు యోగ్యులగునటుల మనము ప్రయత్నించెదము గాక!

♦ ♦ ♦

ఈ సంవత్సరము (1972) శ్రీఅరవిందులకు నివేదిత మొనర్చిన శుభ సంవత్సరము.

ఆయన యుదారత్వముతో జ్ఞాన, ప్రకాశ, శక్తులనీ భువికి గొనివచ్చెను గనుక శ్రీఅరవిందుల ప్రబోధములను కేవలము తెలిసికొని తృప్తినొందక వాటి నాచరణలో పెట్టుటకు చేయు ప్రయత్నమే ఆ మహానుభావునకు కృతజ్ఞతాభివందన మొనర్చుట యగును.

శ్రీఅరవింద ప్రబోధములు మనలను ప్రకాశవంత మొనర్చి మనకు మార్గ దర్శక మగుగాక! శ్రీవారి కృపాకటాక్షవీక్షణము వలన నేడు మనము చేయలేని దానిని రేపు చేయగలుగుదుము.

మన హృదయ పూర్వకతలో ఏ మాత్రము లోపములేక సదభిప్రాయ ములతో నిండిన వాస్తవికముగా ఇది మంగళమయ నూతన సంవత్సరము.

♦ ♦ ♦

1973

మానవ చైతన్యమున కతీతమైన వాక్కు కతీతమైన ఓ పరమ చైతన్యమా!

ఓ అద్వితీయ సద్వస్తూ! దివ్యసత్యమా!

♦ ♦ ♦

## మాతృవాక్కులు

తెల్లగులాబీలు:—మాతృశ్రీ "తెల్లగులాబీలు" అన్న లేఖలను రచించి ప్రశాంతతను కోరువారికి వాని సౌరభమును వెదజల్లిరి. ఈ లేఖావళిలో కొన్నింటిని మాత్రము నేనిందు పొందుపఱచుచున్నాను-"

నా యాశీర్వాద ప్రేమలతో కప్పబడినవారై నా యాశ్రయమందు సురక్షితముగ నుండుడు.

♦ ♦ ♦

అహర్నిశముల సత్యమునే జ్ఞప్తియం దుంచుకొనెదవు గాక!

♦ ♦ ♦

దైవానుగ్రహము హృదయపూర్వక ప్రార్థనల నాలకించును.

♦ ♦ ♦

నీవు తారుమారు గాకుండ నుండునటుల నేనెల్లప్పుడును నీకు సహాయకారిగా నుందును. నీవు శాంతియుతముగ నుండినచో దానిని నీవనుభవింతువు.

♦ ♦ ♦

దైవానుగ్రహమునందు విశ్వాసమును గలిగి యుండుము. ఎన్ని యాటంకములు కలిగినను అది నిన్ను నిజమైన గమ్యస్థానమునకు జేర్చును.

♦ ♦ ♦

ఈర్ష్యయనునది జడమై విషపూరితమై యాత్మకు ప్రాణాంతక మగును.

♦ ♦ ♦

దైవ కటాక్షము, దైవప్రేమ నీతోనున్నవి. వానిని త్రోసిపుచ్చకుము.

♦ ♦ ♦

భగవానుని దయ యనంతమైనది.

♦ ♦ ♦

దైవాన్వేషణ—దైవము నుపలబ్ధి నొందుట ప్రధానమైనవి.—ఇక మిగత దంతయు నట్టిదే.

*　　*　　*

దైవ కటాక్షము స్పష్టముగ నున్నతటి, నిరాశకు చోటివ్వకుము.

*　　*　　*

దైవము నీలో మూర్తీభవించి నిన్ను మంచితలంపులచే నింపుగాక!

*　　*　　*

నిశ్చయమన్న సూర్యుడు నీ హృదయాంతరమున ప్రవేశించి యన్నిటను నీకు సులభమగునట్లొనర్చుగాక!

*　　*　　*

ప్రకృతి తన ఎత్తైన వృక్షముల ద్వారమున నాకాంక్షించును.

1971 వ సంవత్సరములో మాతృశ్రీ సాధనాసంపత్తికి వలయు మణిపూసల వంటి వాక్కులను కొన్నింటిని నుడివిరి. అందులో కొన్నింటిని మాత్రమిందు రచించుచున్నాను.

నూతనశక్తుల యావిర్భావమునకు పరిణామము వికాసము చెందుచుండుట వలన పురోగమించు వారలకిది యసాధారణమైన మంచి తరుణము; దివ్యశక్తి చైతన్యములవైపు వికాసము చెందుట కిది యద్భుతమైన, ప్రధానమైన సదవకాశము.

*　　*　　*

మానవుని యునికికి మూలకారణము దైవాన్వేషణలో కలిగెడి యానందము మరియు దైవముతో నైక్యమగుట. దానివి నీవు సమగ్రముగ నెఱిగినచో కష్టముల నుండి గట్టెక్కుటకు వలయు శక్తిని పొందుటకు సిద్ధమయ్యెదవు.

*　　*　　*

బాహ్యవిజయమున కన్న అధఃప్రకృతిని జయించినచో అగాధమైన యంతు లేని యానందము నీకు చేకూరగలదు.

*　　*　　*

ఈ ధరాతలమున భవిష్యత్తు గొనివచ్చుచున్న కొన్ని యద్భుతములను

శ్రీఅరవిందులు వ్యక్తపరచి అందులకై సంసిద్ధులగుటకు మనలను ప్రోత్సహించినారు.

♦ ♦ ♦

ప్రతియొకరికిని అహంకారము కలదు; వారిలో వారలకు సంఘర్షణ కలుగుచున్నది. అహంకారమును వీడినచో నీవు ముక్త పురుషుడ వయ్యెదవు.

* * *

ఈ జీవిత కష్టసమయములలో ప్రతియొకరును అహంకారమును వీడి ఆత్మార్పణ మొనర్చుటత్యవసరమై యున్నది. తరువాత నీవు చేయవలసిన కర్తవ్యమును భగవానుడు నీకు తెలియజేయును.

* * *

దైవసాన్నిధ్యమున లేకున్న, జీవితము భరింపరానిదైన క్షణ మాసన్నమగును. నిన్ను నీవు సంపూర్ణముగ దైవమున కర్పించుకొనుము. నీవు దివ్యజ్యోతిలోన ప్రవేశింతువు.

* * *

భగవానునితో నొక క్షణికపు సచేతన సంయోగ మనేకదుర్ఘటనలను రూపుమాపును.

* * *

నిశ్శబ్దతలోనే దివ్యజ్ఞానము పొందనగును. నిశ్చలతలోనే ఘనతరమైన కార్యము కూడ జరుగును.

* * *

నిశ్చలముగ నుండుట నేర్చుకొనెదము గాక: అట్టితటి. భగవానుడు మనలను వినియోగించుకొనును గాక:

* * *

మన చేతననుండి నిరుత్సాహమును త్రోసివేసినచో మనము ముందంజ వేసినవారమగుదుము.

దైవానుగ్రహములో నమ్మకము సిద్ధింప జేసికొన్నప్పుడే అథశ్చేతనలో నిరుత్సాహమును జయింప గలుగుదుము.

*　　　*　　　*

మానవ జీవిత విధానమును గూర్చి శ్రీజనని ఇట్లు వివరించిరి:—

వారి వారి జీవితానుసరణను బట్టి మానవులను నాల్గు తరగతులుగ విభజింప వచ్చును.

1. తమ కొఱకై జీవించువారలు; అనగా కేవలము స్వార్థపరులై జీవించుట—మానవాళిలో సాధారణముగ పలువురు తమకొఱకై జీవించువారలుగ నుందురు.

2. ఇతరులను ప్రేమించి వారి కొఱకై జీవించువారలుగా నుందురింకొక వర్గమువారు. దీని ఫలితము ప్రేమించినవానిపై ఆధారపడి యుండును.

3. మరియొక వర్గమువారలు మానవసేవకు తమ జీవితముల నంకిత మొనర్చి, కర్మాసక్తులై తమ కొఱకుగాక యితరుల కొఱకు జీవించుచు ఫలాపేక్ష లేక పరోపకార పరాయణులుగ నుందురు.

4. కడపటి వర్గమువారు:— భగవానునికి మనో, వాక్కాయ కర్మలతో సర్వమును సమర్పణచేసి కేవలము భగవానుని కొఱకే జీవించువారలుగ నుందురు. అనగా భగవదిచ్ఛానుసారము భగవత్కార్యముల నొనర్చుట.—

మొదటి మూడువర్గములలో జీవితము బాధలతోను, ఆశాభంగముతోను కూడినదై యుండును.

అచలమైన సహనముతోను హృదయపూర్వకతతోను దైవము ననుసరింతు వేని, నాల్గవవర్గపు జీవితములో తేజోవంతమైన శాంతి, సంపూర్ణసిద్ధి నీకు కలుగును.

*　　　*　　　*

దైవమునకు సంపూర్ణముగ సమర్పణ గావించినచో, వ్యక్తిగతేచ్ఛ, నిర్ణయ శక్తి, యిత్యాదుల నభివృద్ధి నొందించు టవసరమా కాదా? ఇవి అడ్డంకులు గావా? అని యొకరు ప్రశ్నింపగా తల్లిగారిట్లు వారికి ప్రత్యుత్తర మొసగిరి:—

సాధారణమైన యమాయకత్వములో, అజ్ఞానములో, భ్రాంతిలో నుండు వారలకు వ్యక్తిగతేచ్ఛ మరియు నిర్ణయశక్తి యిత్యాదు లవసరము.

అయితే, దైవమునకు వాస్తవముగ సమర్పణ చేసికొనుట యన్న, వానిని మనము విసర్జించవలయును. దురదృష్టవశాత్తు పలువురు తాము దైవమునకు సంపూర్ణముగ సమర్పించుకొన్నామని భ్రమలో నుండి, దైవసంకల్పమును తెలిసికొనుట కాటంక పరచెడి యహంకార మటులనే పెంపొందించుకొనెదరు. అటువంటి వారలు వ్యక్తిగతేచ్ఛను, వివేకమును త్రోసిపుచ్చినచో వారలసంగతులై, చపల చిత్తులగు ప్రమేయము గలదు.

తనను తాను మోసపుచ్చుకొనకుండుటకై ప్రప్రథమమున పరిపూర్ణమైన హృదయ పూర్వకత నలవరచుకొనవలయును. దైవమే వాస్తవికముగ తనకు మార్గదర్శకుడై తనను నడపించు చున్నాడన్న నమ్మకమును గలుగజేసికొన వలెను.

♦ ♦ ♦

ధైర్యము:— ప్రేమ

నీచత్వము:— స్వార్థపరత్వము

ఘనత:— ఔదార్యము

ఈ గుణములను గూర్చి శ్రీజననిట్లు వివరించిరి:—

ధైర్యము:— భయమింటుకయు లేకుండుట ధైర్యమనబడును.

ప్రేమ:— ఫలాపేక్షలేక త్యాగముచేయుటయే ప్రేమ.

నీచత్వము:— తనకులేని సుగుణములను ఇతరులనుండి కోరు బలహీనతయే నీచత్వము.

స్వార్థపరత్వము:— ప్రపంచమధ్యమున నుండి తన తృప్తికొఱ కంతయు తనకే గావలయునని కోరుటయే స్వార్థపరత్వము.

ఘనత:— వ్యక్తిగతమైన గణనను నిరాకరించునదే ఘనత.

ఔదార్యము:— ఇతరుల తృప్తియే తనతృప్తిగా నెంచుకొని సమాధానపడుటయే యౌదార్యము.

♦ ♦ ♦

## ఏకైక మార్గము

ప్రపంచమంతయు నసత్యముతో గూడియున్నది కాన, అందుండి యుద్భవించు కార్యకలాపములన్నియు నసత్యదూషితములే యగును. ఈ పరిస్థితి యెక్కువ కాలముండి జనులకును, దేశమునకును కష్టదశ సంప్రాప్తింపజేయును.

ఇట్టి క్లిష్టపరిస్థితులలో హృదయపూర్వకముగ భగవనుని ప్రార్థింపవలయును. అదియొక్కటియే మనలను గాపాడునది. దీనినెవరైతే తెలిసికొందురో, వారలు సత్యముకొఱకై నిలువబడి సత్యములోనే పనిజేయవలయును.

ఇదియే యత్యంతావశ్యకమైన ఏకైక మార్గము. పరిస్థితులు మన కనుకూలముగ లేకపోయినచో నవి ప్రస్తుతమున జరుగు ద్రోహకృత్యములవలననే యని మనము భావించవలయును. ఐనను సత్యమును విడనాడకూడదన్న దృఢనిశ్చయముతో నుండవలయును. ఇది ఏకైక మార్గము.

♦ ♦ ♦

## సత్యమును దెలిసికొని దాని ననుసరించుట

సత్యమును బాటించు దృఢ నిశ్చయము జనులకు లేకున్నచో బాహ్యముగ వారికి నేనేమియు చేయజాలను.

సత్యమును దెలిసికొనవలయునన్న, కోరికలను త్యజించవలయును. సత్యము నాకాంక్షించ గోరుదువేని నిశ్చలముగ నుండుటత్యవసరము.

o o o

# 23

## అరవింద నగరము

ఒక నూతన ప్రపంచమును, అతీతమానవులను చైతన్యవంతము గావించుటకే శ్రీజనని యవతరించినది! మానవులు సౌఖ్యముగను, శాంతియుతముగను జీవించుటకొరకు నగరమును శ్రీజనని సంకల్పించిరి. అదియే అరవిందనగరము. ఈ నగరము సౌందర్యమునకును, సంస్కృతికిని, పరిశోధనకును నిలయము.

1969 వ సంవత్సరములో మే నెల 31 వ తేదీన అరవిందనగర నిర్మాణమును గూర్చి శ్రీఅరవిందులతో మూడుఘంటల పర్యంతము సంభాషించిరి. ఆ విషయమును గూర్చి ఆమె నుడివిన దివ్యవాక్యముల నేనిట విపులీకరించుచున్నాను.

"మొన్నటి దినము రాత్రి సుమారు మూడు ఘంటల పర్యంతము నేను (తల్లిగారు) శ్రీఅరవిందుల సాన్నిధ్యమున గడిపితిని. అరవిందనగరము (Auroville) లోని విశేషములన్నియు ఆయనకు జూపితిని. ఎంతానందకరము! అచ్చట ఆటలు, కళ, వంటచేయుట యిత్యాదులుండినవి. అయితే అన్నియు సాంకేతికప్రాయము మాత్రమే! ప్రకృతిసౌందర్య దృశ్యముల ముందు నేను నిలుచుకొని, యొక బల్లమీదన్నియు వివరించితిని. ఏ పద్ధతి ననుసరించి వ్యాయామము జేయబడునదియు సాకల్యముగ వివరించు చందంబున ఆయన కన్నియు వివరించితిని. అది స్పష్టముగ, సరిగా నుండినది. పరికించి చూడ, ముందు నిర్మాణము కాబోవు దాని నిజస్వరూపముకన్నా మిక్కిలి చిన్నదైన ప్రతిమను నిదర్శనముగ జూపునటులుండెను. చదరంగమున పావులను జరుపు విధానమున, నేను జనులను వస్తువులను కదలించుచుంటిని. అది నాకు చాల సంతోషకరముగ నుండెను. శ్రీవారు కూడ యానందించిరి. ఆయన నిర్మాణపద్ధతులను సంగ్రహించి పెట్టుచుండిరి. అచ్చట కళ కడు రమణీయముగ నుండినది. ఆ రమణీయత, యా గృహనిర్మాణ విధానము వర్ణింప నా తరమా! వంటశాల

బహు ఉల్లాసకరముగ నుండినది. ప్రతియొకరును తమ నూతన పరిశోధనలను గూర్చి నాకు జెప్పుచుండిరి. అదియు రాత్రిసమయమున మూడుఘంటల పర్యంత మిట్లు జరిగినది. ఎంత బ్రహ్మాండముగ, రమణీయముగ నుండినది!"

స్వకీయమైన యీర్ష్యలు, సాంఘికాచారములు, పరస్పర విరుద్ధమైన నైతిక విలువలు, కలహకారణమైన మతములు — ఇత్యాదుల నుండి విముక్తులై, మునుపున్న బానిసత్వము నుండి విడినది, అభివ్యక్తమగుటకు సిద్ధముగనున్న దివ్యచేతనకు, సాధనచేయుటకును, ఆకాంక్షించుటకును, సర్వమానవకోటి యీ భూతలమున, సౌఖ్యముగ సుఖశాంతులతో జీవించుటకొక ప్రదేశ మత్యంతావశ్యమైనది. సత్యమునకు సేవచేయుటకును, సత్యాన్వేషకులకును, అరవిందనగర మనువైన ప్రదేశము: శ్రీజనని వరప్రసాదము:

అరవిందనగరమును గూర్చి తల్లిగారీ విధముగ నుడివిరి: —

అరవిందనగర మతీతమానవులకు పుట్టినిల్లు.

♦ ♦ ♦

అరవిందనగరమొక యంతర్జాతీయ నగరము. ఇందు సైన్యము లేదు; కావలివాండ్ర పటాలమే దీనిని సంరక్షించును. దీని భారమును సామునేర్చినవారే వహింతురు.

♦ ♦ ♦

ధనమనిన ధనమును ప్రోగుచేయుటగాదు. నూతన సృష్టికొఱకు పృథ్విని సంసిద్ధము చేయుటయే!

o o o

వ్యక్తిగతమైన ఆస్తులనుండి విముక్తినొంది యానందము ననుభవింపగోరువారలకు అరవిందనగర మొక యాదర్శవంతమైన ప్రదేశము.

o o o

బలహీనతతో గూడిన యీ ప్రపంచమునకు సంబంధించిన మానవులేకదా అరవిందనగరమున వసించునది! వారికి కష్టములుండవని మీరెట్లు భావించెదరని యొక సాధకుడు శ్రీజనని నడుగగా ఆమెగారిట్లు ప్రత్యుత్తర మొసగిరి: —

"అచ్చట నున్న మానవులు కష్టములు వలదని నుడువుచున్నను వారి యాంతరంగిక సత్తాలో వారు కష్టముల నపేక్షించుచుందురు. అయితే, ఆత్మ సమత్వమును సాధనచేయుటను, వాస్తవికముగా శాంతిని ప్రేమించుటను మనము వారికి బోధింప ప్రయత్నించెదయు గాక! బిచ్చగాండ్రు భిక్షాటనము చేయుట కచ్చట సాధ్యపడదు. ఒకవేళ బిచ్చగాండ్రెవరైన నచ్చటికి వచ్చినచో వారచ్చట నుండి వెళ్ళవలసివచ్చును; లేక వారు వైద్యశాలలో చికిత్సజేయబడి,పనిచేయుటన్న యానందమును బొందినవారగుదురు."

ఆశ్రమాదర్శమునకును, అరవిందనగరాదర్శమునకును, ముఖ్యమైన భేదమేమియని యొక సాధకుడు తల్లిగారిని ప్రశ్నించగా జననియిట్లు సమాధానము నొసగిరి:—

యోగవిషయమునందు భేదమేమియు లేదు. దైవమునకు సేవజేయువార లకును మానవప్రగతికి తోడ్పడువారలకును అరవిందనగరమున ప్రవేశముగలదు.

* * *

అరవిందనగరము సత్యచేతనను పెంపొందించు కొఱకేగాని కోరికలను దీర్చుకొనుటకు మాత్రముసాధనము కాజాలదు.

* * *

అన్నిదేశప్రజలను శాంతియుతముగ, ప్రగతినొందిన సామరస్యముతో నివసించుటకుగాను అరవిందనగరము నిర్మింపబడినది. ఇది ప్రపంచనగరముగ వెలయుచున్నది. అరవిందనగర నివాసు లన్ని మతములు, రాజకీయములు జాతీయతల కతీతముగ నుందురు. మానవత్వము నుపలబ్ధినొందుట అరవిందనగర యుద్దేశ్యమైయున్నది.

* * *

అంతములేని విద్యనొసగునదై, యెడతెగని యభివృద్ధి గలదై, వృద్ధాప్యము నొందని యౌవనుని వలె అరోవిల్ నగరము దేదీప్యమానముగ నుండును.

* * *

గతకాలమునకును, భవిష్యత్కాలమునకును 'అరవిందనగరము'

(Auroville) వంతెన వంటిది. అరవిందనగర బాహ్యాంతరికాన్వేషణముల సహాయముతో భవిష్యత్తు నూతనోపలబ్ధులకు దారితీయును.

* * *

అది భౌతికాధ్యాత్మిక పరిశోధనలకు నెలవై ప్రత్యక్ష మానవైక్యతకు ప్రతిబింబముగ నుండును.

* * *

అరవిందనగరము మహాయోగీశ్వరుడైన శ్రీఅరవిందుల గౌరవార్థము నిర్మింపబడినది. శ్రీఅరవిందుల తండ్రియైన శ్రీ కృష్ణధన ఘోష శ్రీవారిని 'అరు' అన్న ముద్దుపేరుతో బిలుచుచుండిరి ఫ్రెంచి భాషలో 'విల్' అనగా నగరమని యర్థము. ఇది శ్రీమాత గౌరవార్థము చేర్చబడి యీ నూతన నగరమునకు 'అరోవిల్' అన్న పేరు సార్థకమాయెను.

'అరోవిల్' పుదుచ్చేరికి సమీపమున నున్నది. ఇందు నివసించు ప్రజలు ప్రకృతి రమణీయదృశ్యములు గాంచి పులకితులగుచు, ఎక్కువకాలము శీతల తరుచ్ఛాయను ప్రశాంతముగ గడుపుదురు. వారు వనములలో పుష్ప సువాసనల నాఘ్రాణించుచు పనిచేయుచుందురు. ఇది స్వయంపోషితనగరము. ఇందొక వ్యక్తి యింతసొమ్ము చెల్లించవలయునన్న నిర్ణీత నిబంధన లెంతమాత్రమును లేవు. రాబడిని, ఉత్పత్తిని, కార్యకలాపమును బట్టి నిర్ణయము జరుగును. అధికముగా నిచ్చుటకు శక్తియున్నవాడు. తన శక్తికొలది సమర్పణ చేయవచ్చును; కొంత మాత్రమున్నవాడు కొంతయివ్వవచ్చును. బలవంతుడుగా నున్నవాడు తన బలమును ధారపోయవచ్చును. బలహీనుడు తనకు చేతనైన పనులనుచేయవచ్చును. ఇచ్చట పన్నులవిధింపులేదు. ప్రతియొకరు ధనరూపకముగనో, ధాన్యరూపకముగనో, కార్యరూపకముగనో నగరాభివృద్ధికి తోడ్పడవలయును. పరిశ్రమల నుండి వచ్చు రాబడి అరవిందనగరాభివృద్ధికై సహాయపడును. ఇచ్చట నిబంధనలు, చట్టములు ఏర్పరుపబడవు. ఈ నగరము సౌందర్యమునకు, సంస్కృతికి, పరిశోధనకు నిలయము. ఈ నగరమునకు మధ్యలో మాతృమందిరము నిర్మింపబడినది. అది నగరమునకు హృదయస్థానముగా నుండును. ఈ నగరము నాల్గు విభాగములుగా, వర్తులాకారముగ నుండును.

1. నివసించుటకు యోగ్యమైన విభాగము.

2. సంస్కృతి కొటపట్టయిన విభాగము.

3. పారిశ్రామికాభివృద్ధి కొటపట్టయిన విభాగము.

4 అంతర్జాతీయ సంస్థలకు నివాసమున కుపయోగమైన భాగము.

* * *

మనము కోరునది సత్యము.

సత్యమున కొక విచిత్రమైన పేరును గల్పించుటకు చాలామంది ప్రయత్నింతురు.

కాని, యేది యెట్లున్నను, అరవిందనగరనివాసులు సత్యమునే గోర వలయును.

ప్రాచీన, నవీన మతములను త్యజించి ముఖ్యముగా దివ్యజీవనమును గడుపు వారలే శ్రీఅరవిందనగరమున నివసించబోవునది.

* * *

అనుభవములోనే సత్యజ్ఞాన ముండునది. దివ్యానుభవము లేకున్నచో భగవానుని తెలియజెప్పుట కెవ్వరికిని సాధ్యము గాదు.

కాన, దివ్యానుభవమును సంపాదించుము. అప్పుడే భగవానుని గూర్చి మాట్లాడుటకు నీకు హక్కేర్పడగలదు.

* * *

పరమసత్యమును కనుగొని, దివ్యజీవనానుభవము ద్వారా యిచ్చట పరిశోధనలు జరుపబడునే కాని, మతముల కిచ్చట తావులేదు.

* * *

ఇచ్చట గూఢమతసాధనములతో పరిశోధన గావింపబడదు. జీవితముననే దైవమును మేము చూడగోరునది; ఈ యన్వేషణయందే జీవితము వాస్తవికముగ పరిణామము నొందునది.

* * *

# 24

## తల్లిగారి భూతదయ

కొంతకాలము తల్లిగారు పిల్లుల పెంపకమునం దతి శ్రద్ధవహించిరని యిది వరలో దెలిపియుంటిని. ఆ పిల్లుల పెంపకమును గూర్చిన విషయములను మరి కొన్నిటినిందు వివరించెదను:—

దివ్యమాతానుగ్రహము మానవాళికేగాక జడచేతనములైన వృక్షములకును, రాళ్ళకును, జంతుసముదాయమునకును లభించినది. శ్రీజనని దర్శనస్పర్శలచే ఎన్నియో జంతువులు పునీతమైనవి. శ్రీమాత జంతుప్రపంచమున కధిపతిగా కొన్ని పిల్లుల నెన్నుకొనిరి. ఆత్మసుఖత్యాగ మొనర్చెడి యాసక్తి మార్జాల జాతులలో గలదనియు, ఆడపిల్లి తన కూనలయందు జూపుశ్రద్ధ యమోఘమనియు శ్రీజనని నుడివిరి. ఇందులకు నిదర్శనముగ తమ పెంపుడు పిల్లిని గూర్చి శ్రీజననిట్లు వక్కాణించిరి:—

"నేనొక పిల్లిని బెంచుచుంటిని. మొదటిసారి యది కూనల బెట్టినది. ఆ కూనలను విడిచి వెళ్ళుట దాని కిష్టముగాదాయెను. కూనల పెంపకములో నిమగ్నమై యెప్పటివలె యాహారమును దినుట కూడ మానివేసినది. అది తన కూనలతోనుండి వాని నతిప్రేమతో పాలిచ్చిపెంచుచుండినది. ఆలోచన యనునది లేకుండ అయత్న కృతముగ ఆహార మిడుచుండినది. సహజముగనుండి, కూనలకేమైన యపాయము గలుగునేమోయని భయపడుచుండినది. అవి కొంత యెదిగిన తరువాత వానియం దత్యంతము ఓర్పువహించి వానికన్నియు నేర్ప మొదలిడినది. ఒక గోడనుండి యింకొక గోడమీద కెగురుట వానికి నేర్పసాగినది. వలయుచో ఒకటి, రెండు, పది, వందసార్లు గూడ తానెగిరివానికి జూపించుచుండెడిది. తన కూన లెగురునంతవఱకు అలసటయనునది లేక తానెగురుచు వానికి నేర్పుచుండెడిది. గోడ చివరయంచులపై నడచునపుడు క్రింద పడిపోకుండ నడచునట్లు వానికి నేర్పుచుండెడిది. రెండుగోడల నడుమ సందుండినచో కూనలు ఒక గోడనుండి యింకోక గోడపై కెగురుటకు కూనలు భయపడుచుండెడివి సందున్నదానివలన ఎగురుటకు వానికి ధైర్యము చాల

కుండెడిడి.అటువంటి పరిస్థితిలో పిల్లి యావలకెగిరి వానిని రమ్మని పిలుచుచుండెడిది. అవి కదలకపోగా మరల పిల్లి యీవలకెగిరి వానిని తన పాదములతో గొట్టుచు నాకుచుండెడిది. అప్పటికిని అవి కదలకుండెడివి. అది మరల ఎగురుచు వానికి ఎగురుట నేర్పుచుండెడిది. ఈ విధముగ నొక యరఘంట కాలమది ఎగురుట నేను గమనించితిని. అరఘంట కాలము గడచినంతనే యవి బాగుగా నభివృద్ధి గాంచినవని తెలిసికొని, చురుకైన కూనను ముందిడుకొని దానివెనుక నిలబడి తన తలతో గట్టిగ గొట్టినది. అంత సహజముగ నది యెగిరినది. ఒకసారి యెగిరినంతనే దానికి ధైర్యమధికమై మరల మరల ఎగురసాగెను."

*　　　　*　　　　*

వృక్షములు మానవులు గావలయునని యాకాంక్షించునాయని సాధకులు ప్రశ్నింపగా అందులకు శ్రీజనని ఇట్లు సమాధాన మొసగిరి:—

"వృక్షములు మానవులు గావలయునని యాకాంక్షించుట యెట్లుండుననగా; మానవుడు దేవుడు గావలయునని కోరునట్లుండును. మానవులతో బాటు జీవించు జంతుజాలము కూడ మానవులు గావలయునని కోరుట నెనెఱుంగుదును. శునకములు, మార్జాలముల వంటి జంతువులు మానవులతో సన్నిహిత సంబంధ మేర్పఱచుకొని వాస్తవికమైన యాకాంక్షను బెంపొందించుకొనినవి. నేను బెంచెడు పిల్లి, పిల్లిగా బుట్టినందు కెంతయో వగచుచుండెడిది. అది మానవజన్మకై నిరంతరము ధ్యానము చేయుచు పరితపించుచుండెడిది. దాని పద్ధతిలో నది సాధన జేయుచు పరితపించు చుండగా, ఆకస్మిక మరణము దానికి ప్రాప్తించినది. అది తన దేహమును త్యజించిన సమయమున దాని ప్రాణిక సత్తాలోని భాగము కూడ మానవదేహమైనది. సత్తా కేంద్రములో నుండిన స్వల్పచైత్యాంశము సూటిగా మానవునిలోనికి బోయినది. పిల్లియొక్క ప్రాణికములోని చేతనావంతమైన సత్తా కూడ మానవునిలోనికి బోయినది. ఇటువంటి వరుదుగ జరుగుచుండును."

*　　　　*　　　　*

ప్రేమ శాశ్వతమై సర్వత్ర వ్యాపించియుండును; అది యొకానొక దివ్యశక్తి. ప్రేమను గూర్చి శ్రీజనని ఇట్లు వచించిరి:—

"తాదాత్మ్యము వలన గలిగెడి యానందమే ప్రేమ. దైవైక్యతలో, బ్రహ్మానందములో నది భావప్రకాశత నొందించును.... ——"

ప్రేమ మానవులందేగాదు అభివ్యక్త మగునది; అది సమస్త జంతు జాలమునందును, జడ చేతనములైన వృక్షములు, శిలలయందును నభివ్యక్తమగు చున్నది. ఈ విషయమును గూర్చి శ్రీజనని బాగుగా వివరించినారు. వస్తువుల యందును, రాళ్ళయందును దైవశక్తినుండి వచ్చు నొక వింతయైన గ్రహణశక్తి గలదు. అవి శక్తులను ప్రోగుచేసికొనును. నవరత్నములు గైకొని గమనించినచో, ఆ శక్తులు క్రమముగ ప్రసరించుననియు, కొన్ని రాళ్ళు దైవశక్తితో సంబంధ ముగను, శక్తి భాండాగారముగను పనిచేయుననియు శ్రీజనని నుడివిరి. కొన్ని రాళ్ళు ముఖ్యముగా నొక జాతి రత్నమును (Amethyst) ధరించిన రక్షణ నొసగుననియు, కొన్ని రాళ్ళు భవిష్యత్తును గూడ దెలుపుననిరి. ముందు జరుగ బోవు సంఘటనలను గూర్చి రాతిపై కొందరు చదివి చెప్పెదరనియు, కొన్ని రాళ్ళు సందేశములను దీసికొనిపోవుననియు జెప్పిరి.

మానవులపై జంతువులకు గల ప్రేమనుగూర్చి వివరించిరి. విజ్ఞానవంతులు గానివారలు హృదయపూర్వకముగ భగవంతునెట్లు ప్రేమింతురో అటువంటి నిర్మలప్రేమనే జంతువులు మానవులపై గనపరచుననియు, అదియే నిస్వార్థమైన ప్రేమయనియు, అట్టి ప్రేమ శునకముల కమితముగా గలదనియు శ్రీజనని నుడివిరి. అభివృద్ధి గాంచని మనస్సు జంతువులకు గలదనియు, మానవులు తలంపులచే సతమతమౌనటుల అవి గావనియు, అప్రయత్నకృతమైన కృతజ్ఞతను మిక్కుట ముగ జూపుననియు నుడివిరి. మంచిగా నుండినచో ప్రయోజనమేమని మానవులు నూటి కెనుబది యెనిమిది సార్లు తర్కించెదరని చెప్పిరి. జంతువులకు విశ్వాసము మెండనియు, యజమాని వాస్తవముగా మంచివాడైనచో చైత్య, ప్రాణిక సత్త్వాల యొక్క శక్తులను పరస్పరము మార్చుకొనుట గలదనియు నుడివిరి. నిర్మలత్వముతో గూడిన జంతువులు అశ్వము, శునకము, గజము. ఇవి మానవులపై అత్యంత ప్రేమను బెంపొందించుకొను ననిరి.

*        *        *

మానవులతో బాటు నివసించు జంతువులు మానవులవలె సమతను గోల్పోయి వారివలె సున్నితమగుననియు, వానికి సహజ ఇంగిత జ్ఞానముండుననియు శ్రీ నని నుడివిరి, ఇందులకు తార్కాణముగ నొక ఆవును దీసికొని దాని యలవాట్లను గూర్చి వివరించిరి. ఆవును పొలమునందు విడిచినచో నచ్చట వివిధరకములైన గడ్డిపోచలుండును; కొన్ని విషపూరితమైన మొక్కలుండును. ఆవుమాత్రము విషపూరితమైన మొక్కలను ముట్టనైన ముట్టదనియు. నాలుక కొనతో మంచిదాని నేరుకొని, మిగతవాటిని త్రోసిపుచ్చుననియు. గడ్డినంతయు కోసి మంచి చెడుగును మిశ్రమము చేసి కుడితిపెట్టు తొట్టిలో వేసినచో, నది యజమాని మీద నమ్మకముతో అంతయు తినుననియు, దాని కమాయికమైన నమ్మకము గలదనియు వక్కాణించిరి. తన ముందేమి పెట్టినను తినుటకే గదా! యని అది తలచును; సహజ ఇంగిత జ్ఞానమును గోల్పోవును. సర్వసాధారణముగ జంతువులు వానికి కావలసినంత తినునేగాని యెక్కువ తినవనియు, ఆహారము మిగిలినచో దానిని ఆకొన్నప్పుడు తినుటకు దాచిపెట్టుకొనుననిరి. పెంపుడు జంతువులు యజమాని యొసగినదంతయు తినుటయేగాక వాని కందుబాటులో నున్న దంతయు తినునని చెప్పిరి.

పెంపుడు జంతువులకు సహజ ఇంగిత జ్ఞానము మృగ్యమని నుడువుచు, ఫ్రెంచిదేశమున నొక సంఘటనను గూర్చి యీవిధముగ వివరించిరి:—

"ఫ్రెంచిదేశమున నొక చిన్నగ్రామమందు నేనుంటిని. (తల్లిగారు). అచ్చట తేయాకు వ్యాపారియైన యొకడు మేకలను పెంచుచుండెను. అందులో నొకటి తిండిపోతాయెను. ఒకనాడతనికొక పీపానిండుగా బెల్లము నెవరో పంపిరి; దాని నాతడు తెరచి మూతవేయుటను మరచెను మేకలు తిరుగాడెడి ప్రదేశమునందే యాపీపా ఉంచబడి యుండెను. దానికందుబాటులో నున్నది గాన, బెల్లము బాగుండునని తలచి, ఆ తిండిపోతైన మేక నాలుకతో నాకి రుచిచూచెను. అది మధురముగ నుండుటచే తినసాగెను. తన సహజ ఇంగిత జ్ఞానమును గోల్పోయి అధికముగ తిని తుదకు మరణించెను. వన్యమృగము లట్లొనరింపవు. మానవుని సహవాసములో నది పొందిన ఫలమిదియే!"

పుష్పములకు సహితము ప్రేమగలదని శ్రీజనని నుడివిరి. రోజాపుష్పము

తన వికాసముతో సువాసనను వెదజల్లి తన సౌందర్యమును సూర్యభగవానునకు సమర్పణ జేయుననిరి. అరణ్యములందు వృక్షములు, మొక్కలు—ఇత్యాదులు సూర్యరశ్మిని పొందుటకై వాని కొమ్మలను, ఆకులను వివిధరీతుల చాచుచు నొక దానితో నొకటి పోటీపడుచుండుననిరి. మానవునికన్న వృక్షసముదాయమే వెలుగును ఆకాంక్షించుచున్నవని శ్రీజనని తెలిపిరి

# 25

## దివ్యానుభూతులు

పరిణామదశలో దివ్యపరివర్తనమును గూర్చి శ్రీమాత తెలిపిన వివరములను కొన్నింటిని మాత్ర మిందు పొందుపరచుచున్నాను:—

27వ తేదీ, నవంబరు మాసము, 1965 సంవత్సరము:—

1965 వ సంవత్సరమున, నవంబరు 24 వ తేదీన శ్రీజనని అరవింద సందేశమును గురించి యీ విధముగ వ్యాఖ్యానించిరి.

"దివ్యజ్యోతిని బలవంతముగ క్రిందికి లాగుట తప్పేయగును. అతీత మానసము ఆలజడి వలన లభించునది కాదు సమయ మేతెంచినంతనే దానికై యదియే బహిర్గతమగును:— దీనికొఱకు చేయవలసిన దెంతయో నున్నది. కాన తొందరపాటు లేక అత్యంత ఓర్పు వహించి దీనిని పొందవలయును."

ఫలితములను తక్షణమే చూడగోరెదరు గనుక జనులకు తొందరపాటెక్కువ. కొంతప్రాణిక వ్యక్తిత్వమును క్రిందికి దెత్తురుకాని అది వారి నాటకట్టించి యంత్యమున వికార విదూష్యముల పాలొనర్చును. నూటికి తొంబైతొమ్మిది పాళ్ళి విధముగనే సంభవించుచుండును.

ఒకచిన్నవ్యక్తి, యొక ప్రాణికసత్త పెద్ద నాటకమాడి గొప్ప ప్రదర్శనమిచ్చి దివ్యప్రకాశముతో నాడును. పాపము! దానిని క్రిందికి దెచ్చిన కండ్లు మిరుమిట్లు గొలుపగా అతీతమానస మిక్కడ నున్నదని చెప్పుచు ఆ బోనులో పడును.

ఎప్పుడు వాస్తవికమైన దివ్యప్రకాశమును స్పృశించెదవో, దానిని గాంచి, దానిచే స్పృశింపబడెదవో, అప్పుడు ప్రాణికమునకును, దివ్యమునకును భేదమును గుర్తించి, అది నాటకవేదికపై నుండెడి కృత్రిమ దీపపు కాంతియని తెలిసికొందువు. అట్లు భేదమును దెలిసికొనలేక పోయినవారు భ్రమింపబడుదురు — అది మిరుమిట్లు గొలుపునదిగాన ఆశ్చర్యముగ నున్నందున వారు మోసగింపబడుదురు. సత్యమును స్పృశించినపుడును దానితోడ సన్నిహిత సంబంధ మేర్పఱచుకొన్నచో నీ వానందించెదవు.

ఇది బూటకపు చికిత్సవంటిది — దీనికిని వాస్తవికమునకును భేదము తెలిసికొనుటకు ముందు నీకు సత్యమును గూర్చి తెలిసికొను టెంతేనియు అవసరము, అన్ని విషయములలోను ఇంతే.

ప్రాణికమొక అతీత నాటకరంగము వంటిది — అందు ఆకర్షణీయమైన' కండ్లకు మిరుమిట్లుగొలుపు, భ్రాంతియుతమైన, ప్రదర్శన లెన్నియో ప్రదర్శింపబడును. వాస్తవిక విషయమును గూర్చి యెప్పుడైతే నీవు తెలిసికొందువో అప్పుడు తత్క్షణమే దైవప్రేరణతో దానినిగూర్చి తర్కించక 'నాకేదియు నవసరము లే'దని స్పష్టముగ జెప్పుదువు.

అన్ని విషయములందిటులే యుండును. మానవజీవితమున ప్రేమ యనునది ప్రాముఖ్యము వహించినది. ఎటుచూచినను వాస్తవిక ప్రేమకు బదులు ప్రాణికోద్రేకములు, ప్రాణికాకర్షణలు ప్రబలినవి. స్వార్థముతో కూడినప్రేమ పొంగువంటిది, మోసకారి. వాస్తవికవస్తువును దెలిసికోలేనంతవరకు దానిని నీవనుభవింపలేవు. దానినిగురించి తెలిసికొనజాలవు. వాస్తవికప్రేమను చైత్యసత్త, దివ్యసంయోగమూలమున స్పృశించినపుడు ప్రాణికవస్తువు సుఖకరమైనదిగాక విషాదకరముగ నగుపడును.

ఎవరేమి చెప్పినను, వివరించినను ప్రయోజనమేమియు లేదు. ఇతరులకేమి సంభవించునో అటులనే నీకు సంభవింపదు. వాస్తవికానుభవము నీకు కలిగినచో ప్రాణికమంతయు ఆకర్షణీయముగగాక బూటకముగ గోచరించును.

వాస్తవికవస్తువును బలవంతముగ లాగినపుడు, పదిలక్షలమందిలో ఏ

యొకరికో నిత్యసత్యము ప్రత్యక్షమగును. బలాత్కారముగ సత్యమును లాగుట యహంకార పూరితమగును. అది యాకాంక్షయొక్క వికారమే! వాస్తవిక ఆకాంక్ష సమర్పణ మరియు ఆత్మార్పణ యుక్తముగ నున్నది. బలవంతముగ లాగుట యనిన అహమును గోరుటయే.

1965 వ సంవత్సరమున, నవంబరు, 24వ తేదీన దర్శనపు దినమునందు 'మీకేమైన ప్రత్యేకానుభవము కలిగినదా' యని సాధకులు ప్రశ్నింపగా జనని ఈ విధముగ నుడివిరి:—

"శ్రీ అరవిందులుదయము నుండియు సాయంకాలము వరకు ప్రత్యేక్షముగ నుండిరి. ఆ దినమునందొక ఘంటసేపు విజ్ఞానసృష్టికిని — మానవకోటికిని మధ్యనుండు పరిస్థితులను గురించియు, మానవకోటి స్థితిని గురించియు — వీని పరిస్థితుల ప్రత్యక్షానుభవ విశేషములను నాకు కలుగజేసిరి. అందులో నన్ను నివసింపజేసిరి. అది యాశ్చర్యకరముగను, విశదముగను, ప్రత్యక్షముగను, చైతన్యవంతముగ నుండెను. అచ్చట పూర్తిగ జంతు స్వభావముగల మానవ కోటిగాక జీవితములో సాహిత్య, కళా, ప్రాణికసామంజస్య పూర్వక మనః ప్రగతిగల మానవకోటి యుండెను. మానవకోటి ఒకానొకవిధమైన నాగరికతగల పరిసరములలో నొక విధమైన సామంజస్యము గలిగియున్నటులుండెను. అనగా మానవులేదో యొక విధమైన సభ్యతగల అభిరుచులు. నాగరికత సంస్కృతితో గూడినవారై సుఖముగా తృప్తికరమైన జీవితముతో తృప్తిపడినట్లుగా నుండిరి. ఈ కోవకు జెందిన జనులు నవ్యశక్తులు, నూతనవస్తువులు, భవిష్యత్తు జీవితము వైపునకు ఆకర్షింపతగినవారుగా నుండిరి. ఉదాహరణకు అట్టివారు మానసికము గను, బౌద్ధికముగను అరవిందులకు శిష్యులు కాగలరు. కాని. వీరు భౌతికముగ పరిణతి బొందుటకు ఆవశ్యకత కలిగినవారుగ నుండలేదు. వీరిని ఈ పరిణితి కొత్తిడి చేసినచో నది యన్యాయముగను, అపక్వముగ నుండి యుపయోగములేక వారి జీవితము కల్లోల భరితమై వారు క్రమరహితులగుదురు.

కాని, దివ్యపరిణామము నొందుటకు ప్రయత్నము చేసి సంసిద్ధులై, నవ్యశక్తుల నవతరింపజేయుటకును భౌతికము నిందుకు సన్నిహితము చేయుటకును సిద్ధముగ నున్నవారు ఏ కొందరో ఉన్నారు. దివ్యపరిణామమునకు వలయు

సాధనజేయువారలు, నూతన శక్తులను లాగ సంసిద్ధులగువారలు, భౌతికము ననుకరించువారలును, అంతరికవాక్కును వెలువరించుటకు మార్గమన్వేషించు వారలు కొందరు మాత్రమే యున్నారు. శ్రీఅరవింద యోగమును జేయుటకు సంసిద్ధులైనవారు వీరే। భవిష్యత్తున దివ్యపరిణామమునకు దారితీయునని తోచెనేని సహాయపడునేని అందుకొఱకై బాధలతో గూడిన కష్టజీవితమును గడుపుటకు సంసిద్ధులై త్యాగశీలురయ్యెదరు. అయితే, వీరితరులను తమవైపు త్రిప్పుటకు ప్రయత్నించి తమ ప్రయత్నములో ఇతరులను భాగస్వాములుగా నొనర్చ గూడదు. అట్లొనర్చుటన్యాయము మరియు మోటుతనము. అటులొనర్చినచో నది ప్రపంచగతినే మార్చివేసి, సహాయమునకు బదులు విరోధములను దెచ్చిపెట్టి తుదకు అజ్ఞానాంధకారమున అంత్యమగును.

అయితే అది చైతన్యవంతమై, వాస్తవికమై, నా యభిప్రాయముల నన్నిటిని, నేను చేయదలచిన దానినంతటిని మార్పుచేసినది. కాని, అది శాంతి, స్థిరత, నిశ్చయమైన విశ్వాసము నిశ్చయమైన మార్పు గొనివచ్చినది. మునుపుండెడి స్థితియందున్న మూర్ఖపుపట్టు, మోటుతనము, నిశ్చేతనము — అన్నివిధములైనటువంటి దుఃఖకరమైనవన్నియు అదృశ్యమైనవి. ఇందులో నంతయు సరియై యంతయు సంభవమగు నిదియొక గొప్ప ప్రపంచగతివంటి దర్శనముగ నుండినది. దివ్యపరిణామమునకుగాను చేసిన ప్రయత్నము చిన్న సంఖ్యకు తగ్గింపబడి యుపలబ్ధి కింకను ఉదాత్తముగ, శక్తిమంతముగ నగును. నూతనసృష్టియొక్క మార్గ దర్శకులుగ వీరే యెన్నుకొనబడిరేమో యన్నటు లుండెను. 'వ్యాప్తినొందించుట' 'సంసిద్ధత' అనువాని గూర్చిన తలంపులు పసితనపు తలంపులే. ఇది యొక విరామములేని మానవత్వము.

ఆహా! ఇది యెంతటి మహనీయమైన, సొగసైన, స్థిరమైన దరహాస పూరితమైన దర్శనము! వాస్తవముగ నిది దివ్యప్రేమతో నిండియున్నది; 'మన్నించు' నటువంటి దివ్యప్రేమకాదు — అటువంటి దెంతమాత్రమును కాదు. ప్రతియొకటిని దాని స్వస్థానములో అంతరంగిక గతిని సంపూర్ణముగ నుపలబ్ధ మొనర్పగలుగునది. అదియొక అందమైన కానుక.

వివేక దృష్ట్యా యివన్నియు ప్రజలకు విదితమే, కాని అనుదినాచరణయందు వారు ఇంకొక విధముగ వాస్తవిక గ్రహణముతో నుందురు. ఉన్నత స్వభావము స్పృశించినట్లుగ, దర్శించినట్లున్నది.

తరువాత మొక్కలు స్వేచ్ఛాపూర్వకముగ నుండుట, జంతువుల జీవితము సామంజస్యతతో సరియైన స్థానమున నుండుటను నేను దర్శించుట నా కెంతయో ఆశ్చర్యము కలిగించెను. వికారమైన, నీచమైన, అధమమైన గుణములు లేనటు వంటి మానవ సామ్యత కనుగుణమైన సౌందర్యము, సామంజస్యత, జీవితములో సౌష్ఠవము సౌందర్యసద్రసములతో గూడిన సౌందర్యాభిరుచులు కలిగిన సత్యమైన మానవత్వముతో గూడిన మానవకోటిని దర్శించితిని. అది శ్రేష్ఠమైన మానవ కోటిగ నుండెను. సామంజస్యత కలిగియుండినందున, మానవత్వముతో నుండి నందువలల అది పరిపూర్ణముగ తృప్తినొంది యుండినది. నూతనశక్తి ప్రసార ప్రాబల్యమువలన కాబోవు నూతన మానవకోటిని పైజెప్పిన విధముగ నూతన మానవ కోటిగ పరివర్తన మొనరించగలదని నాకు దెలిసినది. మానవకోటి, జంతు జాతుల నే విధముగ మార్పుచేసినది నా కగుపించినది. మనః ప్రాబల్యము వలన పశుత్వము కొంత మార్చినట్టు. మానవులలో గూడ స్థితప్రజ్ఞులైనవారలు కొంద రున్నారు. ఆ విధముగనే అతీతమానస ప్రాబల్యమువలన మానవత్వము భవిష్యత్తులో నున్నత గుణములు కలిగియుండుటకు వీలగుచున్నది. ఈ మార్పునునది చాలకాలము తరువాత జరుగునుగాని అతిత్వరగా జరుగునది గాదు. ఈ కాలము అవస్థా మార్పునొందు యుగసంధిగ నున్నది. ఈ పరిస్థితి బాధాయుతమై చాల కాలముండవచ్చును. ప్రయత్నము కొన్ని సమయములందు తరచు బాధాకరమైనను, నమ్మికయు, నిశ్చలతయు గలిగినందువలన ప్రతిఫలము, గమ్యస్థానము నిర్మల దృష్టితో బొందబడును. వికారములను, తప్పులను, మానసిక జీవితమునకు సంబం ధించిన వికారములను త్రోసివుచ్చుటకు శక్తి కలుగును. అప్పుడు మానవజాతి తృప్తి, సంతోషము కలిగి మానవ సౌందర్యముతో, సామంజస్యతతో నుండును.

నే నందులో నివసించుచున్నటులుండి చాల మనోహరముగ నుండినది. విరుద్ధములన్నియు అదృశ్యమైనవి. నేనీ పరిపూర్ణతలో నున్నటులుండెను. పరిపూర్ణత యెంత పొందవలయునో మానవకోటి అంతయుపొంది అతీతమానసా

దర్శము నూహించి నటులుండినది. బిగువు, సంఘర్షణ, ఓర్పులేమి — ఇవన్నియు పోయి, అన్నియు సంపూర్ణముగ నదృశ్యమై ఒకానొక గొప్ప విశ్రాంతిని గొనితెచ్చును. నూతన సృష్టికిగాను మానవ జాతిని తయారుచేయుట యన్న ఆతురత లేకపోయెను.

దివ్యపరిణామమునకు సంసిద్ధులైన వారలు, అతీతమానసోపలబ్ధినొందినవార లే కొందరో గలరు. జంతుకోటికిని — మానవకోటికిని ఎంత వ్యత్యాసముగలదో మానవకోటికిని — అతీత మానవకోటికిని అంత వ్యత్యాస ముండును. ఇటువంటి వారలు భవిష్యత్తులో నుండబోవుదురు. ఈ రెంటికిని మానవులకును — అతీత మానవులకును మధ్యభూమికలలో నుండువారలు మానవులకంటె శ్రేష్ఠులై అతీత మానసమును పొంద ప్రయత్నముచేయు నున్నతభావములు, శక్తులు కలవారుగ నున్నారు.

మానవులకు కామేచ్ఛ యుండుట సహజము మరియు యుక్తము. జంతు స్వభావము మానవునిలో నశించినపుడు ప్రస్తుత అలవాట్లు (ఆహారపానీయాదులు, నిద్ర) క్రమేణపోవును. ఇవి పోయినపుడు మైథునక్రియ నశించిపోవును. అప్పుడు ఈ మైథున క్రియవలన కలుగు ఆనందమును విడనాడి దీని కతీతముగ నుండు నిజమైన బ్రహ్మానందమును బొందెదరు. పూర్వకాలపు యోగసాధకులు కామమును జయించుటకు నిగ్రహశక్తి నలవర్చుకొనుడని యాదేశించి యందులకు ప్రాధాన్య మొసగిరి. కాని, దీని వలన పోరాటము జరిగి మనస్సు వికలతజెంది, యిట్లు చేయుట ద్వార సిద్ధికలుగలేదు. ఎప్పుడైతే చైతన్యము మానవత్వము నుండియు, జంతుస్వభావము నుండియు దివ్యతేజః ప్రభావమువలన సంపూర్ణముగ మార్పుచెందునో అప్పుడథః ప్రక్రియలన్నియు లోపించి, నశించి దివ్యత్వమును పొందుటకు సాధ్యమగును. దివ్యపరిణామమునకు సంసిద్ధులుగ లేనివారిని బలవంత పెట్టి నిగ్రహశక్తి నలవర్చుకొనమని చెప్పుట సమంజసము కాదు. నీ స్వభావమున కిది వ్యతిరేకమైనదనియు, ఇదికాదని యెప్పుడు నీవు గ్రహింతువో అప్పుడు విషయవాసనల నుండి విడనాడబడి బ్రహ్మానందమును పొందుదువు. ఆహార విషయమునందు గూడ ఈ తత్త్వమే వర్తించును. జంతుస్వభావము పోయినంతనే

ఆహారావశ్యకత గూడ పోవును. స్థూల ఆహారావశ్యకత పోయి సూక్ష్మరూపమున ఆహారమును గైకొందువు — అనగా పుష్పముల నాస్వాదించుట ద్వార ఆహారమును గైకొందువు. కాని, మానవుడింకను ఈదశ బొందుటకు సంసిద్ధుడుగ లేడు.

* * *

1972, ఫిబ్రవరి, 9వ తేది:—

"పరిపూర్ణమైన హృదయ పూర్వకత నుపలబ్ధి నొందుటకు చైత్యకేంద్రము చుట్టునున్న పరిపూర్ణసత్తాయొక్క ఐక్యత అత్యావశ్యకము."

1972వ సంవత్సరమున, ఫిబ్రవరి, 21వ తేదీన శ్రీజనని జన్మదినసందేశము పైన జెప్పిన విధముగ జెప్పి దానిని గురించి యిట్లు వ్యాఖ్యానించిరి:—

సత్తయందలి భాగ మొకటి చెప్పిన మరియొక భాగ మింకొక విధముగ చెప్పుటచే జనులలో హృదయపూర్వకత లోపించినదని. నేను గమనించగలిగితిని. అయితే శాశ్వతమైన చైతన్యమును కలిగియుండుట, యెల్లప్పుడును ఒకే చేతనతో నడుపబడుచుండుట బహుకష్టము. ఐక్యత సిద్ధించనంతవఱకు అటులనే యుండును. సంవత్సరముల పర్యంతము నాస్థితి ఒకే విధముగనున్నది. చైత్యసత్త దైవము నుండి వచ్చి యెడతెగక నాలో నున్నది. ప్రస్తుతము కొన్ని క్షణముల పర్యంతము ఐక్యతలేని చేతనానుభవమును బొందితిని. ఏండ్ల పర్యంతము రాని చైత్యసత్తా నా కిప్పుడు గలిగినది. చైత్యసత్తా సూటిగా నాయకుడై సత్తనంతటిని పరిపాలింప దొడగెను. దైవమెల్లెడల నున్నాడు. అతడు సర్వాంతర్యామి. అతడు మన సత్తలో నున్నాడని తలచిన నీవు దైవమునే అంటిపెట్టుకొని యుందుము.

ఇది నా నూతనాన్వేషణము. సత్తలో ఐక్యానుభవము లోపించినపుడు హృదయ పూర్వకత లోపించును. సత్తలో నొకభాగ మొకప్పుడు, మరియొకభాగ మింకొ కప్పుడు ఐక్యతాభావమును బోగొట్టుకొన్నచో హృదయపూర్వకత లోపించును. అనగా చైత్యసత్త భౌతిక సత్తాలోనికి ప్రవేశమొనర్చినది. ఏలన అచ్చటనే, అస్థాయి స్థిరముగ నుండునది.

భౌతికసత్తా సాధారణ సత్తాలోనికి ప్రవేశమొనర్చవలయును ఆ స్థితి నాకు ముప్పది సంవత్సరములకు పూర్వమే కలిగినది. చైత్యసత్తా యహర్నిశములు ఆ సత్తలన్నిటిని పరిపాలించుచు నడపించుచున్నది. భౌతికము కూడ దైవాజ్ఞ నహర్నిశముల నాలకించుచుండినది. నేనిక్కడకు రాకమునుపే ఆస్థితి నాకెడతెగకయుండినది. నేనాస్థితిలోనే వచ్చితిని. అప్పటనుండి నేను చలించలేదు. ఇటీవల నిమ్నచేత నానుభవము నాకు కలిగినది. ఒకనాటిరాత్రి రెండు—మూడు ఘంటల పర్యంతము నన్ను వేధించినది. చైత్యసత్త లోపించినచో నితరుల స్థితి యెటులుండునో యాస్థితి కలిగి యనుభవపూర్వకముగ నాకు తెలియజేసినది.

*   *

1972 వ సంవత్సరము, ఫిబ్రవరి 26:—

"అతీతమానసము శారీరిక మనస్సునందభివ్యక్తమైనప్పుడే దాని ప్రత్యక్షత స్థిరముగ నుండునది."

—శ్రీ మాత.

ఈ సందేశము శ్రీఅరవిందు లొసగినదే. ఐనను నేను వచించిన రీతిగా ఇచ్చట చెప్పబడినది—"స్థిరము" అన్న పదమును శ్రీవారుపయోగించిరని మాత్రము నేను నుడివితిని, అని చెప్పుచు దరహాసవదనయై, శ్రీజనని యించుకసేపు మౌనము వహించి మరల యీ రీతిగా నుడివెను.

'ఈ భౌతిక మానస శిక్షణ నేవిధముగ ఎటునుండి యలవర్చుకొనవలయునో నాకు విదితమగుటలేదు. ఇది నాకు బహుకష్టతరముగ నున్నది. కష్టతరము! కష్టతరము! ఏ క్షణమైనను నిశ్చలనీరవతను బొందుటకు ప్రశాంతముగ నీయిచ్ఛతో ప్రారంభింపవలయును. అదియే మొదటి మెట్టు సంకల్పమాత్రమున నిశ్చలత నలవర్చుకొనుట కష్టతరము గాదు. ఒక క్షణమాత్ర మేకాగ్రత గలిగియుండినచో పరిపూర్ణ నిశ్చలత్వము నాకబ్బినట్లే! ఒక క్షణమాత్రము నీవందుండి సడలినచో నీ యేకాగ్రతకు భంగము వాటిల్లినట్లే! తల్లిగారు నవ్వుచు ఇవ్విధముగ నుడివిరి;

"అది యిటు నటు చలింపజేయును చలించు అలవాటును మనస్సు క్రమముగా నిప్పుడు వదలివేయును. ఆ యలవాటునుండి యది వైదొలగుచుయును.

నా విషయములో మాత్రమది స్వతఃగా వైతొలగినది. ఎవరైన నాతో సంభాషించు నెడ, దానినుండి ఎవరైనను నన్ను హఠాత్తుగా దూరకృత మొనర్చునెడ కొంత చలనము నాలో కలుగును. అది నాకు సహజస్థితి. ఈ మధ్య రెండు—మూడు దినముల పర్యంతము నేను భగవానుని కరకమలములలో పసిపాపనై దివ్యాను భవమును బొందితిని. ఆ దివ్యసాన్నిధ్యములో నా బాధ యదృశ్యమాయెను."

* * *

1972 వ సంవత్సరము, అక్టోబరు మాసము, 25వ తేది:—

సాధకుడు తల్లిగారికి పుష్పమును సమర్పించినంతనే తల్లిగారు సాధకునికి మరల పుష్పప్రదానము చేసి, దానిని గూర్చి యిట్లు నుడివిరి:—

"అది అథశ్చేతనములోని సత్యముయొక్క శక్తి". అథశ్చేతనములోనే విరుద్ధములన్నియు కలియునప్పుడు సంపూర్ణముగా మనోవికలత్వము, నిశ్చైతన్యము, దురిచ్ఛ యిత్యాదులు కలుగును. నాలో నఖండ శాంతి యున్నది.

"ప్రభూ! నీ సంకల్పమే జరుగుగాక"యని నేను వచించుచుండగా, అథశ్చేతన్యమునుండి విజృంభించు కల్మషములను రూపుమాపుటకు, ఊర్ధ్వము నుండి దివ్యశక్తియొక్క యొత్తిడి కలిగెను. నా చైతన్యములోనే ప్రపంచ యుద్ధము జరుగుచున్నదేమో యన్నటులుండెను. ఇప్పటి నా స్థితిలో భగవానుని మరచుట గొప్ప యాపదగా భావించుచున్నాను"

అని శ్రీజనని నుడువగా సాధకుడు తనలో గూడ నెడతెగక పరిశుద్ధత జరుగుననెను. అంత శ్రీజనని యిట్లు నుడివిరి: 'ఇది యొక వ్యక్తికి జెందినది గాదు. ఇది పృథ్వియొక్క యథశ్చేతనము, యిది తీరనిది. దీని నాపివేయుటన్న కర్మమును నిలిపివేయుటయే! దీనిని కొనసాగించుటన్న కొంతవ్యవధి తీసికొనును. ఇది యంతులేనిది, ఏకత్వమనునది. శూన్యమన్న భావము గలిగియుండుటకు నా ఏకైక సాధన శాంతియుతముగ నుండుటయే! ఇదొక్కటే మార్గము! దైవమే పోరాటము సలుపును.

* * *

1972వ సంవత్సరము, నవంబరు, 8వ తేదీ:—

"కొన్ని క్షణముల పర్యంత మతీతమానస శక్తి నన్నావరించినది. ఎంతా శ్చర్యము! ఆ యతీతమానసము ననుభవించినచో వేరే విధముగ జీవింపవలయునని మనమనుకొనము. ఆ మార్పు బహుప్రయాసతో గూడినది, ఆ చేతన యత్యాశ్చర్యకరమైనది. కాని యది క్షణికముగ నుండిన"దని శ్రీజనని నిర్వచించిరి.

# 26

## ఆరాధ్య దేవత

విశ్వాధ్యాత్మిక చరిత్రలోని ప్రధానాంశ మేమనగా, ఈ విశ్వమునకు ఆరాధ్య దేవతయైన మహాశక్తిస్వరూపిణియైన జగన్మాత పృథ్వీతలమున నవతరించుటయే. ఈ విషయమును శ్రీఅరవిందులు తాము రచించిన 'సావిత్రి'యను మహాకావ్యమున వ్యక్తపరచిరి. ఇందు అశ్వపతి జగన్మాతావిర్భావము కొఱకై యామె నివ్విధముగ ప్రార్థించెను:—

'ఓ జ్ఞానప్రకాశమా! విశ్వమాతా!
సృష్టికర్త్రీ! నిత్యకళావదూ!
నీ సజీవాకృతి నించుక యీ ధరాతలమునం దవతరింపజేయుము!
నీ యనంతత్వ మొక శరీరమునందు వెలింపుము!
ఈ విశ్వమందు మర్త్యపాదములతో నడక సాగించు అమృతమయీ!
ఉచ్ఛ్రేయములనుండి యొకమహత్తైన వాక్కును బలుకనిమ్ము!
ఒక ఘనతర చర్యచే విధికవాటములను తెఱవనిమ్ము!

నీ మధురత్వమును నాకును, విశ్వమునకును, మానవులకును బ్రసాదింపుము!
అని యిట్లు అశ్వపతి ప్రార్థించగా జగన్మాత ఆయనకు సాక్షాత్కరించి యివ్విధముగా బల్కెను.

"ఓ ఘనతరమార్గదర్శకుడా! నీ యార్తనాదము నాలకించితి!
ఒకతె పృథ్వీతలమున నవతరించి నికృష్ట బంధములను తెగటార్చును;
"విశ్వగతిని ఏకైక ఆత్మశక్తితో మార్పునొందించును."
"అద్భుత శక్తిసామర్థ్యము లెల్ల ఆమెతో చేరును;
భువిపై సౌందర్యరాసులెల్ల స్వర్గతుల్యముగ దివ్యంబులై సంచరించును;
మేఘావృతంబగు ఆమె కురులందును దేహమందును ఆనందము నిదురించును;

వృక్షమునుండి ప్రసవించు నినాదము వోలె, అమర ప్రేమ తనదు మహిమాన్వితమగు రెక్కలను చరచు; వీరుని ఖడ్గమువోలె శక్తి ఆమెతోడనే యుండును; ఆమె నయనద్వయము శాశ్వతానందమునకు నిలయము."

"సవిత" యనగా వెలుగునకు మూలాధారము. అట్టి వెలుగుచే జన్మించినది గావున అశ్వపతి పుత్రికకు 'సావిత్రి' యని సార్థకనామకరణ మొనర్చెను; భగవతి సావిత్రి అశ్వపతికి పుత్రికగ జన్మించుట కెట్లంగీకరించెనో యట్లే శ్రీజనని అతీతమానసమును ఈ పృథ్వీతలమునకు గొనివచ్చుటకై చేయు ప్రయత్నము నందు శ్రీఅరవిందులకు దోడ్పడుటకై యరుదెంచిరి. లోకబాంధవుడైన సూర్యభగవాను డుదయించి ప్రపంచమున కెట్లు వెలుగును ప్రసాదించుచున్నాడో అట్లే యాధ్యాత్మిక జీవనవికాసము జెందువారలకు శ్రీజనని వెలుగును ప్రసాదించు చున్నది.

శ్రీజననికి బాల్యమునుండియు నాధ్యాత్మికానుభవములు గలుగు చుండినవి. ఆ యనుభవములు పృథ్వీతలమునందు దైవయథార్థతను స్పష్టపరచుటయే గాక, మానవుడు మనో, వాక్కాయ కర్మలతో దివ్యజీవనము నడపుచు నుపలబ్ధినొందినచో దైవమునందైక్య మొందునని స్పష్టపఱచినవి. మిరాంబ 1914 వ సంవత్సరమున శ్రీఅరవిందులను సందర్శించిరి. తరువాత భారతదేశమున స్థిరనివాసమేర్పఱచు కొనిరి. మాతృశ్రీ యరుదెంచి శ్రీఅరవిందులను గురువుగా స్వీకరించి యాయన సేవా భాగ్యములో నిమగ్నమైరి. 1922 వ సంవత్సరము నుండి ఆశ్రమ బాధ్యత యెక్కువగా వహించిరి. జీవితమంతయు యోగమనియు, దైవము నే విధముగ నుపాసింతురో యావిధముగ కర్మలను జేయుడన్న నిత్యసత్యమును తామాచరించి యెల్లరకు మార్గదర్శినియైరి.

శ్రీజననిని గూర్చి శ్రీఅరవిందులు 'మాతృశ్రీ' యను గ్రంథమున నిట్లు వక్కాణించిరి:—

"మనము పూజించు మహాతల్లి జగత్తునంతటిని పరివేష్టించు చైతన్య శక్తియే! ఈమె యేకము అనేకమునై యున్నందున ఈమె గమనముల ననుసరించుట మహామేధావులకును, వివేచనాపరులకు కూడ అసాధ్యముగ నుండును. శ్రీజనని పరమాత్మయొక్క చైతన్యము శక్తియునై తాను సృష్టించు దానికంతకును అతీతముగ నున్నది."

"పృథ్వీచైతన్య మతీతమానసమును బరిగ్రహించుటకు జనని శరీరము దాల్చుట యవకాశమై యది పరివర్తన మొందుటకు అవసరముగనున్నది. ప్రథమ పరివర్తన మొందుటకు వీలుగనున్నది."

జనని శ్రీఅరవిందులకు తాము పూజించుచున్న శ్రీకృష్ణునిగా గుర్తించి యాత్మార్పణ మొనర్చగా, మనో, వాక్కాయ కర్మలతో సమర్పించుకొన్న ఆమెను సర్వశక్తిస్వరూపిణిగ శ్రీవారు రూపొందించిరి. మహాశక్తియైన మాత యొక్క వాస్తవిక దివ్యరూపమును మనమేల గాంచలేకున్నామని మన మనుకొన వచ్చును. మాత తన దివ్యవాస్తవికరూపముతో మనకు ప్రత్యక్షమైనచో, ఆమె ముందు మనము నిలువగలమా! మానవులతో సన్నిహిత సంబంధ మేర్పఱచు కొనుటకు గాను దివ్యమాత తన వాస్తవిక రూపమును మరుగు పరచుచు సామాన్య మానవమూర్తిగా ప్రవర్తించుచుండును. 'శక్తిముందు — భగవానుడు వెనుక' అని శ్రీఅరవిందులు నుడివిరి. 1926వ సంవత్సరమున సిద్ధిదినమున శ్రీఅరవిందులు ఏకాంతమును స్వీకరించి శ్రీజననిచే కార్యములను నిర్వర్తింపజేయుటకు కారణ మిదియే!

శ్రీఅరవిందులు 'శ్రీజనని' యను పుస్తకమున మాతను గురించి ఈ విధముగ రచించిరి.

"భగవానుడు మానవరూపమును దాల్చి మానవులకు దారి జూపుటకుగాను మానవ స్వభావమున కనుగుణముగ నడచుకొనుచు దివ్యత్వమును విడనాడ కుండును. అదియొక అవిర్భావము — దివ్యచేతనను బెంపొందించు అవిర్భావము,

మానవుడు దైవముగ మారుటకాదు. బాల్యమునుండి యాంతరంగికముగా జనని మానవచైతన్యమున కతీతముగ నుండినది..............అతీతమానసమును ఈ పృథ్వీతలమునకు గొనివచ్చుటకు శ్రీజనని యవతరించినది........... పృథ్వీ చైతన్య మతీతమానసమును పరిగ్రహించుటకు, జనని శరీరము దాల్చుటవకాశమై యది బరివర్తన మొందుటకు అవసరముగ నున్నది. ప్రథమ పరివర్తన మొందుటకు వీలుగనున్నది."

"ఈ జగత్తునందును, వ్యక్తియందును — జగత్తునకును, వ్యక్తి కతీతముగ నేకైక దివ్యశక్తి పనిచేయుచున్నది. మాత దీనికంతటికిని అంగా నిలచి, విషయాసక్తులతో గూడిన యీ జడప్రపంచమున నింకను ప్రస్ఫుట ...ని యొకానొకశక్తిని గొనివచ్చుటకును, జీవితమునే మార్పునొందించుటకును ఆమె కృషి యొనర్చుచున్నది — దివ్యశక్తియే యొకానొక ఘనకార్యమునకై కృషి సలుపుచున్నదని మీరు భావింపవలయును. ఆమె మానవశరీరములో నున్నదే కాని యామె చేతన దివ్యాంశలతో నైక్యమైయున్నది."

దైవప్రేమ శ్రీజననియందు మూర్తీభవించియున్నది. దివ్యప్రేమను ప్రసాదించుమని శ్రీమాత భగవానుని యిప్విధముగ ప్రార్థించిరి:—

"ప్రభూ! అనంతకరుణామయుగను, దివ్యప్రేమస్వరూపిణిగను నన్ను పరివర్తన మొనరింపుము."

"ఓ ప్రభూ! వెలుగును, హితోష్ణతను నిచ్చునగ్నివలె, దాహము తీర్చు బుగ్గవలె, నీడనిచ్చి రక్షించు వృక్షము పోలె నేనగునట్లు దయచేయుము."

దైవానుగ్రహము వలన, మాత దివ్యప్రేమస్వరూపిణిగ విరాజిల్లుచున్నందున ఆమె సాన్నిధ్యమున నెందరో దైవమార్గానురక్తులైరి. ఎన్నియో కళల నభివృద్ధిజేసికొనిరి. కవిత్వము, చిత్రలేఖనము, సంగీతము — ఇత్యాది కళలన్నిటిలోను అసామాన్యమైన ప్రతిభను గడించిరి. బిడ్డల పోషణ తల్లిగారే స్వయముగ వహించిరి. వారికి కావలసిన సదుపాయముల నేర్పఱచిరి; వారికి ఉత్తమ శిక్షణ నొసగిరి; వారికి గలిగిన సంశయములను దీర్చిరి. శ్రీజనని సాన్నిధ్యమున బిడ్డలు కన్నతల్లులను సయితము మరచిరి. అచ్చట పెరుగుచున్న

బిడ్డ లాదర్శప్రాయులై చక్కని అంగసౌష్ఠవము గలిగి విద్యావినయ సంపన్నులై రనిన ఇదంతయు శ్రీజనని కటాక్ష వీక్షణమే! విద్యయేకాదు, స్వయంపోషణ, క్రమశిక్షణ ఇత్యాది సుగుణము లెల్లర కలవడినవి. ఆశ్రమవాసులెల్లరును నిత్యము శ్రీమాతను దర్శించుచు తమతమ కార్యములలో నిమగ్నమగుచుందురు. మాత యనుమతిలేనిదే యే కార్యమును జరుపబడదు.

దివ్యజ్ఞానమును పొందుట మావంటివారలకు సాధ్యమా! యని కొందరు నిరాశజెందిన సమయమున శ్రీమాత వారిని కటాక్షించి తాము సహితము దుర్భర స్థితుల ననుభవింపవలసి వచ్చెనని నుడివిరి. అన్ని కష్టముల ననుభవించి యున్నందువలననే దుఃఖితులయెడ ఆమె కత్యంత సానుభూతి గలదని నుడివిరి. సూర్యోదయముతో నంతముకాని రాత్రులు లేవనియు, రాత్రి యెంతటి గాఢాంధకారమై యుండునో, అరుణోదయమంత స్పష్టముగను, ప్రకాశవంతముగ నుండ వచ్చుననిరి. విధివశమున మనము ఇడుముల బడవలసి వచ్చెననియు, దైవానుగ్రహము తప్పక లభించుననియు నుడివిరి.

"సూర్యరశ్మికి వీడిపోని మంచుతెర లుండవు గదా, వసంతఋతు వనుసరింపని శీతకాలముండదు గదా" యనుచు దైవానుగ్రహమును, ఎంతటి దుస్థితులందైనను హృదయము నిష్కపటముగ నున్నచో మనము పొందగలిగెదమని శ్రీమాత నుడివిరి.

శ్రీమాత రూపమున నవతరించినది దైవప్రేమయే! దైవప్రేమ శ్రీజనని యందు మూర్తీభవించుటచే విశ్వమునకన్న విశాలమైన దయార్ద్రహృదయము మెకు గలదు. ఆమె కరుణ యనంతము, అపారము.

'శ్రీమాత యనుగ్రహము, రక్షణ నీయందున్నప్పుడు నిన్నేమియు నంటజాలవు. నీవు భయపడవలసిన నిమిత్తము లేదు. ఆయనుగ్రహము రక్షణ లేశమాత్రమైన నున్నయెడల అది కష్టములనుండి, అపాయములనుండి రక్షింపగలదు.......' అని శ్రీఅరవిందులు "శ్రీజనని" అను తామురచించిన గ్రంథమునందు మాతను గురించి నుడివిరి.

మాత సర్వకాల సర్వావస్థలయందు బిడ్డలను సంరక్షించుచునే యుండును' ఆమెకు విరామమనునది లేదు. రాత్రి యే రెండు ఘంటలకాలమో సమాధి స్థితి

యందుండి యేదో యొకపనియందు నిమగ్నమై యుందురు. రాత్రి రెండుఘంటల నుంచి నాల్గుఘంటల వరకు మాత్రము నిద్రించుచుండిరి. అదియు సోఫాపై— మంచముపై గాదు. వారి గదిలో మంచముండెడిది గదు. ఆమె యెల్లప్పుడును సమాధి స్థితిలో నుండిరి. ధ్యానము—సమాధి—యివి నిద్రకన్నను విశ్రాంతి కరమని శ్రీమాత భావించిరి.

మనుజులు చాల అజ్ఞానులు, దుఃఖపీడితులు. సహాయమొంద వారెంతయు కోరుదురు. మాతృప్రేమ యందలి దృఢ విశ్వాసము దినదినాభివృద్ధి యగుకొలది ఆమె రక్షణ ప్రేమలు వారికి సర్వదా లభించుచున్నవి.

# 27

## శ్రీమాత నిర్యాణము

"ప్రగతియుక్తమైన,విశ్వవ్యాపకమైన సామంజస్యావిర్భావమే నాలక్ష్యము. మనమెల్లర హృదయాంతరంగమున దైవ సామ్రాజ్యమును స్థాపన మొనరించుట వలననే యీ యేకత్వసృష్టి నొనగూర్చ గలుగుచున్నాము. దీనికొఱకై వ్యక్తిగత, సామాజికమను రెండు స్తరములలో చరమ రూపాంతర మొనగూడవలసి యున్నది. ఈకార్య మే యన్యలోకములలోనో కాదు, పృథ్విలోనే సాధ్యమగును. మానవజాతిని సంపూర్ణ మొనరించినచో ఇది సంభవమగును."అని శ్రీజనని నుడివిరి. అసత్యము, అజ్ఞానము, అంధకారము, మృత్యువుతో గూడిన యీ ప్రపంచమునకు దివ్యానంద మును ప్రసాదించుటకు దివ్యశక్తి యవతరించినది. శ్రీఅరవిందానుగ్రహమును పొందినదై శ్రీమాత అతీతమానసము నీ భువికి దెచ్చుటలో వారి కెంతయో తోడ్పడి యెడతెగక కర్మయోగమును చేయుచు నెల్లరకును జ్ఞానభిక్ష పెట్టుచుండిరి. కాని, 1973వ సంవత్సరము ఏప్రిల్ మాసమునుండి శ్రీమాత పరిస్థితి ఆందోళన కరముగ నుండినది. అప్పటినుండి దర్శనపు కార్యక్రమములు నిలిపివేయబడినవి ఆమె యెక్కువకాలము విశ్రాంతి దీసికొనుచుండిరి. కొన్నిదినములైన తరువాత ఆమెకు కొంత ఆరోగ్యము చేకూరినది; మరల యెల్లర నాశీర్వదింప నిచ్ఛగించిరి

గాని యిక సాధ్యము గాదని భావించిరి. మే నెల 20వ తేదీన ఆమెకు లేవలేనంత పరిస్థితి యేర్పడి నందున భక్తులకు దర్శనమిచ్చుట మానివేసి ప్రక్కపై పరుండి, ఎల్లప్పుడును ధ్యానములో నిమగ్నమైరి. ఆమె ఆహారమును గైకొనుటకు ఇచ్ఛగింపరైరి. కాని, శిష్యులు కోరగా కొంత గైకొనుచుండిరి.

మే నెల 21వ తేదీనుండి మాత బాహ్యకార్యకలాపములకు స్వస్తిచెప్పిరి. ఆమె భౌతిక రూపాంతరము కొఱకై పనిచేయుచున్నటుల మనకప్పుడు స్పష్టమైనది. కాని, దాని పరిణామమేమగునన్నది యెవ్వరికి నవగతము కాలేదు. ఆమెను పరీక్షించిన వైద్యుల వ్యాధి చిహ్నము లేమియు నామెయందు గానవచ్చుట లేదని నుడివిరి. నవంబరు, 13వ తేదీన రాత్రిసమయమున పక్కనుండి కొద్దిగ లేవదీయుమని మాత ప్రణబ్ అను సాధకునాజ్ఞాపించిరి. తరువాత కొంతసేపటికి 4 ఘంటల ప్రాంతమున నిద్రించిరి. 14వ తేదీన మాత తమను నడపించుమని సాధకులతో ననిరి. ఆమె సరిగా నడవలేక ఒరిగిపోవుడచే మరల వారామెను పరుండబెట్టిరి. మరల నడపించుమని చెప్పగా సాధకులందుల కియ్యకొనలేదు. మరల ఆమె 'ప్రణబ్! నన్ను నడపించుము. కొంతసేపు నడచినచో నాకు స్వస్థత చేకూర గలదనిరి. నడపించినచో ఆమె క్రింది కొరగునేమో యన్న భయముచే వారామెను నడపింపరైరి. 15వ తేదీన సాధకులు చెప్పిన రీతిగ తల్లిగారు వినుచుండిరి వారొసగిన ఆహారపానీయాదులు సేవించుచుండిరి. 17వ తేదీ వఱకు బాగుగనే గడచినది. 18వ తేదీన ప్రత్యేకమైన మార్పేమియు లేదు. కాని, ముందు దినమున కన్న ఈ దినమున ఆహారమించు కధికముగా గైకొనిరి. సాయంకాలమున సాధకులు ఎప్పటివలె నామెను కూర్చుండజేయుటకు ప్రయత్నించగా నామె క్రింది కొరిగిరి. ఆమె దేహత్యాగ మొనరించు సూచన లప్పుడే గానవచ్చినవి. 7 ఘంటల 25 నిముసములకు ఆమె దేహమును త్యజించిరి.

ఆమె దేహము మేడమీద నుండి క్రింద ధ్యానమందిరమునకు తేబడినది. ఈవార్త ఉదయమున 3 ఘంటలకు ఆశ్రమవాసులకు తెలియజేయబడినది. 18వ తేదీన ఆశ్రమవాసులెల్లరును ఆమె యంతిమదర్శనమునకై తండోపతండములుగ

నేతెంచిరి. ఈ వార్త ప్రభుత్వశాఖల కన్నిటికిని తెలియజేయబడినది. 4-30 ఘంటలకు పుదుచ్చేరివాసులు తదితరులెల్లరు శ్రీమాతను కడపటి సారిగ దర్శించి పావనులైరి. తంతివార్తలద్వార టెలిఫోన్‌ల ద్వార ఈ వార్త మనదేశములోని ప్రజలకును కేబిల్స్‌ద్వార విదేశీయులకును తెలియజేయబడెను. మన అధ్యక్షుడు, ప్రధానమంత్రి ఇందిరాగాంధీ శ్రద్ధాంజలి ఘటించిరి. పుదుచ్చేరి గవర్నరు విచ్చేసి శ్రద్ధాంజలి నర్పించిరి.

ఈ సమయమున ఎల్లరకు తెలియజేయబడిన వార్తయందలి సారాంశ మిదియే:—

"నిన్నటి దినమున శ్రీజనని 7-25 ఘంటలకు శరీరమును త్యజించిరి. ఆమె దేహపరిత్యాగమునకు తాత్కాలిక కారణము గుండె ఆగిపోవుటయే।

శిష్యులు, భక్తులు, తదితరుల అంతిమ దర్శనమునకై శ్రీమాత దేహము ధ్యానమందిరమున నుంచబడినది. వీలైనంతవరకు ఆమె దేహముంచబడును. ఒక నూతన మానవజాతి యుద్భవమగునన్న ఆమె సందేశమెల్లరకును విదితమే। ఆమె యిచ్ఛ నేరవేరుగాక."

వైద్యులు వచ్చి మాతదేహమును దినమునకు రెండు పర్యాయములు పరీక్షించుచుండిరి. నవంబరు 19 వ తేదీన-20 వ తేదీ తరువాత ఆమె దేహమటులనే యుంచుటకు వీలుకాదని నుడివిరి. కాన 20 వ తేదీన మహాసమాధిచేయ విశ్చయించుకొనిరి. 20 వ తేది ఉదయమున మహాసమాధికై యేర్పాట్లన్నియు గావింపబడెను. శ్రీఅరవిందుల సమాధిపైననే మాతను సమాధి చేయుటకు ముందుగానే నిర్ణయించ బడియుండెను గాన, శ్రీమాత శరీర మొక పేటికలో నుంచబడి సమాధిచేయబడెను శ్రీనళినకాంతగుప్త, శ్రీజనని కుమారుడైన అంద్రే కొన్ని గులాబీరెక్కలను పేటికపై వేసి శ్రద్ధాంజలి ఘటించిరి. తరువాత పది నిముసముల పర్యంతము ఎల్లరును ధ్యానముచేసిరి. ధ్యానమొనర్చిన తరువాత పుదుచ్చేరి ప్రభుత్వమువారు, ఫ్రెంచివారు పంపిన పూలగుత్తులు పేటికపై నుంచ బడెను. అట్టితటి, ఆశ్రమవాసియైన శ్రీనళినీకాంతగుప్త యివ్విధముగ సందేశము నొసగిరి:—

"అమ్మా!

మీ భౌతిక శరీరము పూర్వసృష్టికి సంబంధించినది. ఏలన, మీరు మీ బిడ్డలతోనే యేకీభవింప గోరితిరి. మీరు నిర్మించుచున్న నూతన శరీరమును దృఢ పఱచగోరి యీ శరీరము నుంచగోరితిరి.

మీ బిడ్డల యొక్కయు ప్రపంచము యొక్క పిలుపు, అభీప్స, ప్రేమ, సమర్పణ, కృతజ్ఞతా పూర్వకముగ మీ పాదారవిందముల కడ నర్పింపబడినవి."

క్షుణ్ణముగా పరిశీలించినచో తల్లిగారిలో రెండు మూర్తిత్వములు మనకు గోచరింప గలవు. (1) దివ్యత్వము (2) మానవత్వము. బాహ్యదృష్ట్యా శ్రీజనని సామాన్య యువతివలె ఎల్లరతో కలిసి యుండి, యెల్లర కష్టములు తమవిగా భావించి తాము బాధపడుచు వానినుండి విముక్తి నొందుటకు విముక్తి బొందినశక్తిని గనపఱచుచు, తమలో నుండిన దైవశక్తిద్వార వీనిని బోగొట్టు కొనినట్లు నిదర్శనము జూపుచు నెల్లరకును ఆదర్శవ్యక్తిగా నుండినది. కాని, ఆంతరిక దృష్ట్యా ఆమెలో ఎల్లప్పుడు దివ్యత్వము మూర్తిభవించి, బాహ్య జీవితము కేవలము నటనగ నుండినది.

దివ్యమాతను గూర్చి 'భవానీ మందిరము' అన్న పుస్తకమున శ్రీఅరవిందు లిట్లు నిర్వచించిరి.

"ఒక దేవాలయము నిర్మించి భవానీదేవిని సేవించుటకై వినియోగింప వలయును............... ఈ పవిత్రమైన కార్యమునకు సహాయకారులుగ నుండుటకు ఆమె బిడ్డల నాహ్వానింపవలయును."

పుదుచ్చేరిలో వెలయుచున్న అరవిందాశ్రమమే భవాని నివాసముచేసిన పవిత్ర దేవాలయము. ఆ దేవాలయములోని శ్రీమాత విగ్రహమును దివ్యజీవితా కాంక్షాపరులైన స్త్రీ పురుషులెల్లరును జ్ఞానభిక్షకై, మనో వాక్కాయ కర్మముల ద్వార సేవించుచు తరించెదరు గాక!

# శ్రీమాత దివ్యమూర్తిత్వము

భగవానుడు సర్వేశ్వరుడు, సర్వాంతర్యామి. భగవానుని యుపాసింప వలయునన్న రెండు మార్గములు గలవు; అవియే సగుణనిర్గుణోపాసనలు. సగుణోపాసన జేయవలయునన్న యొక విగ్రహమవసరము. నిరంతరము విగ్రహము నారాధించుటచే ఆధ్యాత్మికము నందొకస్థితికి మనము చేరుకొందుము. శ్రీరామకృష్ణ పరమహంస, శ్రీత్యాగరాజు, శ్రీపోతన మొదలగువారు సగుణోపాసన జేసి చరితార్థులైరి. మనకు జ్ఞానవికాసము కలుగుకొలది ఒకానొక మూర్తియుండుననియు దానిని మనము సాక్షాత్కరింప చేసికొనుటకు యత్నించెదము. ఆ మూర్తిత్వమును మనము ప్రేమతోను భక్తితోను దరిజేరవలయును; కేవలము పాండిత్యముతో గాక ఆత్మార్పణము గావించుకొనవలయును. హృదయపూర్వకముగ భక్తితో ఆరాధింప వలయును.

శ్రీమాతా, శ్రీఅరవిందుల మూర్తిత్వములను దరిజేరవలయునన్న భక్తితోనే గాక వారి దివ్యచేతనయందొక భాగమైపోవలయును. శ్రీఅరవిందవిరచిత సావిత్రి కావ్యమును జదువునెడ కేవలము బుద్ధిసూక్ష్మత గాదు ఇందు ముఖ్యమైనది, మహత్తరమైన యామూర్తిత్వమును మనము సజీవముగనున్నటుల భావించి యారాధింప వలయును. అట్లుచేసినచో మనము దివ్యానందము నొందెదము.

మహాత్ముల గొప్పతనమేమన, ఆమెలోని, లేక ఆయనలోని, దివ్యత్వమే! పుట్టినప్పటినుండి తల్లిగారు అసాధారణమైన వ్యక్తి. బాల్యముననే తాని ప్రపంచమునకు చెందినది కాదని ఆమెకు బాగుగా విదితము. బాహ్యమున ఆమె సాధారణ యువతివలె నగుపించినను ఆంతరంగికముగ ఆమె దివ్యచేతనను విశాలమొనర్చిరి. ఆమె దివ్యపరిణామమును గూర్చి అమెతల్లికే తెలియదాయెను. శ్రీమాత ఆదర్శ కార్యకర్త్రి; కార్యములను సకాలమునకు, సమర్ధతతో నొనర్చుచుండిరి. విరామ మనునది లేక తల్లిగారు నిరంతరమేదో యొకపనిలో నిమగ్నమగుచుండిరి విశ్రాంతి యనునది ఆమె యెఱుగదు. రాత్రి సమయములందు, ఏ రెండు ఘంటల

కాలమో సమాధిస్థితియం దుండి మిగతసమయమంతయు పనిచేయుచుండిరి. ఆమె దృష్టిలో ధ్యానము, సమాధిస్థితియు నిద్రకన్నను చాల విశ్రాంతికర మైనవని తల్లిగారు తెలియచేసిరి. నిత్య కార్యక్రమములే గాక తల్లిగారు కళోపాసకురాలు కాన చిత్రములను చిత్రీకరించుచుండిరి. ఆమె చిత్రించిన చిత్రములను చిత్రకళాశాల యందు తరచు ప్రదర్శించుచున్నారు.

జ్ఞానవికాసమును వెదజల్లుచుండిన దరహాసవదనయై వెలుగొందుచుండిన శ్రీజనని దివ్యమూర్తిత్వమును చూచి తీరవలయునే కాని మాటలతో చెప్పుటకు సాధ్యము కానేరదు. భక్తుల యంతరంగము నామె చూచుచుండెడిది. ఆమె దృష్టి సోకినంతనే ఆమె యభయహస్తము భక్తుల శిరస్సును స్పృశించినంతనే కల్మష మంతయు మటుమాయమై బాధలు, వ్యధలు దూరమయ్యెడివి అమృత మొలికించు మహనీయ మధురమూర్తియైన మాత దర్శన భాగ్యమే భాగ్యము. 'వీక్షయాం దధతే దీక్షాం' అని శ్రీఅరవిందుల దివ్యమూర్తిత్వమును గూర్చి శ్రీ కపాలిశాస్త్రిగారు చెప్పినట్లు శ్రీమాత వీక్షణముతోనే మహదానందమును, శాంతిని ప్రసాదించుచుండిరి.

అప్పుడప్పుడు శ్రీమాత రూపము మారుచుండుట కద్దు ఇది ఆశ్రమవాసులు గమనించిరి. ఆమె చుట్టు సూక్ష్మరూపమున సువర్ణమయ వెలుగును ప్రత్యక్షముగ గాంచిరి. శ్రీమాత దివ్యమూర్తిత్వమును గూర్చి చెప్పవలయునన్న మందమతినైన నాకు ప్రతిభలేదు: ఏలన అది అనంతమైనది, అగాధమైనది. కనుక, నాకు తోచినన్ని కొన్ని విషయములు మాత్రమిందు రచించి విరమించుకొంటిని శ్రీఅరవిందా శ్రమమునందు ధ్యానమందిరమునందు శ్రీమాతారవిందుల చిత్రపటమును గాంచినచో వారిని ప్రత్యక్షముగ గాంచినంతానందము కలుగును. శ్రీమాత భౌతిక దేహము విడనాడినను భక్తుల జ్ఞాన చక్షువులకు దర్శన మొసగుచున్నారు. కాన ఆమాతృ మూర్తిని సేవించి తరించెదము గాక!

శ్రీమాత నిరాశావాది కాదు; ఆమెకు శిష్యులు వ్రాసిన వేలాదివేల లేఖలు వారి కష్టదశలు, దుఃఖములను గురించి సూచించుచున్నవి. వానికి బదులు లేఖలు వ్రాయుచు తల్లిగారు తమ యెడతెగని ఆశాభావమును (Optimism) వెదజల్లుచు, వారిను త్తేజపరచి, శాంతియను పునాదిపై జ్ఞానభవనమును నిర్మించుకొని, కర్మకాండ

కుమ్మ క్తులై ఆనందమయులు కండని దీవించుచుండిరి; ఈ లేఖలలో శ్రీమాత దివ్యమూర్తిత్వము శోభిల్లుచుండును. ఇట్టి దివ్యమూర్తిని మనము సేవించి, ఆమె అనుగ్రహమునకు పాత్రులమయ్యెదము గాక!

# 29

## శ్రీ మాత అనుగ్రహము

పూర్ణయోగమునందు సాధకుడు పరిపూర్ణత నొందగోరునేని గురుకటాక్షము, దైవానుగ్రహ మెంతేనియు నావశ్యకము. హృదయపూర్వకత, సమర్పణయు వాస్తవికమైనచో అనుగ్రహమన్న వర మాకస్మికముగ మనలను చేరును. శ్రీమాతానుగ్రహమును గూర్చి శ్రీఅరవిందు లొకపరి యిట్లు నుడివిరి:—

"నమ్మకము, హృదయపూర్వకత, మరియు సమర్పణ లెంత సంపూర్ణమైనచో అనుగ్రహము, రక్షణయు అంత శీఘ్రముగ నిన్ను జేరును. దివ్యమాతానుగ్రహము నీకడనున్నచో నిన్నంటుననేది? నీవు భయపడుటకు నిమిత్తమేది? లేశమాత్రమైన యనుగ్రహము నిన్నాటంకములనుండి, కష్టములు అపాయముల నుండి కడతేర్చును." మనము నిర్మలత్వమును హృదయపూర్వకముగ ఆకాంక్షించినచో, దివ్యానందము, వెలుగు, జ్ఞానము మనకు మాతనుండి యనుగ్రహింపబడును. ఆ దివ్యచైతన్యము మన మనః, ప్రాణ, శరీరములను మార్చి వేయును. అంత దైవానుగ్రహము ఎడతెగకుండ మనలో ప్రవేశించును. అనుగ్రహము కొఱకై పరితపించు భక్తుల మొరల నాలకించును దివ్యజ్ఞాన సంపన్నురాలైన శ్రీమాత. ఆ మహాతల్లి ధనవంతులు పేదవారన్న భేదములేక అందరిని సమానముగ కటాక్షించుచు చుండెను. సామాన్యమైన జీవితమును విడనాడ వలయునన్న, దివ్యమైన చేతనయందు నిమగ్నమగుటకు సాధకుడు యత్నించ

వలయును. దివ్యజీవనమును గడపవలయునన్న, శ్రీమాతానుగ్రహముండవలయును. అత్యధికమైన ఆమె అనుగ్రహము మానసిక వ్యాధులనుండి, భయములనుండి, కష్టములనుండి గట్టెక్కించును.

శ్రీమాత అనుగ్రహము పనిచేయవలయునన్న సాధకుడు సత్యమునే యాకాంక్షింపవలయును. సంకుచిత భావములను విడనాడి తన్నుతాను దైవమునకే సమర్పించుకొనవలయును. మానవప్రయత్న మభివృద్ధి చెందుకొలది, దైవానుగ్రహమున్నతస్థితి కవరోహించును. మాత యెల్లప్పుడును అనుగ్రహమును కురిపించుచునే యుండును. కాని దాని కర్హులైన వారలు దాని స్వీకరింతురు. మాత యొకానొక ప్రత్యేకమైన దేహమునకే పరిమితి నొందినది కాదు; ఆత్మ యున్మీలనమైనచో భక్తుడామె యునికిని, శక్తిని ఎల్లెడలను పొందగలుగును. ఆమె సర్వాంతర్యామి, సర్వజ్ఞ కనుక ఆమె అనుగ్రహము సత్యాన్వేషకులకు కరతలామలకము. ఒకానొక పర్యాయము సాధకుడొకడు తల్లిగారి నీవిధముగ ప్రశ్నించెను. "అమ్మా! మీరు నాలో హృదయపూర్వకత లేశమైనను గమనించితిరా?" అందులకామె యీవిధముగ ప్రత్యుత్తర మొసగిరి:—

"ఆ హృదయ పూర్వకత నీలో లోపించిన యెడల నీవు మాసాన్నిధ్యమును జేరలేవు." శ్రీమాతానుగ్రహము వలన సాధకులెందరో పురోగమించిరి. ఆమె అనుగ్రహమువలన సామాన్యమైన వారుకూడ, ఏమియు తెలియనివారుకూడ ఎన్నో యసామాన్యమైన విద్యలయందారితేరిరి. యోగాభ్యాసము చేయుటవలనను, తల్లిగారికి మనోవాక్కాయ కర్మలతో తను, మన, ధనముల నర్పించుటవలనను సామాన్యమైన వారుకూడ లలితకళలైన సంగీతమునందును, చిత్రలేఖనమునందు నత్యంత ప్రతిభను గడించిరి; కొందరు కవులైరి, మరికొందరు కర్మయోగమున నిమగ్నులై నిర్మాణకర్తలుగ రూపొందిరి. శ్రీమాత అనుగ్రహము, వెలుగు పృథ్వియం దవరోహించుటకే ఆశ్రమవాసులు పాటుపడుచున్నారు. దర్శనసమయములందు శ్రీమాత యొసగెడి కాగితపుసంచుల (Flower packets) యందామె యనుగ్రహ మిమిడి యుండెడిది. దాని ప్రాధాన్యతను గూర్చి తల్లిగారే తమ శ్రీముఖమునుండి యిట్లు చెప్పిరి.

"అందులో కొన్ని రేకు లుండును, అవి పుష్పపు రేకులు, అయితే అవి నా శక్తితో కూడియుండును. వాటిని మీరుంచుకొనినచో, నాతో సన్నిహిత సంబంధ మేర్పడును. వాటిని గమనించినచో నాతో సన్నిహిత సంబంధమే గాక ప్రత్యుత్తరము గూడ లభించును."

ఆధ్యాత్మిక పంథ సుగమమైనది గాదు, ఇందడుగు వేసిన ప్రతిమానవునకు ఇడుముఙ్ఱు తప్పవు. ప్రయాణీకుడు గమ్యస్థానము జేరవలయునన్న మార్గ మధ్యమున పడరాని పాట్లుపడి తుదకు చేరవలసిన ప్రదేశమును చేరినట్లు, సాధకునకు పరిపూర్ణమైన జ్ఞానము చేకూరవలయునన్న సాధనయందు కలిగెడి కష్ట సుల కోర్చుకొనుటకు వలయు యోరిమెంతేనియు నవసరము. అట్టి కష్టసమయములందు ఓరిమి కొంచెము సడలినచో వెనుకకు మరలు ప్రమేయము గలదు. దుష్టశక్తుల దాడికి తట్టుకొనలేక వెనుకకు మరలినచో, మరి గమ్యస్థానమును జేరకపోయిన ప్రయాణీకున కెంత వ్యథకలుగునో అట్టివ్యథ సాధకునకును కలుగుట కద్దు. ఇట్టి విషమ పరిస్థితులలో మాత సహాయ మర్థించి నచో ఆమె మనలను "ముందగుడు వేయుము. తక్షణమే అత్యంతమైన ప్రగతి నొందుదువు" అని మనల నుత్సాహ పరచును. యోగవైశిష్ట్యమును గూర్చి చెప్పుచు, దానిని వీడకుమని మనల నీ విధముగ హెచ్చరించిరి.

"ఈ మార్గము వీడినచో, దీనిని పొందుట కష్టతరము. విపరీతమేమన, దీనిని వీడినచో, నీవు పోగొట్టుకొనినట్లే! ఈమార్గమును వీడిన మనుజులు మరల దీనిని పొందుట కెంత ప్రయత్నించినను పొందలేక పోవుచున్నారు. అన్ని దేశముల గాథలే యిందులకు తార్కాణము.

ఈ మార్గమునందు నీవుండినచో దానిని వీడకుము. ఇందడుగిడుటకు ముందు, ఎంతేనియు నీవు సందేహించవచ్చును. ఇందడుగిడిన తరువాత దీని నుండి తప్పుకొనకుము ............"

అనుగ్రహమునకు మించినదేదియు లేదు. శ్రీమాతానుగ్రహమును పొంద వలయునన్న మనహృదయములు ఇనుపముద్దగా నుండవలయును. అట్లయినచో

ఇనుమును అయస్కాంత మాకర్షించినటుల తల్లిగారు మనలను తనవైపు లాగు కొందురు.

దైవానుగ్రహమున శ్రీకాళిదాసు మహాకవి యయ్యెను. దైవానుగ్రహము వలననే శ్రీవాల్మీకి రామాయణ మహాకావ్యమును, శ్రీబిల్వమంగళుడు వీనుల విందొనగు శ్రీకృష్ణకర్ణామృతమును రచించి ధన్యులైరి. దైవప్రేరణ, దైవానుగ్రహము లేనిచో అంతటి మహాకావ్యములు రచించుట సాధ్యము కానేరదు. శ్రీతులసీదాసు, శ్రీత్యాగరాజు మొదలగు భక్తులు దైవానుగ్రహము వలననే గొప్ప కవి-గాయకులైరి. శ్రీతులసీదాసు శ్రీరామచరిత మానస కావ్యారంభమున దైవానుగ్రహమును గూర్చి యిట్లు చెప్పిరి.

"మూక హోఇ వాచాల పంగు చఢఇ గిరిబర గహన।

జాసు కృపా సో దయాల ద్రవఉ సకల కలిమల దహన॥

భావార్థము:— ఎవ్వడు తన దయాలేశముచేతనే, మూగవానిని వాచాలునిగను, కుంటివానిని పర్వతారోహకునిగను చేయగలడో, ఆకృపాస్వరూపుడును, కలిమల విధ్వంసియునగు పరమాత్ముడు (మాధవుడు) నాపై దయార్ద్రభావము వహించును గాక।

వైష్ణవ తత్త్వములో దైవోపలబ్ధికి దైవానుగ్రహమే శరణ్యమని చెప్పబడి యున్నది. భగవద్గీతను సమగ్రముగ జదివినచో దివ్యగురువైన కృష్ణపరమాత్ముడు మానవ మాత్రుడైన అర్జును నెట్లనుగ్రహించినది తెలియనగును. దివ్యప్రేమయే దివ్యానుగ్రహమని శ్రీమాత తెలయజేసిరి. అనుగ్రహమును గూర్చి శ్రీమాత యొకసారి సాధకుల కిట్లు తెలియజేసిరి. "పరమేశ్వరుడు ప్రపంచమును రక్షించుటకే తన యనుగ్రహము నిట ప్రవేశపెట్టెను." అనుగ్రహము సర్వకాల సర్వావస్థలయం దందుబాటులో నుండును. భక్తి, హృదయ పూర్వకత యుండినచో అది ఆకస్మికముగ మనలను చేరును. గజేంద్రుని దపాయ స్థితిలో నున్నప్పుడు భగవాను డనుగ్రహింపలేదా। ద్రౌపది మొరాలకించి శ్రీకృష్ణుడు వలువల నొసగలేదా। దైవాను

గ్రహమున కింతకన్న తార్కాణము లేమి గావలయును? అనుగ్రహమును గూర్చి తల్లిగారీవిధముగ తెలియజేసిరి.

“దివ్యానుగ్రహము, దివ్యప్రేమ ప్రధాన సత్త్వయం దొక్కటే అనుగ్రహము లేకయే ప్రేమ యుండవచ్చును. ప్రేమలేకయే అనుగ్రహముండ వచ్చును అయితే ముఖ్యముగా మానవ చేతనకు, అనుగ్రహాభివ్యక్తి పరమ ప్రేమాభివ్యక్తియే యగుచున్నది.”

ఆకస్మికముగా శ్రీమాతానుగ్రహము కలిగినంతనే పలువురు వారికి తెలియకుండగనే ప్రగతి నొందుచున్నారు. దివ్యజీవన వికాసమున కర్హులగుచున్నారు. ఇందు ముఖ్యముగా మనమేమి చేయవలయుననన్న, “అంతయు శ్రీజననికే మేము సమర్పించుచున్నాము, ఆమె యేవిధముగ నడిపించునో ఆ విధముగ బోవుటకు సంసిద్ధుల” మని సర్వస్వమును ఆమెకే వదలివేసినచో అనుగ్రహము నామెయే ప్రసాదించును. ఆమె అనుగ్రహ మాత్రమున, కృపాకటాక్షవీక్షణమున, పతితుడు కూడ పావనుడగును; అంత దివ్యప్రబోధము కలుగును; అది కలిగినంతనే దివ్యజ్ఞాన వికాసము కలుగును. కాని యిందు మన కర్తవ్యమేమనగా, ఎన్ని యిడుముల పడినను, దైవమునందు విశ్వాసమును గోల్పోక, ఈ కష్టములే ప్రగతికి సోపానములని యెంచి అత్యంతమైన ధైర్యస్థైర్యములతోను, అచంచలమైన పట్టుదలతోను ముందుకు పురోగమించవలయును. ఈ ప్రాపంచిక జీవనమునందు జ్ఞానము మృగ్యము. ఇందు జ్ఞానోపార్జన చేయవలయునన్న బహు కష్టతరము. ఈ మార్గము సుగమమైనది కాదు. ఇందు దుష్టశక్తుల తాకిడి యుండుట వలన ఆర్జించిన జ్ఞానమును కోల్పోవు ప్రమేయము కలదు. కనుక ప్రతిక్షణమును మనము దివ్యక్షణముగ నెంచి ‘జీవితమంతయు యోగమే’ యన్న శ్రీఅరవిందుల సూక్తి నుపలబ్ధి బొందుచు, తల్లిగారి ననుగ్రహించుమనియు, అనుదినము కావుమనియు, ప్రార్థించినయెడల మన బాధ్యత నామెయే స్వీకరించును, దుష్టశక్తుల బారినుండి మనలను కాపాడును.

యోగాభ్యాసముచేతను, శ్రీమాతానుగ్రహము వలనను పెక్కుమంది గాయకులు, కవులు, చిత్రకారులైరి. ఒక బాలిక అసామాన్యమైన ప్రతిభను గడించిన వైనమును గూర్చి శ్రీజనని యిట్లు వక్కాణించిరి:—

"ఏమియు నెఱుగని—కనీసపు విద్యయు నేర్వని—యొకానొక బాలిక కేవలము నాట్యకత్తె. ఆమె నాట్యమునందు ప్రవీణురాలు. యోగాభ్యాస మలవడిన తరువాత ఆమె ప్రదర్శనము లిచ్చుట మానివేసి తన స్నేహితురాండ్ర సమ్ముఖమున మాత్రము నాట్యము చేసెడిది. ఆ నాట్యము ముందుకన్నను మెఱుగై ఆమెకు సంపూర్ణమైన, అగాధమైన భావస్ఫూర్తి యలవడినది. విద్యావంతురాలు కాని ఆమె మహత్తరమైన ఆశ్చర్య ముట్టిపడు రచనల నెన్నింటినో చేసినది.

ఆమెకు కలిగిన మహాద్దర్శనములను (Visions) బహు సొగసుగా మృదు మధుర పద లాలిత్యముతో చక్కగ వ్యక్తపరచినది. కాని ఆమె యోగాభ్యాసము నందు యెగుడుదిగుడు లున్నందువలన ఆమె మంచిస్థితియందున్నప్పుడు మధురముగా వ్రాయుచుండెడిది; అన్యసమయములందు అవివేకముగను, మందబుద్ధియై, రచనా సామర్థ్యము లేకయుండెడిది.

పూర్ణయోగమున ప్రగతికి అనుగ్రహమే ఏకైకసాధనమని శ్రీమాత నుడివిరి. అనుగ్రహమును గూర్చి యింకను ఇట్లు తెలియజేసిరి:—

"మన సంకల్పములను దైవానుగ్రహమున కర్పణము చేయుదము గాక! దైవానుగ్రహమే అన్నియు మనకు నెరవేర్చును."

"సర్వావస్థలయందును దైవానుగ్రహముపై నాధారపడుట మనము నేర్చుకొని సహాయము కొఱకై దాని నాహ్వానింపవలయును. అప్పుడది యద్భుతముల నొసగును."

మనము సర్వదా శ్రీమాతకు ఉన్ముఖులమై, శ్రీమాతనే ధ్యానించుచున్న యెడల ఉన్నత చేతన మనయందు ప్రవేశించి, ఆమె యనుగ్రహముచేత మన

సత్తసంతటిని పరిణామము నొందించును. మనలను దుర్బలులనుగా జేయు వ్యాధులు, భయము కూడ శ్రీమాతానుగ్రహముచేత మనలను విడిచిపోవును. కేవలమామె వద్దనున్న వారికి మాత్రమే గాక దూరప్రదేశములందున్న వారి సయితమామె యనుగ్రహము లభించును. ఎట్టి ఆపదలు కలిగినను శిష్యులు పరిపూర్ణమైన విశ్వాసముతో, వారి వారి బాధలను ఉత్తరముల ద్వార శ్రీతల్లి గారికి తెలుపుకొని ఆమె అనుగ్రహమునకు పాత్రులగుచుండిరి. అగరువత్తుల సువాసన యెంత సుఖమయమో, పుష్పసౌరభము నాఘ్రాణించుట యెంత యానందదాయకమో, మాతానుగ్రహమంతటి శక్త్యానందముల నొనగూర్చును. కనుక శ్రీమాతానుగ్రహమునకు పాత్రులగుదుము గాక।

# మాతృస్తవము



జయ జగజ్జనని మిరాంబ। జయ శ్రీ సద్గురు శ్రీఅరవిందః శ్రీఅరవింద జయ అరవిందః చైతన్యమయి మిరాంబ। చైతన్యస్వరూప శ్రీఅరవింద। శ్రీఅరవింద జయ అరవిందః జ్ఞాన ప్రదాయిని మిరాంబ। జ్ఞానప్రద శ్రీఅరవింద। శ్రీఅరవిందః



జయ అరవింద। ఆనందమయి మిరాంబ। ఆనంద స్వరూప శ్రీఅరవింద, శ్రీఅరవింద జయ అరవింద। యోగీశ్వరి శ్రీమిరాంబ। యోగీశ్వర శ్రీఅరవిందః శ్రీఅరవింద జయ అరవింద। సత్యమయి మిరాంబ। సత్యసంధ శ్రీఅరవింద, శ్రీఅరవింద జయ అరవిందః సద్గురు శ్రీఅరవిందః

ఆర్. ఇందిరాదేవి